# నయనామృతము

## ఆంధ్ర నాటిక రాజము



భావరాజు వేంకట సుబ్బారావు, బి. ఏ.,
వసంతవాడ

# అంజలి

పూజ్యులైన నా అన్నగారిచే చాల పూర్వ కాలముననే రచించబడిన ఈనాటకరాజము వారి జీవిత కాలములోగాని, తిరువాతగాని వెలుగుచూడక వ్రాత ప్రతిగనే ఉండిపోయింది.

నేడు నా కుమారులు గ్రంథ ముద్రణమునకు పూనుకుని రసికలోకమునకంద చేయుచున్నారు. వారికి నా అన్నగారి ఆశీస్సులు ఉండును.

నా చిన్నతనముననే మా తండ్రిగారైన చిన్నాచార్యులుగారు పరలోకగతులుకాగా నన్ను అన్నివిధములా కాపాడుచూ పలువిధములయిన కుటుంబచిక్కుల నెదుర్కొన్నారు. తన స్వార్థమును విడిచి నా కుటుంబాభివృద్ధినే కాంక్షించి శ్రమించిన త్యాగనిరతులు.

వారి స్మృతి చిహ్నంగా యీ అముద్రితమును ప్రకటించుచూ ఆ పూజ్యులకు అంజలి సమర్పించు కొనుచున్నాను.

గ్రంథ ప్రచురణములో ప్రోత్సాహమిచ్చి తోడ్పడిన సాహిత్యప్రియులు శ్రీ సామవేదం జానకి రామశర్మ, శ్రీ ఇంద్రకంటి సూర్యనారాయణమూర్తి గారలకు నా కృతజ్ఞతలు.


వసంతవాడ
శ్రావణ-
రక్షాక్షు
1984

ఇట్లు విధేయుడు
**భావరాజు వేంకటరమణమూర్తి**
ప్రచురణకర్త

# ముందుమాటలు

రమ్యం జుగుప్సిత ముదార మథాపి నీచమ్
ఉగ్రమ్ ప్రసాది గహనం వికృతం చ వస్తు
యద్వా ప్యవస్తు కవిభావకభావ్యమానమ్
తన్నాస్తి యన్న రసభావ ముపైతి లోకే -

కవి లోకానికి ఇతరులచేత తెలియబడని, ఒక నూతనమూ ప్రయోజనకారీ అయిన సందేశాన్ని అందిస్తూ, జాతిని ఉత్తేజితం కావించి నిత్యనూతనస్థితిని నీతిధర్మాలకు భంగం కలుగకుండా ఉండేటట్లు చేస్తూ, వేయికళ్ళతో కనిపెట్టి ఉంటాడు. ఏ భాషలో అయినా, కవి తాను తనధర్మాన్ని తు.చ, తప్పకుండా నెఱవేర్చినప్పుడే ప్రజాదరణ పొంద గలుగుతాడు. అయితే—ఈ విధంగా తన ధర్మాన్ని నిర్వర్తించటానికి ఆకవి కవితావస్తువును—ముఖ్యంగా ఉన్నతమూ, ఉత్తమమూ అయిన దాన్ని ఎంచుకోడంలో శ్రద్ధ వహించవలసి ఉంటుంది అని రసజ్ఞులు భావిస్తారు. ఆలా భావించటంలో వారి అభిప్రాయం ఏమంటే — వస్తువు యొక్క ఔన్నత్యం జాతికి బోధించటానికి తగిన నీతిధర్మాలతోపాటు ఆనందావిర్భూతిని కూడా సమకూర్చకలగటమే కాగలదని, ఇది లోకంలో సామాన్యంగా ఉత్తమ కవిత్వధర్మాన్ని ఆస్వాదించటానికి అర్హతగల సహృదయలోకం ఆహ్వానించే విధంగా భాసిస్తుంది — కాని, సంస్కృత భాషలో కవిత్వానికి మనోహరత్వమూ ధార్మికస్థితి చేకూర్చటానికి ఉన్నతమూ, ఉత్తమమూ అయిన వస్తువే అక్కరలేదని ప్రాచీనకాలంనాడే నిర్ణయం చేసినట్లు పైశ్లోకం విశదం చేస్తోంది. ఈ శ్లోకంలో — వస్తువు రమ్యం అయినా, కాకపోయినా, రోతపుట్టించేది అయినా, నీచమైనది అయినా సర్వవిధాలా సామర్థ్యంగల కవిచేతిలో పడితే అది రసోజ్జ్వలం అవుతుం దని చెప్పటం జరిగింది. దీనివల్ల కవికి కావలసిన ప్రతిభా

వ్యుత్పత్తులు అంతంతమాత్రంగా వుంటే సరిపోవనితేలింది. ఈమహోన్నతమైన కవితా ప్రాగల్భ్యాన్ని కవులు సంతరించుకోవాలనీ, అలా సంతరించుకొన్నప్పుడే కవి సమాజానికి సరియైనసేవ చేయగలడనీ. పూర్వులు సత్యమే భావించినట్లు దీనివల్ల తెలుస్తోంది.

కవిలో సామాన్యమానవులలో లేనివిశిష్టధర్మాలు పుట్టుకతోనే భగవంతుడు ఉండేటట్లు చేస్తాడు. దీన్నే ఆలంకారికులు "ప్రతిభ" అని అనటం జరిగింది. ఆతరవాత కవి ఆప్రతిభాసంపదకు తోడుగా అప్పటికి వున్నసాహిత్యాన్ని జీర్ణంచేసికొని, మనోజ్ఞమూ మహిమాన్వితమూ భావసంవర్ధకమూ అయిన వ్యుత్పత్తిని వృద్ధిచేసుకొంటాడు.

ప్రతిభా వ్యుత్పత్తులు పుష్కలంగా తనలో జీర్ణంచేసికొని తాను నివసించివున్నకాలాన్ని సునిశితంగా పరీక్షిస్తూ అంతతో సంతుష్టి పొందక భవిష్యత్తునుగూడా ప్రతిభాపూర్ణుడై కవి తిలకించగలుగుతాడు. ఇట్టికవి సర్వాంగసుందరంగా తన కావ్యం సృష్టికావటానికి అత్యంత ఆవశ్యకాలైన వ్యాకరణాన్నీ సాహిత్యశాస్త్రాన్నీ పరిశీలిస్తూ ఆనందమే ముఖ్యాంశంగా ఉండేటట్లు ఔచితీభంగం కాకుండా, లోకానికి అనుపమ సందేశాన్ని అందించగల కావ్యాన్ని నిర్మిస్తాడు. కావ్యనిర్మాణ విషయంలో వ్యాకరణంయొక్క ఆవశ్యకత ఎందుకంటే, తాను వ్రాసే భాషలోగల రకరకాలైన శబ్దాల నిర్దోషత్వాన్నీ, శుద్ధినీ తెలిసికొని ప్రయోగించటంకోసమే—అలాగే సాహిత్యశాస్త్రాధ్యయనంకూడా, భిన్న భిన్నవిధాలుగ ఉండే శబ్దాలలోని రామణీయకం అవగతం చేసుకోటానికే; ఉత్తమకవి ఈ విధమైన శక్తిని సంపాదించిన తరవాతే కావ్యరచనకు పూనుకుంటాడు.

తగినంత శక్తి సంపాదించుకొన్న కవి కావ్యరచనకు పూనుకొన్నప్పుడు ముందుగా తెలుసుకోవలసిన ముఖ్యాంశాలను అంటే — ఏది

ఉత్తమకావ్యం ? కావ్యాత్మయేది ? కావ్యప్రయోజనం ఏది ? ఏవిధంగా రచనచేస్తే కావ్యసౌందర్యం భాసిస్తుంది ? అనే పలు అంశాలనుగూర్చి తెలుసుకోవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంటుంది. ఇతరశాస్త్రాలు అయా విషయాలను కూలంకషంగా చర్చించి విషయనిర్ణయం చేసినట్లే, ఈ కావ్యరచనా పద్ధతిని బహుముఖాలుగా పరిశీలించి, ప్రాచీనులు సంస్కృత భాషలో విపులంగా, యుక్తియుక్తంగా అనేకగ్రంథాలు రచించారు. అవి స్థూలంగా 'అలంకారగ్రంథాలు' అనే పేరుతో పిలువబడుతున్నవి. అలంకార గ్రంథాలు రమారమి సంస్కృతభాషలో ఆయాకాలాలలో, ఉత్తమ కావ్యసిద్ధికి దోహదం చేయటానికి వీలుగా సుమారువేయి రచింపబడ్డవి. ఇన్ని గ్రంథాలు ఆవశ్యకం అయినవా అని సందేహం కలగవచ్చు. దీనికి ఆయారచయితలలో ఉన్న సాహిత్యశాస్త్ర సంశుద్ధికి తగినసముచిత కృషిని చేసే ఉత్తమసంకల్పమే కారణం అని భావించి సమాధానపడటం సమంజసమే అవుతుంది. ఆగ్రంథాలలో కూడా కొన్ని పూర్వగ్రంథాలలో నిర్ణయించిన సిద్ధాంతాలకు భిన్నంగా, క్రొత్తసిద్ధాంతాలు కూడా ఉన్నవి. మొత్తంమీద సంస్కృతభాషలో ప్రాచీనులు ప్రాచీనకాలంలోనే భాషా సౌష్ఠవం, కావ్యోన్నతి, కావ్యానందకరస్థితి, తగ్గకుండా ఉండటానికి శతథా, సహస్రథా ప్రయత్నాలు చేశారనటం నిజం.

ఇక మనకు తెలుగులో దోషరహితమూ సౌందర్యయుతమూ ఆనందవర్ధకమూ అయిన కావ్యావిర్భావము కొన్ని వందలసంవత్సరాల క్రితమేఏర్పడింది. దీనికికూడా సంస్కృతంలో కావ్యాలకు నిబంధించిన విధానాలే కొలతబద్దగా అంగీకరించటం జరిగింది.

మహర్షులైన ప్రాచీనకవులు, తమకావ్యాలలో మూడుకాలాలలోనూ నిలవగలిగే రససిద్ధిని ప్రస్ఫుటంచేసే, మనోజ్ఞతను రూపొందించే సముచితశబ్దాలనూ,భావాలనూ పొందుపఱచినట్లు సహృదయులైన పాఠకులకు తెలియనిదికాదు, తగిన విధంగా, దోషరహితంగా రసోత్పత్తిప్రధా

సౌందర్యాన్ని ఆనందించ లేముగదా" అని ఇంతతో, కావ్యాన్ని గురించి పూర్వుల భావాలు దిఙ్మాత్రంగా చెప్పటం అయింది.

ఈ విధంగా రసాస్వాదన యోగ్యం అయినకావ్యాన్ని, పూర్వులు శ్రవ్యకావ్యం అనీ, దృశ్యకావ్యం అనీ రెండువిధాలుగా పేర్కొన్నారు, దృశ్యకావ్యం అంటే నాటకం. ఈ నాటక లక్షణాలను గురించి ముందుగా వెలుగులోకి వచ్చిన లక్షణగ్రంథం భరతుని నాట్యశాస్త్రం. ఆ తరువాత సంస్కృతంలోనే పదునాల్గవశతాబ్దిలో కావ్యవిషయాలతోపాటు దృశ్య కావ్యలక్షణాలను కూడా విశ్వనాథ పంచాననుడు తన సాహిత్యదర్పణంలో వివరించటంజరిగింది. ఆ సమయంలోనే ఆంధ్రుడైన విద్యానాథుడు, సంస్కృతంలోనే ఆంధ్రప్రభువగు ప్రతాపరుద్రమహారాజున కంకిత మిచ్చిన 'ప్రతాపరుద్రీయం' కూడా వెలుగులోకి వచ్చింది. అయితే, ఈ రెండులక్షణ గ్రంథాలనూ సమీక్షించి నట్లయితే, సాహిత్యదర్పణం నాటకలక్షణసర్వస్వం అని పేర్కొనటానికి తగినవిధంగా భాసిస్తూ ఉన్న దనటానికి సందేహంలేదు.

అసలు శ్రవ్య కావ్యరచనతోనే, ఆగక ప్రాచీనులు దృశ్యకావ్యం అయిన నాటకాన్ని ఎందుకు వ్రాయవలసివచ్చిందంటే - సామాజికునకు కేవలం బోధించుటద్వారా కాక, ఆ నాటకంలోని సన్నివేశాలతోపాటు, వివిధ పాత్రల అభినయము ద్వారా, ఆయా విషయాలు అనుభవంలోకి రావటంకోసమే। చదివినప్పుడు మనస్సుకూ బుద్ధికీ ఏ విధమైన అను భూతి ఏర్పడుతుందో, అంతకంటె ఎక్కువగా, రసాన్నీ సౌందర్యాన్నీ గ్రహించటానికి యోగ్యత సంతరించుకొన్న కన్నూ, చెవీ, ప్రత్యక్షంగా రసానుభూతిని తన్మయత్వంతో అంతఃకరణకు చేకూర్చటానికి వీలు కలుగచేస్తుంది. అందువల్లనే నాటకం, అంటే - దృశ్యకావ్యం శ్రవ్య కావ్యంకంటే ప్రయోజనం చేకూర్చేది అయింది.

ఆంధ్రభాషలో శ్రవ్యకావ్య రచన, సంస్కృత లక్షణగ్రంథాల్ని అనుసరించి ముందుగా ఉద్భవించినా, దృశ్యకావ్యరచనమాత్రం వెంటనే ఏర్పడలేదు. ఆంధ్ర భారతరచన ఆరంభింపజేసిన రాజరాజనరేంద్రుడు కానీ, మనుమసిద్ధి కానీ, చివరకు ఆంధ్రభోజుడైన శ్రీకృష్ణదేవరాయలు గానీ ఏకారణం చేతనో తెలుగులో నాటక రచనను ప్రారంభింపజేయ లేదు. కాగా - వారుమాత్రం సంస్కృతనాటకాలను చదివి, ప్రదర్శనకు ఏర్పాటుచేసి ఆనందించియుండవచ్చును.

పందొమ్మిదవ శతాబ్ది ఉత్తర భాగంలో మాత్రం అభిజ్ఞానశాకుంత లాదులు ఆంధ్రమునకు పరివర్తనం కాగా అటనట ఆ నాటకాలు ప్రద ర్శింపబడినట్లు చరిత్రకారులు తెలియజేశారు.

సంస్కృతభాషలో ఉత్తమ నాటకరచనకు మార్గదర్శకం అయింది, క్రీస్తుపూర్వం సుమారు మూడువందలసంవత్సరాలనాడు జన్మించియుండిన భరతముని వ్రాసిన నాట్యశాస్త్రం అని చెప్పటం జరిగింది. ఆ మహర్షి ప్రసాదించిన ఆగ్రంథమే కాళిదాసాది మహాకవుల అభిజ్ఞాన శాకుంతలాది ప్రపంచ ప్రఖ్యాతిచెందిన నాటకాలు ఉద్భవించటానికి దోహదం చేసింది. సంస్కృత నాటకాలు చదివినా, ప్రదర్శింపబడగా చూసినా కూడా, పఠితకూ ప్రేక్షకునకూ కూడా ఆనందానుభూతి కలుగుతుంది. కారణం ఏమంటే వాటిలో శ్రవ్యకావ్యలక్షణాలూ, విశేషించి దృశ్యకావ్యలక్ష ణాలూ కూడా సంపూర్ణంగా ఉండటం వల్లనే -

భరతముని తరువాత నాటకలక్షణాలను వివరిస్తూ లోకజ్ఞతమూర్తీ భవించిన, శాస్త్రకావ్య సంపద పుష్కలంగా సంపాదించిన - ధనంజయ కవిచంద్రుడు, దశరూపకం వ్రాయటం జరిగింది. దశరూపకంలో వ్రాయ బడ్డ సూత్రాలకు తరువాతివాడైన ధనికుడు వివరంగా వ్యాఖ్యరచించి దశ రూపక ప్రాశస్త్యాన్ని లోకానికి తెలియజేశాడు. ప్రాచీన సంస్కృతనాటక

కవులు చాలావఱకు దశరూపకంలో వ్రాయబడ్డ సూత్రాలను తమ శక్తి కొలది అనుసరించి నాటకం ఉత్తమ కావ్యశ్రేణికి చెందేటట్లు చేశారు. దానివల్ల సంస్కృతం రాని తెలుగువారు, అనువాదాలను చదివి, దశరూపకాదుల్లో పొందుపఱచిన లక్షణాలకు లక్ష్యాలు తెలిసికొని ప్రాచీనుల సాహిత్య కళకు నీరాజనం పట్టటానికి వీలేర్పడింది

తెలుగులో, తొలుత వెలయించిన నాటకాల్లో, సంస్కృత నాటకాల లక్షణాలను కొంతవరకు ఆయా కవులు పాటించినా, శ్రమతో కూడిన పనికావడంచేత తరువాతివారు వాని జోలికిపోలేదు. దీనికి ఆంగ్ల భాషాసంపర్కంకూడా కొంత తోడ్పడి ఉండవచ్చు. "గతానుగతికో లోకః" అని కదా ఆర్యోక్తి.

ప్రస్తుతం "నయనామృతా"నికి సంబంధించి నాలుగు మాటలు వ్రాయటుండా, డొంకతిరుగుడుగా శ్రవ్య దృశ్య కావ్య విశిష్టతలను సంగ్రహాతి సంగ్రహంగానైనా ఎందుకు వ్రాయవలసివచ్చిందంటే – సాహిత్యానికి శాస్త్రాలకు ఉన్న గౌరవాదరాలను మించిన, రసోన్నత స్థితి కలదనీ, ఈ సాహిత్యశాస్త్రం అన్యశాస్త్రాలకంటే, ఆనందావిర్భూతి పాఠకునికి ప్రేక్షకునకూ కూడా కలగచేస్తుందనీ చెప్పటానికే; దీనినిబట్టి మన ప్రాచీనులకు సాహిత్యశాస్త్రంపైనిగల ఉత్తమగౌరవం తెలుస్తుంది. అంతేకాదు – ఈ కావ్యాలలో ప్రతిష్ఠించబడ్డ రసానందావిర్భూతిని అనుభవంలోకి సహృదయులు తెచ్చుకొని, రసస్వరూపుడైన పరమాత్మునకు చేరువకావటానికి కూడా వీలు ఉన్నది అని చెప్పటానికే.

కాలంతో అభిరుచులు మారుతూవుండటం సత్యమే – అయినా – ఆ అభిరుచులలో చెడ్డవానిని వదలి మంచివానిని జీవితంలో అనుసంధింపజేయటానికి, జన్మాంతర పుణ్యవాసనాబలం ఉన్నవారు ప్రయత్నించేస్తూ ఉండటం గమనిస్తూనే ఉంటాం. మనకు సంస్కృతి, సంప్రదాయం

# నయనామృతము

పూర్వకవులు కావ్యరచనలో ఎంత శ్రద్ధవహించారో, ఆ కావ్యానికి పేరుపెట్టటంలోకూడా అంత శ్రద్ధావహించారు. 'అభిజ్ఞానశాకుంతలము' 'ఉత్తరరామచరితము' మొదలైన పేరులనుబట్టి ఈ విషయం స్పష్టంగా తెలుస్తోంది. అలాగే—ప్రతిభావ్యుత్పత్తులు ప్రాచీనులవలెనే కలిగివున్న 'నయనామృతము' అనే ఈ నాటకకర్త—కీర్తిశేషులు భావరాజు వేంకట సుబ్బారావుగారు, తమ నాటకానికి ఈ పేర్లు పెట్టటం సముచితంగా ఉన్నది. నేత్రాలకు అమృతాన్ని ప్రసాదించేది అనే—అర్థం స్ఫురింపజేస్తూ—దాని వల్ల ఇదినాటకం అని తోచేటట్లు చేయబడింది. సామాన్యంగా ప్రాచీన నాటకకవులు ఇతివృత్తాన్ని రామాయణ, భారత, భాగవత, గ్రంథాల నుంచి తీసికోటం జరిగింది. వీరు ఆ విధంగా ఏ ప్రాచీన గ్రంథాలనూ ఆశ్రయించక, అద్భుతమూ, అనుపమమూ అయినరీతిలో స్వకపోల కల్పితంగా ఈ నాటక సృష్టిచేశారు. సంస్కృతంలో గీతగోవిందకావ్యము, జయదేవకవి వ్రాసినదాన్నీ, లీలాశుకులు వ్రాసిన కృష్ణకర్ణామృతాన్నీ మనస్సులో మథించిచేసినది ఈ నవ్యసృష్టి.

సుబ్బారావుగారు కొంచెం ఇంచుమించుగా సహస్రమాసాలు జీవించారు. వేదధర్మాలకూ, కళాసంప్రదాయాలకూ నిలయంగా ఉంటూ, వీను మిగిలి, బ్రాహ్మణులకు వసంతవాడగ్రామం ఆశ్రయం కల్పించింది. శ్రౌత మార్గాన, జీవితాలను ధన్యం చేసుకుంటూ లౌకికమార్గాన, నీతిధర్మ రక్షణచేస్తూ చాలామంది బ్రాహ్మణోత్తములు ఆగ్రామంలో నివసిస్తూ వుండేవారు. పారలౌకిక సంపదపైని అందఱికూ దృష్టివున్న కారణంగా, ఇతరవర్ణాలలో సఖ్యత ఏర్పాటుచేస్తూ, వారిని అందఱినీ ఒక త్రాటిమీద నడిపిస్తూ ప్రశాంతస్థితిలో మునిపల్లెగా వసంతవాడ ఆనాడు భాసిస్తూ, ఆదర్శంగా ఉండేది. నేటి గ్రామాలలో విశృంఖలంగా విహరిస్తూవున్న

కక్షలూ, కార్పణ్యాలూ, వెదకి పట్టుకుందామన్నా కనపడేవికావు.
గ్రామంలో సుబ్బారావుగారు, భావరాజువారియింట జన్మించారు.
చినఆచార్యులుగారు, తల్లి రమణమ్మగారు.

సహజంగా గ్రామంలో తాండవిస్తూఉన్న ఆర్ష ధర్మవిధానం
రావుగారిలో బాల్యంలోనే చోటుచేసికొన్నది. దానికితోడు తాత తం
గ్రామీణులు నీతిధర్మాలను పాటించేటట్లు బోధిస్తూ, వారిలో 'ఎప
ఏర్పడే తగాదాలను ఓర్పుతో, నేర్పుతో సరిదిద్దుతూ వుండట
దోహదంచేసింది బాల్యంలోనే సంస్కృత భాషమీద ఏర్పడ్డ గ
ఉన్నత విద్యాభ్యాసంలోనూ, ఆపైని మదరాసులో జరిగిన
విద్యాభ్యాసంలోనూ ఎంతో అభివృద్ధిని కలగజేసింది.

పూర్వకాలంలో చదువుకొనే విద్యార్థిని మీ గురువులు
ప్రశ్నించేవారు. గురువులయొక్క సామర్థ్యం, పేరుప్రతిష్ఠల
శిష్యుల విద్యాపాటవాన్ని అంచనా వేసేవారు. సుబ్బారావుగారికి మ
పచ్చయప్ప కళాశాలలో, భాషాసముద్రులూ, బహుముఖ ప్రజ్ఞాశా
అయిన వేదం వేంకటరాయశాస్త్రులవారివద్ద శిష్యత్వం లభించింది.
బంగారానికి తావి అబ్బినవిధంగా సుబ్బారావుగారిలో అదివరకేఉన్న
సంపదను ఎన్నోరెట్లు విస్తరింపజేసింది. సంస్కృతభాషలో, చెప్పు
పాండిత్యాన్ని కలిగించింది. బి. ఏ. పరీక్షలో ఉత్తీర్ణత చెందినత
వసంతవాడ తిరిగివచ్చారు. గ్రామం అంతా, ఆరోజుల్లో, ము
B.A.లో తమ గ్రామంలో ఉత్తీర్ణత చెందిన సుబ్బారావుగారిని
రథంపట్టి గౌరవించారు.

సంపన్న గృహస్థులు కావటంచేత ఉద్యోగాపేక్ష వారిలో
చేసుకోలేదు. వయస్సులో ఉండగానే వారికి ధర్మపత్నీవియోగం
ధించి. ధైర్యశాలిఅయిన సుబ్బారావుగారు ఆ కష్టాన్ని అధిగమించి,

స్సులో ఉండికూడా తిరిగి వివాహప్రాధక తుద్దివాకా ఆధ్యాత్మిక జీవితానికే అంకితం అయినారు.

వయస్సు పైబడిన తరవాత, మహాత్ముని స్వాతంత్ర్య శంఖారావం విని అకుంఠిత దీక్షతో శాంతిసంగ్రామంలో పాల్గొని చెఱసాలా వాసం చేశారు. ప్రభుత్వం తరవాత ఈయతల పెట్టిన ఏ విధమైన బహూకృతిపైనా మనస్సు ఉంచక స్వార్థరహిత ప్రవృత్తితో సంచరించారు. ఆ విధంగానే పశ్చిమగోదావరిజిల్లా కొవ్వూరులోగల ఆంధ్రగీర్వాణవిద్యా పీఠానికి గౌరవాధ్యక్షులుగా ఏవిధమయిన పారితోషికమూ ఆశించక దాని అభివృద్ధికి కృషిసల్పి విజ్ఞుల మన్ననలను అందుకొన్నారు.

వీరి తమ్ములు వేంకటరమణమూర్తిగారు ప్రశాంతచిత్తులు. అగ్రజునిమాట జవదాటని లక్ష్మణస్వామి అని ప్రశంసలు పొందినవారు. వీరి పుత్రి పుత్రికలకు విలువయిన తమ ఆస్తి చెందింపజేసి స్త్రీలకు సమానంగా ఆస్తిమీద హక్కు ఏర్పఱచటం సముచితం అనే నేటి భావాలకు అనాడే సుబ్బారావుగారు బీజరూపకల్పన చేశారు. ఆ సేతుశీతాచలపర్యంత తీర్థయాత్రలు సల్పిన భక్తిభావతత్పరులు సుబ్బారావుగారు. తమ జీవితాన్ని పారమార్థిక దృష్టితో వైరాగ్య ప్రవృత్తితో సంలీనం చేసిన శాంతమూర్తులు. ఈవిధంగా, విజ్ఞత వెల్లివిరిసిన వీరినిగూర్చి ఎంతవ్రాసినా తక్కువే అవుతుంది.

గ్రంథవిమర్శన చేయక, గ్రంథకర్తనుగూర్చి ముందుగా ఈ మాటలు వ్రాయటంలోగల ఔచిత్యాన్ని కొందరు శంకించవచ్చు—గ్రంథకర్తయొక్క స్వార్థరహితమూ, వైరాగ్యసహితమూ, ఆధ్యాత్మిక భావనావిలసితమూ అయిన మానసిక ప్రవృత్తిని అనుసరించే, గ్రంథంయొక్క ఔన్నత్యం ఆధారపడి వుంటుందని తెలియజేయటానికే కవినిగూర్చి సంగ్రహంగా ముందు వ్రాయటానికి పూనుకోవడం జరిగింది.

"నయనామృతము"—సంస్కృతములో జయ
వ్రాసిన గీతగోవింద కావ్యాన్ని, లీలాశుకులు వ్రాసి
కర్ణామృతాన్ని మథించిన రసాత్మకబుద్ధి విశేషంతో
బడింది, అని పైని వ్రాశాను. ఇందులో ఇతివృత్తం
త్మిక భావసంకలితం. ప్రతివాక్యం ఆర్షధర్మాన్ని, అ
విశిష్టతనూ, ప్రబోధించటమే ధ్యేయంగా పెట్టుకొని
నట్లు తెలుస్తుంది. ఏవిధంగా, ప్రాచీన కావ్యకర్తల
దేశంలో సుస్థిరంగా ఆధ్యాత్మిక ధర్మప్రబోధం చే
కోసం, గ్రంథరచన చేయటం జరిగిందో — అదే వి
ఆ ధ్యేయంతోనే ఈ నాటకంకూడా కూర్చబడింది. అ
నాటకలక్షణాలు తప్పకుండా ప్రాచీన సంస్కృతనాట
చొప్పించినట్లుచేయటం జరిగిందా అని ఆలోచిస్తే సమ
పాటించలేదనే చెప్పవలసి వస్తుంది. అయినా అడుగడు
మేధాసంపదనూ, ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని వెదజల్లే స
ణాలు మనస్సుకూ, హృదయానికీకూడా, తృప్తినీ,
కూడా ఈయగలుగుతున్నవి. ఈ నాటకంలో పవిత్ర
రమూ, పరమేశ్వరునియందు లగ్నంచేయబడ్డ మధుర
అనుపమానంగా వర్ణించబడింది. ఒక్కొక్క తావున
చేత కవి ప్రకటింపజేసిన నిత్యసత్యాలైన సంభావ
ఆయన ప్రతిభా సమగ్రతకూ, ఆధ్యాత్మిక భావబంధు
నికషోపలాలుగా ప్రకాశిస్తున్నై.

ఇందులో కళానిధి నాయకుడుగానూ, చింత
(వేశ్య) నాయికగానూ ఊహాకు స్ఫురిస్తుంది, అది

కూడాను. పోతే అంకాలూ, రంగాలూ, నాటకంలో చోటు చేసుకున్నై—మిగిలిన విష్కంభాదులు లేవు. అవి లేవే అనే వెలితి కనబడకుండా రసయుక్తంగా పాత్రల సంభాషణలు వేగంగా కదలిపోవటం కనపడుతుంది. కవికి, తాను ప్రతిపాదించదలచిన-సత్యాలని నమ్మిన అంశాలను, పాత్రల సంభాషణలలో-పఠితల, సామాజికుల హృదయాలకు హత్తుకునేటట్లు చేయగల నైపుణ్యం ఎంతగానో ఉన్నది. ఆ కారణంగా నాటకం పఠనయోగ్యమూ ప్రదర్శనయోగ్యమూ కూడా అయింది.

నయనామృతంలో ఆఱు అంకాలు ఉన్నై. కృష్ణా జిల్లాలో దివిసీమప్రాంతంలో ఉన్న శ్రీకాకుళ గ్రామమూ, కృష్ణాతీరమూ, ఆ పరిసరప్రాంతాలూ, నాటకంలో ప్రధాన ప్రదేశాలు. ఆంధ్రులదేవుడు ఆంధ్ర విష్ణువు సమక్షంలో ఆ దేవుని సేవిస్తూ బ్రాహ్మణోత్తములు వైదికాచార సంపత్తి గలిగివుంటారు. ఆషాడశుద్ధ ఏకాదశినాడు కృష్ణా నదిలో స్నానం చేయటానికి ఉషఃకాలంలో బయలుదేరి, కృష్ణలీలా తరంగాలు గానంచేస్తూ, తీరంచేరుకుంటారు. సార్థకనామధేయుడైన కళానిధి శ్రావ్యంగా గానం చేస్తూవుంటే ఆయనను ఇతరులు అనుసరిస్తూ; గొంతెత్తి పాడుతూ కూడా వస్తారు. ఈ కళానిధే నాటకంలో నాయకుడు. ఇదీ నాటక ప్రారంభం.

నాటకంలో ఒకటి రెండు పాత్రలుతప్ప మిగిలిన స్త్రీ పురుష పాత్రలన్నీ సంస్కారం కలవే - ఒక్కొక్క అంకానికి

చివర, అంకంలోవున్న ముఖ్యాంశాన్ని సూచిస్తూ, ఆ అంకానికి పేరుపెట్టడం జరిగింది. ఇలా అంక ప్రాశస్త్యాన్ని ఉగ్గడిస్తూ, సంస్కృతంలో మహాకవి భవభూతి తన ఉత్తరరామచరితలో ప్రతి అంకంచివరా ఆ అంకానికి నామకరణం చేయటం జరిగింది.

మొదటి అంకంలోనే-సోమగిరి యతీంద్రులూ, చింతామణీ, ఆమెతల్లి ఐరావతీ, ప్రవేశమూ, నదీతీరంలో చింతామణీ కళానిధుల పరస్పరావలోకనమూ, సంభవిస్తుంది. ఈ విధంగా సమాగమం జరిగిన తరవాత, వారిరువురూ భక్తిభావతత్పరులు కావటంవల్ల, పరమేశ్వరసాక్షిగా దాంపత్య జీవితం ఏర్పడుతుంది. నీచపాత్రలు గ్రామ్యంలో మాట్లాడటం; ఉత్తమ పాత్రలు తమకు తగట్లుగా మనోహరంగా సంభాషించటం వ్రాయబడింది. అవసరమైన తావులలో శిష్టవ్యవహార భాషలో హాస్యోక్తులు కూడా చోటుచేసుకున్నవి.

ఉత్తమపాత్రలు తమ సంభాషణల్లో - భగవంతుడూ, భక్తీ, వైరాగ్యమూ, మొదలైన ఉత్తమ జీవితలక్ష్యాలను గూర్చి సంభాషిస్తున్నప్పుడు నాటకకర్త సుబ్బారావుగారు ఆర్జించిన వేదాంతజ్ఞానం సమధికం అని తోచి ఆశ్చర్యం కలిగిస్తుంది.

ఆంధ్రదేవుని కల్యాణమహోత్సవాలు వైభవంగా జరిపించటానికి హంపీ విజయనగరంనుంచి పరివారంతో

శ్రీకృష్ణదేవరాయలవారు శ్రీకాకుళం రావటం; కవి సమ్మేళనం ఏర్పాటుచేయటం, అందులో కళానిధి ప్రభృతులు కూడా పాల్గొనటం కల్పింపబడింది. సుబ్బారావుగారికి ఆంధ్రభాషలో పద్యాలకు యతిప్రాసలనియమం అక్కరలేదనీ అవి ఉత్తమభావాన్ని తెలియచేయటానికి సమర్థులైన కవులకు కూడా వ్యర్థపదప్రయోగాన్ని కల్పించగలవనీ, అభిప్రాయం ఉన్నది. ఆ కారణంచేత రాయలవారితో శ్రీకాకుళం వచ్చిన, పెద్దన, తిమ్మనాదులతో కళానిధి యతిప్రాసలు అనవసరమనే వాదాన్ని పండితసభలో లేవనెత్తి ఆయన కృతకృత్యుడయేటట్లు సంభాషణ సాగిస్తారు-ఈ వివాదంలో సుబ్బారావుగారు కళానిధిద్వారా ప్రపంచించిన చాతుర్యమూ బహుముఖాలుగా ప్రదర్శించిన వాదమందలి నేర్పూ సహృదయులు మెచ్చుకోతగ్గట్లుగా సాగింది.

నాటకం, గీతగోవిందం, కృష్ణకర్ణామృతం ఆధారంగా అద్భుతంగా కల్పింపబడింది కాబట్టి, పలుతావుల గీతగోవింద కృతులూ, కృష్ణకర్ణామృతశ్లోకాలూ పాత్రలముఖంగా గానం చేయబడ్డవి. ఇవి గానం చేయటానికి తగినట్లుగా సందర్భశుద్ధి కూడా కల్పింపబడింది. ఇది ప్రదర్శించటం జరిగితే - నటీనటులు సామర్థ్యం ఎంతగానో సంతరించుకోవలసి ఉంటుందనటం నిర్వివాదాంశమే అవుతుంది. యతిప్రాసలను గూర్చిన వాద ప్రతివాదాలూ, కళానిధి ఆశువుగా యతిప్రాసలతో అల్లిన చంపకమాలాదులు, కవితాప్రియులకు తప్పక ఆనందం కలిగించగలవు. చింతామణి అభినయం, ఇతరకళావతుల అభి

నేయం కంటె మిన్నగా వున్నదనటంలో కవిప్రదర్శిం
సూక్ష్మపరిశీలన, మెప్పు పొందుతుందనటంలో సందే
లేదు.

సర్వాంగసుందరంగా, ఆలోచనామృతంగా, నాట
అంతటా సంభాషణలు సాగినప్పుడు, ఏవోకొన్ని పేర
నటం నా తెలివితక్కువను తెలియజేయటమే అవుతుం
సహృదయులైన పాఠకులు శ్రద్ధాళువులై ఈనాటకా
పలుమారులు పఠించి నామాటలలోని యాథార్థ్యాన్ని తె
కోవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

చివరి అంకంలో కళానిధి గీతగోవిందకర్త అయి
జయదేవుడనీ, జయదేవుని పత్ని పద్మావతి - కళానిధి ధ
పత్ని అయిన కామేశ్వరమ్మ, చింతామణులుగా జని
చిందనీ సోమగిరి యతీంద్రులు పేర్కొని ఆశ్చర్యానందా
కలిగించి, నాటకం సుఖాంతం అయేటట్లు చేయటానికి వీ
కల్పించారు.

ఈనాటకంలో అనేక సూక్తులు సందర్భాన్ని అ
సరించివెలికి వచ్చినై. వాటిలోకొన్నిటినైనా వ్రాయకపో
కవికి అపచారం కావించినవాణ్ణి కాగలననే భయంతో వి స్త
భీతిపీడిస్తు న్నా వ్రాస్తున్నాను.

"ఉత్తమకళ తదుపాసకులను నీచస్థితికి దిగనీయదు
కళకు పరమార్థము రసానందానుభవము. "రసోవై సః"
యని రసమునకు పరాకాష్ఠ రసమయుడగు పరమాత్మయే"

(చింతామణి, కళానిధి ప్రథమ దర్శనమున తనలో) - "సర్వజ్ఞ సన్నిధిని మెలగు కుమారస్వామివలె నీ యతీశ్వ రాంతికమున వెలుంగు నీ మహామహు డెవ్వరో"

"ఒకనికి అసంఖ్యాకములైన కళలన్నిటిలో ప్రజ్ఞ యుండుట అతిమానుషము."

"రాజునధికారము ధర్మమును బాలించుటగాని, క్రొత్త ధర్మమును దెచ్చిపెట్టుటకాదు."

"కళానిధీ! ఓహో అదియా నీ బాధ! పూర్వము విశ్వామిత్ర పరాశరాదుల కచ్చడముల ఛేదించిన దిట్టి బాధయే! దీనికింత ద్రావిడ ప్రాణాయామమెందులకు? చింతామణిని వలచితినని సూటిగా జెప్పరాదా? ఇది యొక కవిత్వము కాబోలు -"

"ఆధ్యాత్మికాకర్షణము గురుశిష్యుల మధ్యమునగాక యావనులును క్రొత్తవారునగు స్త్రీ పురుషుల మధ్యమున గూడ నేర్పడుననుట నీ వలన క్రొత్తగా నేర్చికొనుచున్నాము"

"అనిత్యానందములగోరక, ఐహికకళలనైనను, పార లౌకిక కళలనైనను ఆధ్యాత్మిక కళలకు సాధనములుగా ఉప కరించుకొను కౌశలమే కర్మయోగము"

"అధమేంద్రియ ప్రీత్యర్థముగాక, ఉత్తమ కళానందము కొఱకైన, కళావతీ సహవాసము స్వర్గానుభవమునకు దీసి

పోదు ... లోకాతిశయ కళానందమున కర్హులు ప్ర
లోకమున నరుడగుటచే, లోకాంతరమును దేహాంతర
గల్పింపబడినది."

"నా, కులవృత్తి బ్రహ్మానంద ప్రతిబింబమైన ఉ
కళానందమిచ్చి లోకాపకారమొనర్చుట ...... నా
కేవలాకార సౌష్ఠవాదులకుఁ బ్రమయుటచే పుట్టినదిక
అది నిష్కళంక కళాజన్యమై సకల కళాపూర్ణుడగు మహ
కర్పించిన పరిశుద్ధ ఆధ్యాత్మిక ప్రేమ."

"కృష్ణ పరమాత్మయందు భక్త్యావేశముచే దన్మం
చెందునప్పటి ఆనందమునకును, కళానిధి మహాత్ముల స
సాన్నిధ్యాదుల ననుభవించునప్పటి ఆనందమునకును న
వంతయు భేదము గన్పించుటలేదు."

"పిశాచాలు సంచరించేవేళ తిరిగే వాళ్ళకు
ప్రత్యక్షంగాకపోతే దేవతలు కనపడతారా?"

"సుందరశీలమన్నను, బుణ్యావర్తనమన్నను ఒక్క
పుణ్యమన కళామయ కర్మఫలము. పాపకృత్యమన కళావి
కార్యము. సుకృతమునకు ఫలము స్వర్గజ్ఞానములు. దుష
తమునకు నరక అజ్ఞానములు. అజ్ఞానమువలన మోక్షము.
యనేకజన్మలభ్యమగు, సర్వమానవ సామాన్యమైన మొ
క్రమము. దీనిని పిపీలికామార్గమందురు."

"ఆమె కళాకౌశలమంతయు నా కర్పించుటచేత నేను కళాలోలుడను. ఆమె కళావతి. ఆమె సాహచర్యము నాకు నిరంతర కళానందము నిచ్చుచున్నది. ఆయానందముతో ఈజన్మముననే బ్రహ్మానందము నందుకొనుట కిద్వారమును సాధనము జేయుచున్నాము మాది విహంగమార్గము."

ఈవిధంగా వ్రాయాలంటే పుస్తకమంతా వ్రాయవలసి వస్తుంది. అలా చేయటంకుదరదు కనుక శ్రద్ధతో నాటకాన్ని పలుమాఱులు చదివి రసానందాన్ని అనుభవించవలసినదిగా రసజ్ఞులను కోరుతున్నాను.

ప్రపంచంలో ఏ దేశానికీ, మన దేశంలో సుప్రష్ఠితం చేయబడ్డట్లుగా పారమార్థిక చింత ఏర్పడియుండ లేదనటం సత్యం చెప్పటమే అవుతుంది. మనదేశంలో ఆత్మతత్త్వాన్ని విశదీకరించే ప్రయత్నం, ప్రాచీనులచేత, దేవుని వలన అనుగ్రహింపబడినవని నమ్మబడుతున్న ఉపనిషత్తులు. సామాన్యులు తెలిసికొనలేని విధంగా సంస్కృత భాషలో ఉన్నవి. వాటిలో వున్న బ్రహ్మతత్త్వ బోధమే బ్రహ్మసూత్ర, భగవద్గీతలలో విస్తరింపబడి కొంతలో కొంతసులభతరం చేయటం జరిగింది. అయినా, అది బ్రహ్మవిద్య కాబట్టి సుళువుగా తెలిసికో దగ్గదికాలేదు. ఆత్మతత్త్వం తెలియటం అర్హత వున్నవాళ్ళకే సుగమం అవుతుంది. అయితే - సామాన్యులందరూ ఏకాంతెం అయినా తెలిసికొని, సచ్చిదానంద రూపుడైన పరబ్రహ్మముయొక్క జ్ఞానాన్ని అనుభవించి

ఆనందానుభూతినిపొందే అవకాశమే లేదా అంటే - ఉన్నది అనే సమాధానం పూర్వులు నిస్సంశయంగా ప్రకటించారు. ఆనందానుభూతిని కలిగించే ఉత్తమకావ్యరచనా విధానాన్ని అతీంద్రియశక్తితో ఊహించి, సర్వులకూ అందుబాటులో వుండేటట్లు చేశారు. ఆ కావ్యపఠనం వల్ల ఏర్పడే ఆనందాన్ని 'పరమానంద సహోదరం' అన్నారు. అలాంటి ఆనందస్థితిని కలుగజేసే ఉత్తమకావ్య శ్రేణిలో చేరటానికి, 'నయనామృతము' సర్వవిధాలా తగి ఉన్నదని వ్యక్తంచేస్తూ, ప్రతిభాపూర్ణులూ, అలౌకికభావనాబల సంపూర్ణులూ, స్వార్థరహిత జీవులూ, విశేషించి నాకు గురుతుల్యులూ అయిన, కీర్తిశేషులు భావరాజు వేంకటసుబ్బారావుగారిని స్మరిస్తూ "ముందుమాటలు" ముగిస్తున్నాను.

"జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి యేషాం యశఃకాయే జరామరణజం భయమ్"

**సామవేదం జానకిరామశర్మ**

**వసంతవాడ. ఏలూరు తాలూకా**

**పశ్చిమగోదావరిజిల్లా.**

# శ్రీ సుబ్రహ్మణ్యాస్తవము

శ్రీ సుబ్రహ్మణ్య మీడే గిరిశగిరిసుతాదివ్యశృఙ్గారరూపం
త్రైలోక్యక్షేమరక్షావిధివహనకృతే సృష్ట మాదిత్యభాసమ్,
ఆగ్నేయం దేవసేనావర మజితభటం బర్హిణ్యానాం కుమారం
గాఙ్గేయం కార్త్తికేయం నతతతిసులభం సర్వదేవప్రభావమ్॥

( అష్టకము )

నీనాపుట్టువు లొక్కఋషుమున నీనామంబు నా కుంచినా
రైనన్ నీకృపలేమి నీవిజయసంపద్గౌరవశ్రేష్ఠతల్
లేశమ్మైన మదీయజీవితమునన్ సంక్రాన్తముల్ గావు యీ
డా! వార్ధక్యము ఇందు ముందు సుఖశాన్తా లిమ్ము
షాణ్మాతురా

నాదురదృష్ట మడ్డుపడ నామది నీచరణంబు లూనగా
నేరద నేటిదన్క పలుబాముల గాసిలితిన్ జరారుజల్
పైకొనువేళ నీపదసరోజము లబ్బెను భావిభాగ్యరే
ఖోదయవేళ నాకేదియ కష్టము లూడ్చి సుఖంతు షణ్ముఖా

పుట్టినతోడనే ఋషులభామిను లార్వురు ముద్దుగొంటకై
యొక్కట కేళ్ళు సాప దనియించితి వందర కన్నిమోము ల
త్యద్భుతలీల దాల్చి మరి సద్గతి కెత్తితి మాత లంచు నీ
యీవికి మేర లేదు మహిమంబు నపారము దేవనాయకా!

అరువదినాలుగంకె మహిమాఢ్యము శాస్త్రకలాపమందు నా
శిరమున కెక్కి దాని పరమార్థము వమ్మయిపోవనీక నా
కరువదినాల్గురీతులుగ రెట్లుగఁ బండగ సేయుమయ్య దా
తలకలిమింబడిం గద వరమ్ముల వేడుట బాహులేయకా!

బ్రదుకెల్లం బగవాండ్రపాలయి వృథా యానంబులం గీడ్పడెన్
శిథిలమ్ముల్ సకలాఙ్గముల్ మనము దౌర్బల్యాతిలోలంబు లే
దవలమ్బం బెటుఁజూచినన్ నవవిరోధిధ్యానముల్ హెచ్చె నా
కభయం బిచ్చి శుభంబుఁ గూర్ప గతి నీవే తారకధ్వంసకా!

శైశవ మాదిగా నాచదువు లెప్పుడు విఘ్నహతంబు లేపురా
పుణ్యలవంబునన్ గుదిరె విద్దెల కొద్దివినోదశక్తి యా
వంతయు గల్గ దాత్మపరిపాకము నిగ్రహమున్ హుళక్కి జ్ఞా
నామృత మిచ్చి జన్మరహితం బొనరింపుము క్రౌఞ్చదారణా

నీవున్ నీజనకుండు శంకరుడు గ్లానింబడ్డవర్ణాశ్రమా
చారాధారసనాతనార్యమతధర్మమ్ముల్ మహాభారత
క్షోణిం గ్రమ్మర నుద్ధరించిరట పూర్వమ్మందు నేడున్ మహా
ఘోరాపద్దశ డిందుధర్మములఁ గాపాడంగ రండో గుహా!

సంకల్పించితి నస్తరిన్ద్రియపరీక్షాయోగసంసిద్ధికై
నాయీపుట్టువునం బ్రవర్తిలినమాయాకల్పనారూపక
శ్రేణుల్ గూర్చి కృతిన్ రచింప నది సత్సింహావలోకంబుగా
సొంపు ల్నింపగఁ జేసి కావ్యపతి గమ్మా బర్హిరాడ్వాహనా!

ఓం

# స యు నా మృ త ము

## ప్ర థ మాం క ము

### —: స మ య ము :—

ఆషాఢ శుద్ధ ఏకాదశీ ప్రాతఃకాలము. తెఱలోఁ జాలనుంది కృష్ణలీలాతరంగములు పాడుచు వచ్చుచున్నట్లు వినఁబడును. తెఱతీసిన తరువాత శ్రీ కా కు ళ క్షే త్ర ము యొక్క కృష్ణానదీతీరమును, రేవునుఁ గనుపించును.

### —: ప్ర వే శ ము :—

చాలమంది బ్రాహ్మణులు పాడుకొనుచు మద్దెల తాళములతో వత్తురు. 'క ళా ని ధి' యను బ్రాహ్మణుడు ముందుఁ బాడుచుండఁ దక్కినవా రనువదింతురు. రేవుఁ జేఱిన తరువాతఁ బాడ నిలిపి, మద్దెల మొదలగు సామానులు క్రిందఁ బెట్టి స్నానోచితముగా నడుమున కంగవస్త్రములఁ జుట్టుదురు.

కళానిధి కృష్ణను గలయఁజూచి పాడును.

కళానిధి :-శ్లో. అహో ! మాతః కృష్ణే ! హరిశయన
యోగాద్యది వస
ప్రభాతే ద్రష్టుం స్త్వా మతితట విసీలోజ్జ్వల రసామ్
రహస్యం త్వన్నామ్నః స్ఫురతి మమ; భక్తామరమణె
ర్ధునీరూపే ణోర్వ్యాం ప్రవహసి హి కృష్ణస్య సుషమే!॥

తే. గీ. ఆంధ్ర దేవుని ఘట్టానఁ దెలుఁగు నుడులఁ
బాడుకోను టొప్పు; మఱచితిఁ బఱవశతను !
సైపు మో తెలుఁగురాయఁడ ! తప్పిదంబు;
దేవభాషను సరిఁజేతుఁ దెలుగు కవిత ! ॥

ఏమి యీసరిల్లలామ విలాసములు !

సీ. ఇంత నిద్దపుమేని తళ్కు లేలత కూన
గల్గు మాపాప కృష్ణప్ప గాకఁ
ఇట్టి చక్కనిసుళ్లు సీనవ్వుసొట్టలు
నే చిట్టి కొప్పులుఁ గృష్ణ దాటి
వే మెలికలవాలు వేణిక లొయ్యారి
నడకలు కృష్ణాకుమారిసొమ్ము
లన్నిరత్నపునగ ల్జిత్రాంబరములు గృ
ష్ణా దేవి యొడల వెల్గొందు నెపుడు

తే. గీ. కడుపు చల్లనితల్లి మాకృష్ణ వెల్లి
నెమ్మిఁ గృష్ణమ్మ మముఁ గన్న మొదటి యమ్మ
మధుర భావసరస్సు కృష్ణాపయస్సు
ప్రజలఁ బోషించు రాణి మాకృష్ణవేణి ॥

ఓ మంగళతరంగిణీ !

సీ. పాలవెల్లినిఁ దీపినిదురఁ జోగెడుఁ బుట్టు
వెఱుగని పసికందు నూపఁ జనుదె ?
వేగ రమ్మని సరిత్పతి బంపుమేఘసం
దేశ ధారావళి తలనుఁ దాల్తె ?
ఏటేటఁ గూడు నదీసమాజమునకుఁ
బేరంట మేగుదే పెండలకడ ?
వెట్టకా రను పెనురక్కసి నోర్వంగ
శక్తివై జృంభించి విక్రమింతె ?

తే. గీ. కానిచో ననంతోర్మి డోలిక లవేల ?
క్రొత్తమైపూత లేల ? పూవులునుఁ బండ్లు
పసుపు కుంకుమ లేల ? నాక్రమణ మేల ?
కృష్ణవేణీ తరంగిణీ ! స్వర్గసరణి !

వేదన్నభట్టు :-బావా ! నీవు సకలవిద్యా విశారదుడవై కళానిధి బిరుదము నందిన మహాకవివి! మేమిట్లు వినుచు నూరకున్నచో నెప్పటికైన నీకృష్ణాప్రవాహ మాగు నేమో కాని నీయాశుకవితాగాన నిర్ఝరిణికిఁ దెం పుండదు. స్నాన సంధ్యల గూడ మఱతువు. సూర్యో దయమున కిఁక రెండుగడియలకాల మైన లేదు. నీ పుణ్యమా యని స్నానముఁ గానిమ్ము. సకాలమున సంధ్యాదులు ముగించి దేవళమునకుఁ బోవుదము.

నేఁడక్కడ స్వామిసన్నిధిని భజనము సల్పిన తఱువాత నుత్సవ్రలవెంట నూరేఁగవలసియు నున్నది. ఈ యుపవాసదినమున మిక్కిలి ప్రొద్దెక్కువఱకు శ్రమఁబడిన యెడల నావంటి బక్కవాండ్ర కాకటిబాధ మిక్కుటమగును. నాయందు దయయుంచి త్వరపడుము.

ఏకసంథాగ్రాహి శిష్యుఁడు :–(వేదన్నభట్టు నుద్దేశించి) అన్నా! ఎంతపనిఁ జేసితిరి మహానుభావా! వేదన్నభట్టుగారూ! నా ఏకసంథాగ్రహణ పాఠమునకు విఘ్నముఁ గావించితిరి. మాగురువర్యుల కితరకళావ్యాసంగములమధ్యమున నాకు కవిత్వముఁ జెప్పనవసరము లభించుటయే యరిది. క్రొత్తనీరు తగిలిన కృష్ణానదీమతల్లి నీపవిత్రదినమున నీపుణ్యకాలమునఁ జూచుటచే స్వీయముగ బయలుదేరిన యమృతధార కడ్డుఁదగిలి పుణ్యముఁ గట్టికొంటిరి. నాశిష్యరికపుకాల మాగునెలలలో నారువందల శ్లోకపద్యములైనఁ జిక్కలేదు. దైవమా! నాకు మఱల ధారణపాఠ మెన్నటికి లభించునో కదా!

కళానిధి :–(వేదన్నభట్టు నుద్దేశించి) ఓ విఘ్నరాజా! నీ కనేకవందనములు. ఈ మహాదినమున నింత వేకువను నీదృష్టి యంతయు దిండిమీదఁ బ్రసరించినందులకు సంతసించి నీఖాదనకళాలోలత్వమునకును, నీరూపకళావైభమునకును మెచ్చి నీకు 'వేదండభట్టు'ను

బిరుదము నిచ్చుచున్నాను. ఇంతటినుండి లోకమందఱు ని న్నా పేర బిలుతురుగాక ! (అందఱు నవ్వుదురు)

వేదండభట్టు :-నేను నీకన్న నేకొంచెమో పెద్దవాఁడ నగుటను మేనత్తకొడుక ననియు వేళాతిక్రమణము కాకుండ బ్రాహ్మణవిధుల నెరవేర్చుకొ మ్మని హితము చెప్పినందులకు, నేను మీపాలిటి వినాయకుడనై యేనుఁగు కడుపుఁ గలవాఁడ నైతినా ? పోనిమ్ము ! ఇక నెన్నడు నే పెద్దరికమునకు రాను గాని, నాకు మాత్రము లేనిపోనిపేర్లు పెట్టకుము. నీనోట వెడలు ప్రతిలేశమునుఁ గొండంత జేసి ప్రచారము సలుపుటకు శ్రీరామ సేనలవంటి నీశిష్యమూకలు కడు నేర్పరులు.

కళానిధి :-బావా ! నీవు పరిహాసమునకుఁ గోపగించుకొను నరసికఛాందసుఁడవుగదా ! ఇటుమీదట నెవరైన నిన్ను వేదన్నభట్టని పిలిచినను, వేదండభట్టన్నారని శంకించి యుడుకకుమా ! నాకృతాకృతాపచారములకుఁ బ్రాయశ్చిత్తార్థము రేపు మాయింట ద్వాదశి బ్రాహ్మణునిగా నిన్నే పూజించి, భక్ష్యభోజ్యసహితముగ మృష్టాన్నముఁ బెట్టి తనియింతును లెమ్ము. ఇఁక మాత్రము మాస్వైరప్రవర్తనమున కడ్డు తగులకుము.

వేదండభట్టు :-నే విధించు ప్రాయశ్చిత్త మొనర్చినఁ గాని నీయపరాధము తీరదు. ఉత్తరదేశమున నీవు నేర్చుకొని వచ్చిన పాకకళాపాండిత్యము నంతను వినియోగించి స్వయముగా 'ఘీవర్' పిండివంటను 'శ్రీఖండము'నుఁ దయారు చేసినఁగాని నేను నీకు బ్రాహ్మణుఁడనుగా నుండను. ఏమాత్రము తృప్తిపరతువో చూచెదను.

కళానిధి :-ఓ తిండిపోతా ! ఆగుమాగుము. (వినుట నభినయించి) ఎచ్చటనో దూరమునుండి దివ్యమైన మధురగానము వినవచ్చుచున్నది. (శబ్దమార్గ మన్వేషించి పశ్చిమదిక్కునకుఁ జూచి) కృష్ణమధ్యమున నా లంకమీఁద, నా పెద్దవెలుగు సమీపమున నెవ్వరో స్త్రీ పాడుచున్నట్లున్నది. కృష్ణానదీస్తోత్రరూపమంగళ హారతి యని నడుమ నడుమ వినఁబడు మాటలవలనఁ దెలియుచున్నది.

వేదండభట్టు :-మా కెవ్వరికిని వినుపింపని సూక్ష్మధ్వనులు నీకు గోచరించుటకు నీవు నేర్చిన యవధానకళయే కారణము. ఆ గొప్పవెలుగు చింతామణి యను వేశ్య యొక్క భవనము ముందుది. అదిగో ఆకాంతిలో నా సౌధమును గనిపించుచునే యున్నది. మనుష్యుల కదలికయు గోచరించుచునే యున్నది. ఆ వేశ్య నీవలెనే గొప్పకళావతి యట,

కళానిధి :-ప్రసిద్ధ కళావతి యైన నే నిక్కడకు వచ్చిన రెండేండ్ల నుండియు నామె యాటపాటలుఁ జవితెగుల కుండు టెట్లు తటస్థించినది ?

వేదండ :-నీవే కాదు. మొదటినుండియు నిక్కడనే యున్న మే మైన నెన్నడుఁ గని విని యెఱుగము. ఆమె ఈ దివిసీమకు వెనుకటిప్రభు వగు పురందరరాజుగారికి ఐరావతి యను వేశ్యవలనఁ బుట్టినది. గొప్ప శ్రీమంతు రాలు. ఆ గొప్పభవనమును, గొన్నియూళ్ళను మితిలేని ధనమునుఁ దండ్రిగా రామె కిచ్చిరఁట.

కళానిధి :-ఆమె యెప్పుడైన మనయూరు వచ్చియుండెనా ?

వేదండభట్టు :-రాకేమి ? నిరుడు ఆంధ్ర దేవుని తిరునాళ్ల లో వచ్చినదే ! నీవు చూడలేదు కాబోలు, చక్కని చుక్క. అప్సరసవలె నుండును. మనదేవునికొలువులో నామె తల్లికిని వంతు కలదు. ఆమెతల్లి మొదట మనయూరిదే. రాజు చెట్టబట్టిన తరువాత, తనవంతుఁ దనబందుగులచేఁ జరిపించుచున్నది.

కళానిధి :-చింతామణియా ! ఎంతచక్కని పేరు. ఆమె కెంత వయస్సుండును ?

వేదండభట్టు :-పదునెనిమిదేండ్లు పండిన నిండు పరువము. ఆటపాటలు సాహిత్యము మొదలైన పెక్కువిద్యలలో

గొప్ప నైపుణ్యము గలదని పేరుగాని, యెందులకో యెచ్చటనుఁ దనవిద్యల ప్రకటించినట్లు కనఁబడదు. ఉచితజ్ఞతా గాంభీర్యాది రాజపుత్రీ లక్షణములు కలది. నిరంతరవేదబ్రాహ్మణ భక్తియుక్త యనియు వితరణగుణ యనియు గణుతిఁగాంచినది.

కళానిధి :—ఆమె వరించిన సరసు డెవడు ?

వేదండభట్టు :—అదే సున్న. ఆమెతల్లి కిప్పటి యజమాని యగు దివిసీమయిజారాదారు బొల్లిసాని పోతు నీడును, ఆమె విద్యాగురువులునుఁ గాక పరపురుషుఁ డెవఁడును నామె సౌధపుటావరణలోనికిఁ దొంగి చూడనైన వీలులేదట.

కళానిధి :—ఈకథ చాల చిత్రముగ నున్నదే ! నే నెన్నడును విననే లేదు. ఆమె యింతప్రొద్దుకడ లేచి యూరుబైట కృష్ణయొడ్డున నెందులకుఁ పాడును ?

వేదండభట్టు :—ఆమె నీకన్న నెక్కుడు నిష్ఠాశ్రద్ధలు కలది. ఈరోజు శయనైకాదశి గనుక వేకువనే లేచి స్నానముఁ జేసి క్రొత్తనదినిఁ బూజించుచున్నది. బహుశః ఆంధ్రవిష్ణువు దర్శనమునకుఁ గూడ రావచ్చును.

కళానిధి :—అంత యుజ్జ్వలకాంతి నెట్టి దీపములవలనఁ గలి గించిరో ? ఆమపాదిష్టిలో నామేడయు, దానినొఱసి

పాఱుఁ గృష్ణానదియుఁ గలకలలాడుచు నెంత సొంపులు గులుకుచున్నవి !

శా. ధావళ్యాతిశయంబు దిక్కులకుఁ దెల్పెం గూర్పరాణించుఁ బ్రా
సాదోత్తంసము రాజహంస నికురుంబాసీత లీలారథం
బాసోపానవిసారి కృష్ణజల మాకాశంబు, వాహ్యాళిలో
నాదోపాసనఁ జొక్కు బ్రహ్మదయితం గా నెంతుఁ జింతామణిన్॥

వేదండభట్టు :-(అపవారించి) మఱల కవిత్వప్రవాహమునఁ బడినాఁడు. ఇక నీవేళ స్నానమునకు నీళ్లు వదల వలసినదే !

కళానిధి :-నిండుగా నీ వుండుటంబట్టి యాకోమలగాన మింత దూరము తరంగయానముఁ జేసినది.

సంగీత శిష్యుఁడు :-(కళానిధి నుద్దేశించి) నిం డేటిమీద నీదుచుఁ గృష్ణాలీలాతరంగములను లయఁగలిపి, కృష్ణ లీలాతరంగములు పాడుట మాకు నేర్పుదు మని గురు వర్యు లొకప్పుడు సెలవిచ్చియున్నారు. ఇప్పు డీ క్రొత్తవఱద మాకాయపురూప పాఠమనుగ్రహించుట కనుకూలముగా నుండు నని మనవిఁ జేయుచున్నాను.

వేదండభట్టు :-గురువును మించినశిష్యులురా బాబూ! వేళకు స్నానసంధ్య లక్కఱలేదు గాని, యీమహా వరదలో జలకేళీమిళితగానాభ్యాసము లంట! ఓసంగీత శిష్యుడా! నీవంటి బొడ్డూడని వాండ్రీ యేటి ప్రచండ వేగమున కాగగలరినియే మీగురువు నట్టి వెట్టివిద్యఁ జెప్పు మని కోరుచున్నావా ?

కళానిధి :-బావా! నీవంటియుద్దండ వేదండము దండ నుండ నాశిష్యుల కేటి నీటిజంకేటికి ? నీ పినదీతీరమంతటికిని మొదటి 'గజయీతగాడ' వని పేరుపొంది యనేక ప్రాణుల జల మరణమునుండి తప్పించి పుణ్యముఁ గట్టుకొంటివి. నిరుడు గడ్డివామిమీదఁ గూర్చుండి నదిలోఁ గొట్టుకొనివచ్చు పల్లెటూరి కుటుంబమునకుఁ ద్రాళ్ళ నందిచ్చి వారందర నావామితోఁగూడ నొడ్డునకు లాగిన నీవేదండ దోర్దండ శక్తిని నేఁ గళ్ళారఁ జూడలేదా ?

వేదండ :-నేను వేదండము నైన నీవు మొసలివి కావా ? నీయెత్తిపొడుపుగుణము నీవు మానవు. గజయీతకు పైది మొసలియీత కల దని, నీవు నీట మునిగి, గంటలకొలదిఁ బైకి తేలక, నన్ను మించి యీదియు, నాకాలు సేతులు లాగి ముంచ నెంచియు, నన్నల యించినది నాకు జ్ఞాపకము లేదా? అన్నిశాస్త్రము

లలో బండితుల నందరిని జయించినది చాలక యీాతలో కూడ గెలుపు నీకే కావలసి వచ్చినదా?

కళానిధి :-అది జలస్తంభనవిద్య బావా!

వేదండ :-ఏమిపాడు విద్యయో! ఒకవిద్యయేమిటి? నీ కబ్బిన లెక్కలేని పెట్టికళలమూలమున, నీయూరంతయు నీశిష్యులతో నిండిపోవ, గ్రామప్రజలు భరింపలేక క్రుంగిపోవుచున్నారు. నీకారణమున నూరి కుపద్రవము కలిగినది. ఏరాజునైన నాశ్రయించి నీశిష్యుల కొక యన్నసత్రము నేర్పాటుచేయించ రాదా!

కళానిధి :-నీయాశీర్వచనము ఫలించి, యంతటిమహాపుణ్యమే మహారాజునకుఁ బ్రాప్తము కానున్నదో! "నావిష్ణుః పృథివీపతిః" అన్నట్లు శ్రీకృష్ణాంశచేఁ బుట్టిన రాజన్యకళాపూర్ణునకుఁ గాని, ఖిలము లగుచున్న చతుష్షష్టికళలఁ బోషించి, యుద్ధరించు బుద్ధి కలుగదు. అట్టి సౌభాగ్యవంతుఁ డగువాఁ డిప్పు డెక్కడనైన నున్నాఁడో, ఇఁకఁ బుట్ట నున్నాఁడో తెలియదు.

వేదండ :-అట్టిరాజును నీ వన్వేషింపవలెనా? లేక యీాతఁడే నీదర్శనము గోరి యిచటి కేతెంచునా?

కళానిధి :-నాదర్శనమునకుఁ గాకున్న, రాజాధిరాజైన మన యాంధ్రవిష్ణుని సేవించుటకైన రావచ్చును. అందసాధ్య మేమియు లేదు. ఏలయన.

మాలినీ : అఘటన ఘటనా సామర్థ్య కేళీవిలాసుం
డసిత జలదభాసుం డాత్తగోపాలవేషుం।
డతిగణన కళాసౌందర్య సౌభాగ్యకృత్సుం
డఖిల జగముఁ గృష్ణుం డేలుఁ జుమ్మాత్మమాయన్॥

వేదండ :-మహాదేవుఁ డైన పరమశివుఁడు మాత్ర మేలుట లేదా ? అందునను శంకరుఁడు కడుసులభుడు; ఐశ్వర్య ప్రదుఁడు. మనయూరి యేకరాత్రప్రసన్నమల్లికార్జును నారాధించిన నీకోరిక లీడేరుట తేలిక.

కళానిధి :-తే. గీ. శైవుఁడ నే, రూఢి ! పంచాక్షరీజపంబు
నిష్ఠమైఁ జేతుఁ గాని, నల్లగిసెపూల
మిసిమిమైవాని, గొల్ల యిల్లాలి కూన,
జిన్నగవుకాని, జేరు నాచిత్త మెపుడు॥

వేదండ :-వేదవిహితకర్మల నొనర్చినమీఁదటఁ గదా, యితరదేవతారాధనములు ! బ్రాహ్మణునకు సంధ్యా వందనాది నిత్యకర్మముల సల్పిన తరువాత నన్యముల నొనర్పవచ్చునే గాని, గాయత్రీజపము మానినఁ దక్కిన వన్నియు నిష్ఫలము లగును.

కళానిధి :-శా. సంధ్యావందనమా ! శుభం బగును నీ;
కోస్నానమా ! దండముల్
ఓ పిత్రాదిసుపర్వులార ! తమకు న్నేఁ దర్పణా లీయఁగా

నోపన్ పైపుఁ, డెటేనిఁ జేటి యదువంశోత్తంసు
కంసద్విషున్
వేడన్ వేడ నఘంబు వాయు; నది జాలున్ నాకు
వే రేటికిన్?॥

వేదండ :-నీవు దేశములన్నియుఁ దిరిగి నేర్చి దెచ్చిన వేద బాహ్యమైన రాధాకృష్ణమతముయొక్క ఫలిత మీావిధముగాఁ దేలినది. ఇంక నెన్నివిధములఁ జెడుదువో యిప్పు డేమైనది!

కళానిధి :-శా. రాధామాత, పునీతచేతమునుఁ గృష్ణస్వామి
కర్పించుటన్
బెరుగుం బోయని వట్టికుండఁ జిలికెన్ గవ్వంబుతో,
నాపెచన్
గుత్తు ల్నాట్య మొనర్పఁ జూచుచు, సరోజాక్షుండు,
నెద్దొండు బాల్
బిడుక న్దార్కొని బందమేసె; జగ మద్వంద్వంబుచే
ధన్య మా॥

వేదండ :-కృష్ణుని జారత్వ చోరత్వాదులఁ బొగడుట కంటే దుష్టశిక్షణ శిష్టరక్షణాదులఁ గొనియాడుట లోక నీతికర మగును.

కళానిధి :-తే. గీ. చతురవల్లవ కామినీ చిహ్న
ముద్రితము లైనసరలాంగకములవానిఁ
బావనుని, వేదవాక్కుల కెఱుకవడని
బ్రహ్మమును, వెన్నదొంగ నుతింతు నేను.

వేదండ :- వేదవేదాంతములు మాత్రము పరబ్రహ్మము నెఱుకపఱుపవా ?

కళానిధి :- తే. గీ. ఆత్మవేత్తలంతర్ముఖుల్ బ్రాతరీతి
గూఢ నిర్గుణ తత్త్వంబు నభ్యసింత్రు
గాక ! మే మా యశోదాకిశోరు చిత్ర
చరితల సుధోర్మిల మ్మగ్నిౕతేలుదు మిఁక॥

వేదండ :- మీ నవీను లెట్లైన నెవరి కేమి గాని, యందర కదే త్రోవ బోధింప బూనుట తప్పు.

కళానిధి :- తే. గీ. ఉత్తమం బైనయుపదేశ మిది వినుండు
వేదవిపినాల వేసారు వెఱ్ఱులార !
గొల్లభామలఇళ్ళకు వెదుకఁ బొండు
రోళ్ళఁగట్టడి యుపనిషదర్థ ముండు॥

వేదండ :- నిన్నుఁ గదిపినకొలదియు రెచ్చిపోవుదువు. నీబుద్ధి మరల్చుట నావశము గాదు. నేనే కాదు. మనుష్య మాత్రుఁ డెవఁడు చెప్పినను నీవు వినవు. ఈ మహా క్షేత్రముసన్నిధి; నీపుణ్యానదీప్రాంతమున, మహాత్ము లనేకులు ప్రచ్ఛన్నముగా సంచరింతు రని వాడుక; వారెవ రైన ననుగ్రహించి నిన్ను మంచిదారికిఁ ద్రిప్ప వలెను గాని మఱి యొక దారి లేదు.

కళానిధి :- నాకు మహోపకారక మైనకోరికఁ గోరితివి బావా! నేను నట్లే మహాపురుషుల దర్శనము కొఱకెల్ల

వేదండ :—వేదవేదాంతములు మాత్రము పరబ్రహ్మము నెఱుకపరుపవా ?

కళానిధి :—తే. గీ. ఆత్మవేత్త లంతర్ముఖుల్ ప్రాతరీతి
గూఢ నిర్గుణ తత్త్వంబు నభ్యసింత్రు
గాక ! మే మా యశోదాకిశోరు చిత్ర
చరితల సుధోర్ముల న్మగ్నితేలుదు మింక॥

వేదండ :—మీానవీను లెట్లైన నెవరి కేమి గాని, యందర కదేత్రోవ బోధింప బూనుట తప్పు.

కళానిధి :—తే. గీ. ఉత్తమం బైనయుపదేశ మిది వినుండు
వేదవిపినాల వేసారువెఱ్ఱులార !
గొల్లభామలఇళ్ళకు వెదుకఁ బోండు
రోళ్ళఁగట్టడి యుపనిషదర్థ ముండు॥

వేదండ :—నిన్నుఁ గదిపినకొలదియు రెచ్చిపోవుదువు. నీబుద్ధి మరల్చుట నావశము గాదు. నేనే కాదు. మనుష్య మాత్రుఁ డెవఁడు చెప్పినను నీవు వినవు. ఈ మహా క్షేత్రముసన్నిధి; నీపుణ్యానదీప్రాంతమున, మహాత్ము లనేకులు ప్రచ్ఛన్నముగా సంచరింతు రని వాడుక; వారెవ రైన ననుగ్రహించి నిన్ను మంచిదారికిఁ ద్రిప్ప వలెను గాని మఱి యొక దారి లేదు.

కళానిధి :—నాకు మహోపకారక మైనకోరికఁ గోరితివి బావా! నేను నట్లే మహాపురుషుల దర్శనము కొఱకెల్ల

సన్న్యాసి :- సోమగిరి.

వేదండ :- తమ రీయూర నెప్పుడు విడసితిరి ?

సోమగిరి :- మీయూరిలోనికి మేము రాలేదు. కడచినరాత్రి యీఘట్టముఁ జేటి యిచ్చటనే కాలముఁ గడపితిమి.

వేదండ :- ఈ ...... రోజుమొదలు తమవంటి తురీయాశ్రమస్థులకు చాతుర్మాసదీక్ష గనుక నాకాల మంతయు తమరు మాయూర గడుప నను గ్రహింపఁ గోరుచున్నాను.

సోమగిరి :- మేము గిరిసంప్రదాయము వారము. గ్రామములో వసించువాడుక తక్కువ. అంతేకాక, చాతుర్మాస్యాది దీక్షలనుఁ ద్యజించితిమి.

వేదండ :- తమ రకారణకరుణతో ననుగ్రహించిన తమప్రియశిష్యుఁ డగు కళానిధి కోటకే మనవిఁ జేయు చున్నాను. అత డీ కృష్ణభక్తి మూలమున వైదికాచారములఁ బొత్తుగాఁ దిరస్కరించుచున్నాడు. ఆతనినిబట్టి యాతనిశిష్యులు మొదలైన చిన్నవారందరునుఁ జెడిపోవుచున్నారు. వైదికసంప్రదాయములకు మూలకంద మైన మాయూర నవైదికము లైన సంకరాభ్యాసములు బలియుచున్నవి. తమ రాతని నొక్కని మళ్ళించినచో నీయూర సనాతన ధర్మమును మఱలఁ బ్రతిష్ఠాపించినవా రగుదురు.

సోమగిరి :—సనాతనధర్మమును జగద్గురు శ్రీమదాదిశంకరులు పునరుద్ధరించి లెస్సగాఁ బాదుకొల్పియుంటచే వారి మహిమమున నా ధర్మ మిఁక నెన్నటికి నశింపదు. కళానిధి కైన, సనాతన మతమందు విరోధభావము లేదు. తన కందు సులభోపాయము దొఱకిన దని యుత్సాహము. తరించుట కనంతోపాయములు గలవు. 'అనంతావై యోగాః' అనునది సనాతనుల వాక్యమే. వారి వారి స్వభావభేదములంబట్టి భిన్న భిన్నాధికారులకు వేరు వేరు మార్గము లాకర్షకము లగును. అంతమాత్రమునఁ జెఱుపు రాదు. కళానిధిని గూర్చి పరితాపము నొందు టనావశ్యకము.

వేదండ :—శిష్టాచారసంపత్తి గల పరిశుద్ధ వైదికకుటుంబమునఁ బుట్టి, బ్రాహ్మణవిధు లైన నిత్యకర్మములందుఁ గొంచెమైనను శ్రద్ధ వహింపక కులమున కనుచితము లైన కళలతో సర్వకాలము గడపుచుండుట; అన్నలు మొదలైన కులపెద్దలకు విచారహేతువు గాదా స్వామీ ?

సోమగిరి :— పూర్వము కాళిదాసునుగురించి కూడ సామాన్యలోక మిట్లే యనుకొనుచుండెడిది. ఏకళలయందైన గాఢప్రజ్ఞ గలలోకోత్తరుల కళాలోలత్వ మనర్థదాయకము గాక వారి నిశ్శ్రేయసపదప్రాప్తికి సాధనముగా నుపకరించును. అట్టివారికి తమ కభినివేశము గల కళల

కనుగుణము లైన యుపాసనలు గాని రుచింపవు. ఉత్తమకళ తదుపాసకులను నీచస్థితికిఁ దిగనీయదు. కళకు పరమార్థము రసానందానుభవము. 'రసో వై సః' యని రసమునకు పరాకాష్ఠ రసమయుఁడగు పరమాత్మయే ! రసమార్గమును వీడక యుపాసించిన కొలఁదియు దారి విశదమై, దివ్యదృష్టి కలిగి, శీఘ్రమున బ్రహ్మానంద ప్రాప్తి యగును. కళానిధి యసామాన్యప్రతిభాశాలి. అదిగాక పరిణతాత్ముఁడైన కారణజన్ముఁడు. మే ముపదేశింప నున్న మహామంత్రరాజముయొక్క మహిమముచే నాతని స్వభావమున కనురూపము లైనవిఖ్యాతి, భోగాదులఁ బారముముట్ట ననుభవించి, తుదకు వైరాగ్య మవలంబింపఁ గలఁడు.

కళానిధి :-(స్నాతుడై, మఱలివచ్చి, జనాంతికము) బావా! శ్రీ స్వాములవారి నూరేగింపుతో మనగ్రామములోనికిఁ గొంపోవుటకు యానము నాయత్తపఱచితివా?

వేదండ :-వారు గ్రామమునకు రా ననుచున్నారు.

కళానిధి:-వారివంటి యవ్యాజదయామయులు మన మొనర్చు భిక్షావందనముల నేకొలఁదిగనైన స్వీకరింపక చిన్నఁబుత్తురా? నీవు నాశిష్యులఁ గొందఱ నూరిలోని కనిపి గ్రామములోని బ్రాహ్మణ పిన్నపెద్దల నిటకు రావించుటయు, దేశపాండ్య శివరామయ్యగారి మేనా

తపనీయ వారిపై సుందరనౌకాగమనవిలాసమునుఁ
గటాక్షింపుడు.

ఉ. కాంచనవాలుకోపరి విశుద్ధసురాపగరీతిఁ బోతహం
సాంశులఁ బొల్చుఁగృష్ణపయి లీలగ నీదరిఁ జేఱఁబారు నా
రాజమరాళ రూపతరణింగన దోఁచెడు యానహంసి, స
త్సంగరతైకశ్రీపరమ హంసుని గొల్వఁగ వచ్చు వేడుకల్‌॥

సోమగిరి :—కుమారా ! త్వత్కవిత్వరసప్రవాహమునఁ దగులు
వడుటచేత నాచేతనము లన్నిటికిని నీ యతివేల గురు
భక్తివాసన యంటుననుటకు సందియమేమి ? నీమృదు
మధుర స్తుతికి పరమానందము నొందితిమి.

కళానిధి :—మహాస్వామీ ! తమకు నే నింతకన్న నెట్టి
సువర్ణదక్షిణ పాదపూజ లొనర్పఁగలను ?

సోమగిరి :—పుత్రా ! నీ కిక నే కొరంతయు నుండదు. నీ
సంకల్పము లన్నియుఁ జింతామణి కృతములుగా
నెఱవేఱఁగలవు.

కళానిధి :—మహాస్వామీ ! కృతార్థుఁడను. ఇం కొకచిన్న
మనవి యున్నది. తమరు నాగృహమునుఁ బావనముఁ
జేసి నావందనములు స్వీకరింప వేడుచున్నాను.
ఐహికాముష్మిక సంబంధము లైన యనేకసందేహ
ములు నన్నుఁ బీడించుచున్నవి. వాటి నన్నిటిఁ దమ

ముఖమునఁ దొలగించుకొనఁ గల నని నా కాస గలిగినది. తమయాజ్ఞకుఁ బద్ధుడను.

సోమగిరి :-వత్సా ! నీకోరికప్రకార మొనర్పుము.

కళానిధి :-అనుగ్రహింపఁబడితిని.

[స్నానము చేసి వేదండభట్టు మొద లగుబ్రాహ్మణు లందఱుఁ బిల్లకీసహితముగ మఱలఁ బ్రవేశించి వందనములు చేతురు.]

వేదండ :-అవ్వలియొడ్డునుండి, చింతామణియు, నాపెత్తల్లి ఐరావతియు వారిసొంతపడవమీద వచ్చి సపరివార ముగా మనరేవులో దిగి మనవంకకే వచ్చుచున్నారు.

[ప్రవేశము చింతామణి మొదలగువారు]

చింతామణి :-(జనాంతికము) అమ్మ ! ఆడఁబోయినతీర్థ మెదు రైనట్లే పర్వదినమున నాంధ్రదేవసేవార్థినుల మైన మనకు మున్నుం దీపుణ్యతీర్థమున నీపరమ యోగీశ్వరుఁడు దర్శనమిచ్చుట యిహపరకల్యాణావ హము. విష్ణుసహస్రనామపూజకై నేను తెచ్చిన వేయివరహాలను దన్నామములఁ జపించుచు నీప్రత్యక్ష నారాయణునికిఁ బాదపూజగా సమర్పించెదను. మొదట వీరికి ఫలాదుల నర్పించి వందనము లొనర్చిన తరువాత నీ బ్రాహ్మణోత్తములకుఁ బండ్లను దక్షిణా తాంబూలములను బంచిపెట్టుదము,

ఐరావతి :—కానిమ్మ, తల్లీ ! అట్లే కానిమ్మ.

[ఇద్దరును వెండిపళ్ళెరములతో వరహాలను, ఫలములను స్వామిముందుఁ బెట్టి వందనములఁ జేయుదురు.]

సోమగిరి :—నారాయణ.

[తరువాత బ్రాహ్మణులకు నమస్కరింతురు]

చింతామణి :—(కళానిధినిఁ జూచి, స్వగతము) సర్వజ్ఞసన్నిధి న్మెలంగుఁగుమారస్వామివలె నీయతీశ్వరాంతికమున వెలుంగు నీమహామహుఁ డెవ్వరో ?

మ. తరుణార్కప్రతిమంబు తేజము, మృగేంద్రస్పర్థి దేహంబు, స
ర్వకళాపూర్ణము నెమ్మొగమ్ము, కను లంతర్బాహ్యశాంత్యర్థ లా
యతరేఖారమణీయముల్, మఘవ మత్తేభాపహాసంబు తీ
వియుఁ, గందర్పపరప్రవీణుఁ డన నొప్పె నిమ్మహాపూరుషున్॥

ఐరావతి :—(సన్యాసి నుద్దేశించి) స్వామీ ! ఈబిడ్డ నా కూతురు. పేరు చింతామణి. కులవిద్యలఁ బూర్తిఁ జేసినది. ఇంకనుఁ గన్నెరికముఁగాలేదు. ఉత్తమవర ప్రాప్తి నాశీర్వదింపఁ బ్రత్యక్షదైవతము లగుఁదమ్ముఁ బ్రార్థించుచున్నాను.

సోమగిరి :—చింతామణి గావున, నధికారియగు భూసురేంద్రుఁ డీమె నచిరకాలమున నభిలషించి చేపట్టును లెమ్ము.

ఐరావతి :-మహాప్రసాదము.

కళానిధి :-(వేదండభట్టును గొంచెము ఎడముగాఁ గొంపోయి, జనాంతికము)

బావా! తే. గీ. ఆత్మ కబ్బెఁ జింతామణి మంత్రదీక్ష;
చెవులు నిండెనుఁ జింతామణి ప్రశంస;
కనులు పండెఁ జింతామణి దర్శనమున;
నహహా! చింతామణి మయంబు సకలజగము॥

నీ వన్నయ ట్లీమె యప్సరస్సౌందర్యవతి సుమా!

చం. జలజలఁ బాఱు తేటసెలయేటికిఁ దీటగు లేతమేనిపైఁ
గలకల లాడు మోము నెల గాసెడు చిక్కని రేవెలుంగుడాల్
జిగజిగ లీనుఁ గ్రొమ్మెఱుఁగు లెల్లకడ ల్విరజల్లునో యనన్
ధగధగ వెల్గు నీకుసుమకోమలిగాత్రము విద్యుదాభమై॥
నవనవ మాలికా సురభిళాంగి, సువర్ణలతానుగాత్రిఁ ని
స్తులలలితాంగమేళక, కిసాలవరాంగుళి, సూక్ష్మమధ్య, పీ
వర కుచచక్ర, వృంతగళ, పింఛశిరోరుహభార ఫుల్లసా
రసదళనేత్ర, స్మేరముఖి, రూపముదాల్చిన లాస్యవిద్య సూ॥

ఐరావతి :-బ్రాహ్మణోత్తములారా! నాబిడ్డ యీనాడీ తీర్థమున స్త్రీపురుషు లందఱికిఁ బంచిపెట్టుటకుఁ బండ్లను దక్షిణాతాంబూలసహితముగా, బట్టించుకొని వచ్చినది. తమ రందఱు స్నానపూతు లైయున్నారు.

తమలో నెవ్వరైన నీపళ్లెరములలోని ఫలతాంబూ
లాదులఁ బంచిపెట్టింపఁ బ్రార్థించుచున్నాను.

సోమగిరి :-కళానిధి వరహాలసంచిని, వేదండభట్టు – కాదు
కాదు – వేదన్నభట్టు పండ్లనుఁ బట్టుకొని పంచాడు.

వేదండభట్టు :-పండ్లు చాలారకము లున్నవి. కొబ్బరి
బొండములు, మామిడిపండ్లు, అరటిపండ్లు ద్రాక్షలు,
దానిమ్మలు, నైదురకము లున్నవి. తాంబూలపుఁ
బళ్లెరమొకటి, ఆరింటికి నార్గురుశిష్యు లిటు రండు.
(ఫలముల నెగురవేయుచు) ఇట్టి దివ్యఫలముల నెక్కడ
నుండి తెప్పించితివి ఐరావతీ ?

ఐరావతి :-అమ్మా ! తమ యాశీర్వచనమున, నివి యన్నియు
మా అమ్మాయి సొంతతోటలలో పండినవేనండి.
ఇంకను పడవనిండుగ నున్నవి, తృప్తిగా నిప్పింపుడు.

[పంచిపెట్టుట అయిన తరువాత]

సోమగిరి :-వేదన్నభట్టూ ! మీయూరి బ్రాహ్మణు లందరు
నిచటికి వచ్చినట్లున్నది. వీరిలో వేదవిహితాచారమున
నగ్రగణ్యు లెవ్వరు ?

వేదన్నభట్టు :-మహాస్వామీ ! వీరే బ్రహ్మశ్రీ అద్దేపల్లి
నాగయ్యశాస్త్రులుగారు. అధ్యయనాధ్యాపనల సాంగో

పాంగముగా నొనర్చి, వైశ్వదేవాదుల సక్రమముగా నెఱవేర్చి, యజ్ఞమున కధికారులై సిద్ధముగ నున్నారు.

[నాగయ్యశాస్త్రిలుగారు మఱల స్వామికి వందనము చేయును].

సోమగిరి :—నాగయ్యశాస్త్రీ ! చింతామణి మా కొసగిన ద్రవ్యమును, నీక్రతువునకు మూలధనముగా గ్రహించి శీఘ్రమున సోమయాజి వగుము.

నాగయ్యశాస్త్రి :—స్వామీ ! మహాప్రసాదము కృతార్థుడను.

ఐరావతి :—స్వామీ ! పసుపుకుంకుమలు పంచిపెట్టుటకు మే మిక స్త్రీలరేవునకుఁ బోవుదుము సెల విప్పింప వేడుచున్నారము.

సన్న్యాసి :—నారాయణ.

[తరువాత సవారిలో స్వామినిఁ గూర్చుండఁ జేసి కొందఱు బ్రాహ్మణులు స్వస్తిఁ జదువుచు నెత్తుదురు కళానిధి మొదలగువారు తరంగములఁ బాడుదురు. అందరు నిష్క్రమింతురు.]

'బ్రహ్మరథ' మను

ప్రథమాంకము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీః

# నయనామృతము

## ద్వితీయాంకము

గాజులలంకమీద తూర్పుదిశను గృష్ణలోనికి మెట్లు గల గొప్పసౌధము మొదటియంతస్తుమధ్య భాగమునఁ దూర్పుప్రక్కను, విశాలమైనపెద్దసావడి యందు, పడమటిగోడదరిని, మనుష్యప్రమాణమైన రాధాకృష్ణ విగ్రహము లమర్చఁబడి యుండును. ఆ విగ్రహముల కభిముఖముగా జింతామణి నిలచి యుండును. ఆమెకు వెనుక నైరావతియుఁ జేటికలు శారదియును రంజికయుఁ గూర్చుండి యుండుదురు. శారదయొడిలో మద్దెలయు, తక్కినవారిచేతులలోఁ దాళములు నుండును. వృద్ధుఁ డొకఁడు తిత్తి యూదు చుండును.

సమయము - రాత్రిప్రథమయామము. ఉజ్జ్వలము లైనదీపములు కృష్ణమందిర మంతటను వెలుఁగుచు నదిలో ప్రతిఫలించుచుండును.

చింతామణి గీతగోవిందగ్రంథమునుఁ బ్రారంభించి భక్త్యావేశముతో 'మేఘైర్మేదుర మంబరం' అను మొదటి శ్లోకమును బాడుచు తరువాత 'వాగ్దేవతా

చరిత' అను రెండవశ్లోకమును మొదటిదానికన్న నెక్కుడు తన్మయముగాఁ బాడును. మూడవ దగు 'యదిహరిస్మరణే' యను శ్లోకమును నీపద్దాద్దదిక కంఠముతో బాడి, చివర 'జయదేవ సరస్వతీం' అను మాటను ముమ్మారు హీనస్వరముతో నుచ్చరించి, యంతమున రాగసంచారముఁ జేయలేక, నీళ్ళోడు చున్నకళ్ళు మూతలుపడి తూలిపోవును. ఆస్థితిని గనిపెట్టియున్న ఐరావతి లేచి చింతామణినిఁ బడ కుండఁ బట్టుకొని, కూర్చుండబెట్టి, తనపై నామె నానుకొని ముఖమునుఁ దలను సవరించుచుండును. చింతామణి యర్ధమూర్ఛావస్థలో నుండును. పరిచా రకు లుపచారములు చేయుచుందురు.

ఐరావతి :-(చింతామణి నుద్దేశించి) అమ్మా! ఈ ద్రాక్ష రసము కొంచెము త్రావుము. ఈ కస్తూరి బరణి వాసనఁ జూడుము. శారదీ! ఈరోజున బిడ్డ పరపురుషు లెవరికంటనైనఁ బడినదేమో దృష్టి తీసివేయుము. రంజికా! నీవు బావాజీ భరతాచార్యులు మంత్రించి యిచ్చినవిభూతిపండు నిట్లుఁ దెమ్మా.

[పరిచారికలు చిత్తమని యాప్రకార మొనర్తురు]

రంజిక :-(మేడ దిగి వెళ్ళి విభూతి తెచ్చి యిచ్చి) అమ్మా! భరతాచార్యులు వెంపటి వెంకటనారాయణశాస్త్రిగా రిప్పుడే మనగడపలో పడవఁ దిగి లోపలి కొస్తున్నారు.

ఐరావతి :-వారిని వెంటనే యిచటికిఁ గొని రమ్ము.

రంజక :- (చిత్త మని వెడలును)

నారాయణశాస్త్రి :-(ప్రవేశించి రాధాకృష్ణ విగ్రహము లకు నమస్కరించి) ఇదేమి ! ఇట్లున్నది చింతామణి!

ఐరావతి :-శాస్త్రిగారూ ! నమస్కారములు దయచేయుఁడు. సమయమునకు దేవునివలె వేంచేసితిరి. ఇప్పటికి రెండు సంవత్సరముల క్రింద మా కన్నతల్లి మీవద్ద కర్ణాటకముఁ బూర్తిఁ జేసి, సంస్కృతాంధ్ర సాహిత్యాలను, హిందూస్థానీ భాషను; సంగీతములో వివిధ బాణీల ప్రభేదాలను నేర్చుకొనుచుండగా, మధురా బృందావనము నుండి యొక బావాజీగారు వచ్చి, గీతగోవిందము నద్భుతముగాఁ బాడి వినిపింపగా నా గ్రంథము నాయనవద్ద సాంతముగా, సాభినయముగాఁ జింతామణి నేర్చుకొన్నది. ఆయన ప్రోత్సాహము మీదనే యీ కృష్ణ మందిరము నీ చావడిలో నిర్మాణము చేయించినది.

నారాయణ :-అవును ఇంతవరకు నిరుడు శ్రీకాకుళమున నాంధ్రవిష్ణువు తిరునాళ్ళఁ జింతామణి నాకుఁ గనఁబడినప్పుడు చెప్పినది. నన్ను వచ్చి యీ మందిరముఁ జూచి, తన గీత గోవిందగా నాభినయాలు పరామర్శించు మని కూడ కోరినది. కాని నాకు తీరిక

లేక రా లేక పోయితిని ఆ కనకుకు నిప్పటిజబ్బునకును సంబంధ మేమి ?

ఐరావతి :-మనవి చేయుచున్నాను. బావాజీగారు గీత గోవిందము నీరాధాకృష్ణ విగ్రహములనెదుట ప్రతి దినమును బాడి యభినయించుచున్నచో సర్వ వాంఛితములు నెరవేరు నని యీమె కుపదేశించిరట.

నారాయణ :-అవును దేవరారాధన మెప్పుడును వాంఛితార్థ ఫలప్రదమే.

ఐరావతి :-చింతామణికి నానాటికిఁ గృష్ణభక్తి యతిశయించి తన్మయముగఁ బాడుట, నృత్యము చేయుట, అభినయించుటలలో నిదివర కెవ్వరును నేర్పని కంఠ స్వర గతి హస్తాదు లమితరసోత్పాదకములుగా నా విర్భవింప మొదలిడినవి. అట్టిసమయముల విశేషముగా నలసిపోయి సొమ్మసిలుచుండెడిది.

నారాయణ :-ఇప్పుడు నంతమాత్రమేనా ? అంతకన్న భిన్నమా ?

ఐరావతి :-ఈపూట మొదటిమూడుశ్లోకములు మాత్రమే పాడినది. రెండవ శ్లోకములో 'జయదేవ' శబ్దము మొదలు కంఠస్వరము కంపించిపోయి, మూడవ శ్లోకము చివఱకు లోగొంతువడి కళ్ళనీరు గాల్చుచుఁ దూలి, మూర్ఛ చెందినది. ఇదివర కెన్నడునూ జైత

న్యము తప్పలేదు. ఇప్పుడు పిల్చినఁ బలుకదు. బావాజీ గారివిభూతిపెట్టినను లేవలేదు. శాస్త్రిగారూ! ఇది యొకజబ్బు కాదుగదా !

నారాయణ :-(నాడి పరీక్షించి) ఉద్రేకముచేత, నాడి కొంచెము చురుకుగా నున్నదే కాని, మరేదోషమును లేదు. నాకొకయుపాయము తోచుచున్నది. ఈ తొట్రుపాటంతయు జయదేవునామ ముచ్చరించుటయు, నాయనకవనమునుఁ బఠించుటయు మాత్రముననే కల్గినచో నాజయదేవునియపరావతార మని యీనడుమ వాసిఁగాంచిన శ్రీకాకుళవాసి, మహాకవి శ్రీకళానిధిమిత్రులశ్లోకములు రెండుమూడు నాకు వచ్చినవాటిని వారిశిష్యులయాంధ్రానువాదపద్యములతోఁ గూడఁ బాడెదను. ఏమిజరుగునో చూతము.

[చింతామణి కొంచెము తెప్పలు కదల్చును]

ఐరావతి :-మీ రామాట లనుటతోడనే కొంచెము గుణము కనుపించుచున్నది. కానిండు స్వామీ! త్వరగాఁ బాడుడు. వెంకన్నా, శాస్త్రిగారికి శ్రుతిపోయుము.

నారాయణ :-శ్లో. భాసతాం భవభయైకభేషజం
మానసేమమ ముహుర్ముహుర్ముహుః
గోపవేష ముపసేదుష స్స్వయం
యాపి కాపి రమణీయతా విభోః

తే. గీ. ఇహాభయంబుల కెల్ల సిద్ధౌషధంబు
దేవదేవుని స్వగృహీత గోపవేష
మొక్కటియె ; దానిపరమవైభవము
మాటిమాటికిని నామనంబున మెఱయుగాత

[చింతామణి కాలుచేతులు కదల్చి నిట్టూర్పు పుచ్చును]

శ్లో. తమసి రవి రి వోద్యన్మజ్జతా మంబురాశౌ
ప్లవ యివ తృషితానాం స్వాదువర్షీవ మేఘః ।
నిధి రివ విధనానాం దీర్ఘతీవ్రామయానాం
భిష గివ కుశలం నో దాతు మాయాతు శౌరిః ॥

ఉ + చ.మా. చీకటియందు భాస్కరునితోచుటమాడ్కి, సముద్రమందు మ
న్గెడునెడఁ దెప్పవోలె, దగగొట్టినవారికిఁ దియ్యనీరు వ ।
ర్షించు ఘనంబుచందమునఁ బేదకుఁ బాతువలెన్ రుజార్తిఁ బ్రా
ణము లెడలంగనున్నపుడు వెజ్జగతిన్ మము శౌరి బ్రోచుతన్ ॥

(చింతామణి కళ్లు తెఱచును)

శ్లో. సాయంకాలే వనాంతే కుసుమితసమయే సైకతే చంద్రికాయాం
త్రైలోక్యాకర్షణాంగం సురనరగణికామోహనాపాంగమూర్తిం

సేవ్యం శృంగారభావైః నవరసభరితైః గోపకన్యాసహస్రైః
వందే హం రాసకేళీరత మతిశుభగం వశ్యగోపాల కృష్ణం.

సీ. బృందావనమ్మున యమునానదీతీరనికట
నిర్మల సైకతముల మీఁదఁ
బూలకారువ మునుమాపువేళలఁ
దేటవెన్నెలల్ నిండారఁ గురియుచుండ
నవరసరసికలౌ వల్లవసుందరుల్
వేవేలు వలపు లుప్పొంగి కొలువ
స్వైరిలాకళావతీసమ్మోహక భ్రూల
తాపాంగ చతురచాలనము లొప్ప

తే. గీ. రాసకేళీవిలోడుఁడై ముజ్జగముల మురిపెముల
ముంచు సింహాసంహాననమూర్తి।
వశ్యగోపాలకృష్ణవిఖ్యాతకీర్తి సతము సేవింతు
సౌభాగ్యచక్రవర్తి॥

(చింతామణి లేచి కూర్చుండి గురువుగారికి నమస్కరించును)

ఐరావతి :-నాతల్లీ! లేచితివా? ఎట్లున్న దమ్మా?

చింతామణి :-ఇప్పుడు స్వస్థముగనే యున్నది. ఇంతవరకు మీమాట లన్నియు వినబడుచు తెలియుచుండెడివి గాని నేనుమాత్రము కదలలేక మెదలలేక పడియుంటిని.

నెక్కవవన్నెఁగూర్చి యాచంద్రతారకముగఁ గీర్తి వహించు నని దీవన సెలవిచ్చిరి.

నారాయణ :-పెద్దలమాటలు జరిగితీరు నన్నది నిజమే కాని, యీమె ప్రయత్నముగూడఁ దోడుపడినప్పుడుగదా పేరుగీర్తులు కలుగుట ! కళాప్రదర్శన మొనర్పకున్న నూరక పేరుకీర్తు లెట్లు వచ్చును ?

ఐరావతి :-తా నాగర్భశ్రీమంతురా లగుటచే, నితరసానుల వలె జీవనము కొఱకు మేళముల కేగుట, యనవసర మనియును, ఉత్తమక్షత్రియబిడ్డ యగుటవలన పండిత రాజసమ్మానముల కవకాశ మున్నప్పుడే తనవిద్యలఁ బ్రదర్శింతు ననియు నామెదీక్ష.

నారాయణ :-పురుషస్వీకారముపట్లఁగూడ నట్టిదీక్షలే య డ్డగుచున్నవా.

ఐరావలి :-అందునఁగూడ బ్రాహ్మణుని గాని యొల్లదఁట ! తన విద్యలకు దగినరాజసన్మానముఁ బడసినపిదపగాని గన్నెరికము విడువదఁట ! అటుపైనఁ దనవిద్యల కానందింపఁ గల రసికశ్రేష్ఠుఁడు పేదబాప డైనను నట్టివాని వరించి, యాజన్మము నాయనతోఁ బాతి వ్రత్యము నెరవేర్చునట.

నారాయణ :-అసాధ్యపుదీక్షలే ! ఐనను, అందు మొదటిదగు విద్యాదీక్ష యత్యుత్తమముగా నెరవేరుసమయము

వచ్చినది. ఆసంగతి మీకుఁ జెప్పుటకే నే నిప్పుడు తొందరగా నిటకు వచ్చితిని.

[కృష్ణ కవ్వలియొడ్డున నగారామొద లగు మేళ ముల ధ్వనులును జనులకలకలమును వినవచ్చును. అందఱు నావంక జూతురు]

ఐరావతి :-శ్రీకాకుళపుదేవుపొడుగున నన్నిదీపము లున్న, వేమిటి శాస్త్రిలుగారు! మన మింతదనుక వేరు ధోరణిలో తూర్పుదిక్కు చూడనే లేదు! ఆ మను ష్యులకలకల మేమిటో? అందఱుజన మక్కడి కెందు లకు వచ్చిరి? గుఱ్ఱముల సకిలింపులు, నేనుఁగుల ఘీంకారములు గూడ వినఁబడుచున్నవే? ఆబాజా లేమిటో! యుద్ధ మిక్కడకుఁ గూడరాలేదు గద.

నారాయణ :-యుద్ధము గాదు. శ్రీ ఆంధ్రదేవుని కల్యాణ మహోత్సవములు మహావైభవముతో జరుపుటకు శ్రీ రాజాధిరాజ కృష్ణదేవరాయ మహారాజులుం గారు పిలిపించిన యధిక పరివారము లవ్వి. శ్రీకాకుళ గ్రామములో చోటు చాలదని నదీప్రాంతమున విడియించినారు. ఆ మేళములు మహారాజ సాన్నిధ్య మున జాముజామునకు మ్రోయించు నాచారము. ఇప్పుడు రాత్రిలో ప్రథమయామ మైనది.

ఐరావతి :-ఆ మహారాజులు ఈ పరివారమునకన్న ముందే శ్రీకాకుళము విజయముచేసిరా? ఎప్పుడు? ఎందు

లకు ? మే మీనదీమధ్యమున నీలంకలో నొంటరిగాఁ బడియుండుటచే మా కేమియుఁ దెలియదు.

నారాయణ :-వారు మొన్న ఫాల్గుణ శుద్ధ ఏకాదశినాఁ డాక్షేత్ర మునకు యాత్రార్థము కొలది పరివారముతో వేంచేసిరి. ఆనాఁ డుపవసింపగా, నారాత్రి యాంధ్రవిష్ణువు లక్ష్మీసమేతుఁడై వారికిఁగలలోఁ బ్రత్యక్షమైనాడు.

ఐరావతి :-ఎల్లెట్లా ? ఎంత యదృష్టము ? దేవుఁ డంత సుముఖుఁడును, సులభుడును గనుకనే వారి కాపదవియు నింత దిగ్విజయమును । ప్రత్యక్షమై ఏమి చేసెను.

నారాయణ :-స్వామి మహారాజు నాంధ్రమునఁ గృతి రచించి తన కంకితముఁ జేయు మని యాజ్ఞాపించి యంతర్ధాన మయ్యెనట.

ఐరావతి :-ఆ మహారాజు లంతటి పండితులా ?

నారాయణ :-వారు బహు భాషాకోవిదులు దేవభాషలో ననేకగ్రంథములు నుడివినవారు. దేశభాషలలో కావ్యములు సేయుట కిదియే ప్రథమ మగును, గాని యాంధ్రభాషయందు వారికిఁ బరమాభిమానము. ఆంధ్రకవు లనేకుల నాస్థానమున సమ్మానించిఁ బోషించుటలో నపర విక్రమార్కు లనియు, నపరభోజు లనియు నపారకీర్తి గడించిన వారు. వారికి ప్రవేశము లేని కళ లేదు.

ఐరావతి :-తరువాత నేమి జరిగినది ?

నారాయణ :-నిన్న ద్వాదశి నాటి యుదయమున, శ్రీరాయ వారు తమ వెంటవచ్చిన యాస్థాన పండితులను శ్రీకాకుళవాసు లగు కళానిధి మిశ్రులు మొదలై పండితులనుఁ బెద్దలను రాలించి, సభఁ జేసి, తమ స్వప్నవృత్తాంతమును సెలవిచ్చి యాకలకు ఫలి మునుఁ జెప్పు డని కోరిరట. పదుగురు పదివిధములుగాఁ జెప్పిరఁట గాని, కళానిధిమిశ్రులు మాత్ర మాకలకు గొప్ప భావ్యభ్యుదయ ఫలితమును స్వప్నశాస్త్ర ప్రమాణ సహితముగ నిరూపించిరట !

చింతామణి :-తరువాత నేమి జరిగినది ?

నారాయణ :-ఆంధ్ర దేవునకు శ్రీరాయలవారిపైఁ గలిగిన ఝుడితి ప్రసన్నతకుఁ బ్రభువుల కాదేవునియందు వినయ ప్రపత్తు లతిశయిల్లి కళానిధి మిశ్రులయుపదేశ ప్రకార మీరోజు మొదలు మూఁడుదినములు స్వామికి నైమిత్తిక కల్యాణోత్సవములు సంకల్పింపఁబడినవి.

ఐరావతి :-శ్రీరాయలవారీ రెండు రోజులు నా పల్లెటూరిలోఁ దమ సేనలకు దూరముగా నెట్లు ప్రొద్దుపుచ్చుచుండిరి ?

నారాయణ :-ప్రొద్దు పుచ్చుట కేమితక్కువ ? వారికి బ్రతిదినము కొంతకాలము నూత్నజితము లైన దేశములఁ

బరామర్శను గూర్చిన టపాలతోనే సరిపోవునట ! తక్కినకాలములోఁ జాల వఱకు విద్యాగోష్ఠి జేయుదురఁట. ముప్పొద్దులు నాంధ్రదేవు నారాధించుటతోనుఁ గల్యాణోత్సవ సన్నాహములతోనుఁ దక్కిన కాలము గడచుచున్నదఁట. విద్యాగోష్ఠి చాలవరకుఁ గళానిధి మిశ్రుల కళావినోదముల రూపమున నడచుచున్నది.

చింతామణి :-ఆ వినోదము లెట్టివిగా నుండును ?

నారాయణ :- ఆశుకవిత్వము, సమస్యాపూరణము, చతురంగకేళి, మల్లయుద్ధఖడ్గ కౌశలాదుల ప్రదర్శనము, చిత్రలేఖనము, సంగీతము, భూమికావహనము, మొదలగు చతుష్షష్టికళలును, నంతకుఁ బెక్కులునుగూడఁ గళానిధి మిశ్రులకును వారి వేలకొలది శిష్యులకును, సుసాధితములు.

చింతామణి :-అట్టికళాప్రదర్శనములలో దేనినైనఁ దమరు స్వయముగాఁ జూచియుంటిరా ?

నారాయణ :-ఈయుదయమే మహాద్భుత మొకటి జరిగినది. శ్రీరాయలవారు మహామాత్యదండనాథ సామంతాదులతో రాజకార్య నిమగ్నులై యుండ నెచ్చటినుండియో ఆకస్మికముగా వందలకొలది తురకలు పల్లకులలోను, గుఱ్ఱములమీఁదనుఁ గాలి

నడకను వచ్చి, రాజశిబిరమువాకిట నిలచి గోల్కొండ నవాబుగారు సర్దారులతో మహారాజుల దర్శనము కోఱకు వచ్చిరని లోనికి వర్తమాన మంపెరి.

ఐరావతి :-గోల్కొండనవాబు బెజవాడ యుద్ధములోఁ బరాజితుఁడై పారిపోయెనుగదా, మఱల నిచ్చట కేల వచ్చెను ?

నారాయణ :-ఆతురకలచేతులలో నాయుధములు లేక పోవుటచే తను, సంధినిమిత్తము వచ్చితి మనుట చేతను, బ్రతికిపోయిరి గాని, లేకున్న రాయలవారి యంగరక్షకులు వారి నప్పుడే హతమార్చి యుందురు.

ఐరావతి :-శ్రీరాయలవారు వారి నెట్లాదరించిరి ?

నారాయణ ;-వెంటనే లోనికిఁ గొనిర మ్మని యుద్యోగస్థుల నంపి, యుచితాసనముల నాయత్తము చేయించిరి. తురకలు లోపల బ్రవేశించుచుండ, నవాబునకు స్వాగత మిచ్చుటకు శ్రీప్రభువా రాసనమునుండి లేవబోవ, సర్వతంత్రజ్ఞానమునను శుక్రాచార్యులఁ దలఁదన్నిన తిమ్మరుసుమంత్రిమహారాజును లేవనీయక, వచ్చినవారికిఁ దాను స్వయముగా స్వాగతమిచ్చి యర్హాసనములపై నాసీనులఁ జేసెను.

ఐరావతి :-తురకల యభ్యర్థన మెట్లు ఫలించెను.

రాయణ :-ఆవచ్చినవారిలో బెజవాడ యుద్ధములో రూఢిగా జచ్చిన సర్దారులు కూడఁ గొంద ఱుండిరట! ఆ చచ్చినవారే ప్రసమమునఁ దమనవాబుతోఁపున మాట్లాడఁజొచ్చిరట.

రావతి :-అదేమి శాస్త్రులుగారూ! మరణించినవారు మఱల దేహములతో నెట్లు వత్తురు? రాయలవారేమను కొనిరి? ఎట్లు వర్తించిరి?

రాయణ :-రాయలవారి కనురెప్పలకైనఁ జలింపఁ దడ విచ్చునా నవయుగంధరుఁ డాతిమ్మరుస్మమంత్రి? "మీదేవుఁ డగు నల్లా మీకు వశుఁడై మీలోఁ జచ్చినవారి నందఱఁ బ్రతికించుచుండ మాప్రభువులతో సంధి గోరునంతటి దైన్యము మీ కేల" యని వారిని బ్రశ్నించెను. ఆ ప్రశ్నమునకు, "దేవాంశ సంభూతు లగు మీప్రభువులతో నోడంబడు డని మాకు బుద్ధిఁ గలుపుటకే వీరినిఁ బ్రతికించి పంపె" నని వారినవాబు జవాబు చెప్పెను.

రావతి ;-మృతులు నిజముగా బ్రతికిరా శాస్త్రులుగారూ?

రాయణ :-అప్పటికి రాయలవారు యథార్థమును గ్రహించి, తమమెడలోని నవరత్నహారమునుఁ దీసి నవాబువేషధారి యగు కళానిధి మిశ్రుల మెడలో

వేయించి 'మీకోరిన వస్తువు లన్నిటికొడఁబడితి మ'
చిఱునగవుతోఁ బలికి యభయహస్తసంజ్ఞఁ జేసిరి.

ఐరావతి :-చివర కిదియా శాస్త్రులువారూ ! (అని నివ్వెఱ
పోయి నవ్వసాగును.)

[అదివఱకే నవ్వుకొనుచున్న చింతామణి పకపక
బడి నవ్వును.]

చింతామణి :-ఆ వినోద మెట్లు పర్యవసానము నొందెను ?

నారాయణ :-ఆ పారితోషికముతోఁ దమరహస్యము బయట
లాయె నని గ్రహించిన కళానిధిగారు, రాయలను,
మహామంత్రినిఁ బలువిధముల స్తుతింప, శ్రీరాయలు
"మావేషమునుఁ గూడ వేయుదురేమో ? మిమ్మికఁ
గట్టడి చేయవలయు" నని నవ్వుచు ననిరి. అందులకుఁ
గళానిధి "దేవా ! ఒకగుణవిశేషముచే నిదివరకే
ప్రత్యక్షముగాఁ గట్టివేసితిరి. దేవర యనతారాశ్రయ
ములైన గుణాదులన్నిటిచే గట్టిన నావేష మేలిన
వారితో సారూప్యానువర్తనముల, నావంతయుఁ
గొఱతవడని పూర్ణత్వసిద్ధి నొందదా మహాప్రభూ !"
యని మాఱువల్కెను. రాజా మాటల రహస్యార్థ
మును గ్రహించి "సెబాస్, సెలవిచ్చితి" మనిరి.
తరువాత, కళానిధికి రహస్యముగా, రాయలవారి రక
రకముల దుస్తులను, భూషణాదులను, ఆయుధవిశేష
ములను విశేషముగాఁ బంపిరఁట.

ఐరావతి :-తమరు మా కెరిగింప వచ్చితి మన్న వార్త యేమి?

నారాయణ :-మన దేశపు నాగరకతా సంపత్తినిఁ జూచి యుబ్బురపడుచున్న మహారాజుగారికి గళానిధిగారి యద్భుత విద్యల యనుభవమైనపిదప, వారి ప్రోత్సాహముపైఁ గృష్ణాప్రాంతదేశవాసుల వివిధ విద్యానైపుణ్యము నింకనుఁ జవిఁజూడఁ గుతూహలము పుట్టి, యీ పూర్ణిమ మొదలు మూడు దినములు శ్రీకాకుళమున సకల విద్యాప్రదర్శనసభల నేర్పాటుచేయించి నిన్నటినుండి గ్రామముల వెంటఁ బ్రచురింపఁ బంపిరి. నిన్నరాత్రి మాకూచిపూడిలో నాకు దెలిసి, యీయుదయము శ్రీకాకుళము జేరి, యక్కడ సంగతుల సాకల్యముగ నాకళింపుఁజేసికొని, యీ పూట నిక్కడకు వచ్చితిని. సభలు పరమోత్తమముగాఁ జరుగును. పాల్గొనువారిలో నుత్కృష్టుల కపారగౌరవసంభావనలు చేకూరును. చింతామణి తప్పక మహారాజాస్థానమునఁ గళావతులలో నగ్రతాంబూల మందగలదు. ఆమెగురువుల మగు మాకును సాటిలేని రాజ సమ్మానము గలుఁగు నని యాశ యున్నది.

చింతామణి :-విద్యాపరీక్షకులుగా నెవరిని నియమింతురో?

నారాయణ :-రాయలవారు స్వయముగా భరతశాస్త్రపారంగతులు; వారి యాస్థాన సంగీతాభినయ పండితులు 'అభినవభరతాచార్యే'త్యాద్యనేక బిరుదాం

చితులు, బండారు లక్ష్మీనారాయణ మంత్రిగా రున్నారు. మనదేశపువారిలో నగ్రగణ్యులగు గళానిధి మిశ్రులనుఁగూడ దప్పక పరీక్షకులనుగా నియమింతురు.

చింతామణి :-అట్టిసభలో విద్యలఁ బ్రకటించు నవకాశ మెంతటి నటి జన్మములో నైన నఁ గలుఁగుట దుర్లభమే! శ్రీ రాధాకృష్ణానుగ్రహమువల్లనే నా కీయదృష్టము పట్టినది.

ఐరావతి :-అమ్మా! గీతగోవిందమును మాత్ర మక్కడఁ బ్రారంభింపకుమా! ఈపూటవలె జరిగిన రసాభాస మగును సుమా!

చింతామణి :- ఏ మహామహుల కవిత్వపుఁబఠనమునకే నాయస్వస్థతను పోగొట్టు ప్రభావము కలదో వాని ప్రత్యక్షముగ నండ నుండ నా కట్టి భంగపాటే కలుగదు. గీతగోవిందము హిందూస్థానీ బాణీలోఁ బాడి యభినయించు టీ దేశములో నరిది. నటు లందరిలో నా కగ్రస్థాన మాగ్రంథము మూలముననే లభింప వలెను. తక్కినప్రబంధములు కొంచె మెచ్చు తగ్గుగా మనదేశము వారందరికిని సమముగనే వచ్చును.

ఐరావతి :-నీ యిష్టము, నీగురువుగారి యిష్టము తల్లీ! నీ యిష్టదేవము నీకు జయమ్ము చేకూర్చుఁగాక!

నారాయణ :-ఆమె యిష్టము ప్రకారమే మన మందఱ మీ రెండు రోజులును మఱల నభ్యాసము చేయుదము. పాఁగునకును, మృదంగమునకును, మీయాంధ్రదలోఁ దగినవారల శ్రీకాకుళమునుండి పిలిపింపుము.

ఐరావతి :-మనదేశమువాంద్రే కలరుగదా! రే పుదయమే పిలిపింతును.

చింతామణి :-పరీక్షకులు హిందూస్థానీ బాణీ పాట యందును, నృత్యాభినయములయందు నభిమానము కలవారగు దురా, పంతులుగారూ!

నారాయణ :- కళానిధిమిశ్రు లుత్తరహిందూస్థానమునఁ జాలకాలము విద్యాభ్యాసము చేసి, విశేషముగాఁ బర్యటన మొనర్చినవారు. వారికి రెండు బాణీలును సమముగా తెలియును. గీతగోవిందము వారి కభిమాన గ్రంథము. రాయలవారికిని హిందూస్థానీ గీతనృత్య ముల యనుభవ ముండకపోదు.

ఐరావతి :-కళానిధిగారి కెంతవయస్సుండును స్వామీ?

నారాయణ :-ముప్పదిరెండు సంవత్సరముల యీడువాఁడు.

ఐరావతి :-నేను నంతే యనుకొంటిని.

నారాయణ :-రాయలసభలకు మీ రేగుట బొల్లిసానిపోతు నీడుగారి కిష్ట ముండునా?

చింతామణి :-వారి యిష్టముతో నా కేమిపని ?

నారాయణ :-మీయమ్మకూడ హాఁగునకు రాకున్న నిండు కలుగదు. ఆమెకైన నీడుగారి సమ్మతమును గమ నించు టవసరమే కదా!

ఐరావతి :-నేను మాత్రము స్వేచ్ఛచేతను వారి యధీన మున నుంటినా ? ఆయన యీ దీవిసీమ కిజారాదా రైన తరువాత, వారు నన్ను బలవంత పెట్టగా, మా అమ్మాయి ఆస్తిస్వాస్థ్యములకు భంగము కలుగకుండుట కొఱకు వారితోఁ గాలక్షేపము సేయుచున్నాను.

నారాయణ ;- వా రిప్పు డెచట నున్నారు ?

ఐరావతి :-నాకుమాత్ర మేమి తెలియును? ఇప్పటికి నెలరోజుల క్రింద బెజవాడ యుద్ధమునకుఁ బూర్వ మొకరాత్రి వచ్చి యుద్ధమునకు రమ్మని యొడ్డెరాజుల యాజ్ఞ యైన దనియుఁ, దాము పోవుచుంటిమనియు జెప్పి వెళ్ళిరి. తరువాత యుద్ధమున నోడిపోయినవారు పారి పోయి రని తెలిసినది. పొతునీడుగా రే మైనదియు, నింతవఱకు తెలియలేదు.

[వెనుకతెరలో 'ఐరావతీ' యని పిల్చినధ్వని వినవచ్చును.]

అదిగో దొడ్డితలుపువద్ద వారిపిలుపువలె నున్నది. చూచి వచ్చెదను.

[నిష్క్రమించును.]

చింతామణి :-స్వామీ ! కళానిధిమిశ్రులకు సంతాన మెందరు ?

నారాయణ :- ఆయన వెనుకఁ బదిసంవత్సరముల క్రింద విద్యముగించి వచ్చినపుడు వివాహ మైనది. అటు తరువాత మఱల శాస్త్రదిగ్విజయయాత్ర చేసి తిరిగి వచ్చిన వెంటనే, రెండుసంవత్సరములనాఁడే పునస్సంధాన కార్య మైనది. ఇంకను సంతానము కలుగలేదు.

చింతామణి ;-వారి భార్యగారు విద్యావతియేనా ? ఆమె గారిపేరు మీ రెరుగుదురా ?

నారాయణ :-మా బ్రాహ్మణులలో నాడువాండ్రకు విద్యలు చెప్పునాచారము లేదు. ఏదో విశేషకారణ మున్నఁ గాని, స్త్రీలకు విద్యావ్యాసంగ మలవడదు. అట్టిస్థితి యరుదు గాని సామాన్యము గాదు. కళానిధి మిశ్రుల భార్యపేరు 'కామేశ్వరమ్మ'గారు. సరిగా నీ యీడుండును. చిన్నతనముననే దొడ్డ యిల్లా లని పేరు పొందినది.

శారది :-(ప్రవేశించి) స్వామీ ! తమర్ని పోతునీడుగారు ర మ్మంటున్నారు.

చింతామణి :-పంతులుగారూ ! నేను వెళ్ళి పరుండెదను. మీ రక్కడకు వెళ్ళుఁడు.

[అని నిష్క్రమించును.]

శారది :-ఇట్లా దయచేయండి స్వామీ! మామగారు కింద కచేరీసావిట్లో ఉన్నారు.

[ఇద్దరును పరిక్రమించి దిగువ కేగుదురు.]

[పోతునీడు ఐరావతియు ప్రవేశము;
పోతునీడు శాస్త్రిగారికి నమస్కరించును.
శాస్త్రి దీవించును.]

ఐరావతి :-(పోతునీడు నుద్దేశించి) నామాటలు నమ్మకపోతే శాస్త్రిలుగారి నడగండి. ఇవి యుద్ధపు సేనలు గావు. మీ కిక్కడెంతమాత్రం భయంలేదు. శ్రీ రాయల వారిక్కడ నాంధ్ర విష్ణువు నారాధిస్తూ విద్యా వినోదాలు చేస్తున్నారుట.

పోతునీడు :-యామో! యవ ణ్ణమ్మాడయ్యా! ఆ తిమ్మరస య్య మా సెడ్డోడు. నువ్వెరగవ్. ఆడు పైకి సెప్పే దొకటీ సేసే దొకటీనీ. నే నిక్కడుండా నని తెలిత్తే పట్టొకమని ఆయమదూత ల్నంపితేమో?

నారాయణ :-మీ రిప్పు డెచ్చటనుండి వచ్చితిరి? మీకు తెలిసిన వార్త లేమి? ఇప్పు డింత ప్రొద్దుపోయి, యిచటి కెట్లు యెందులకు వచ్చితిరి?

పోతునీడు :-విద్ధంలో వోడి పారిపోయింతర్వాత అనేకసోట్ల దాక్కనీ, దాక్కనీ, సివరికి మొన్న కొల్లూరు సేరు

కుని, నిన్న అవినిగ డ్డెల్లాను. ఇంటా పిల్లల్నాన్న తిన్నగా సూసుకోలేదు; అప్పుడే పదిమంది యిజాన గరపోళ్ళు మావూరొచ్చారని తెలిసింది. అట్టా టోళ్ళు వూరూరు తిరుగుతున్నారంట! దాంతో యిహ కార్రెం లేదనుకుని యియ్యాళ్ళ బాగా పొద్దోనిచ్చి, పడ వెక్కి, పడమటేపుపాయంట, యీళ్ళ గూడా సూసిపోదామని యిక్కడ కొత్తే, యిక్క డసలోళ్ళే వున్నారంట! ఇహెట్టా ఇక్క డుంటం?

ాయణ :-అది యంతయు మీ భ్రమ గాని, మఱియొకటి కాదు. ఆ మంత్రియు నారాజును పలాయితుల వెంటఁ బడి చంపువారు కారు. మీయూరు వచ్చినభటులు విద్యాసభలఁ బ్రకటించుటకు వచ్చినవారు. అట్టివా రూరూరును వెళ్ళినమాట నిజమే. మీ రిక్కడ నున్నట్లు తెలిసినను, మీసంగతి తలపెట్టువా రైన నుండరు. ఎల్లుండి సభలకు వెళ్ళి వచ్చిన తరువాత, నైరావతియే నామాటల సత్యమును మీకు చెప్ప గలదు.

నీడు :-అయితే, ఐరావతి కూడా యెల్లు ద్దన్నమాటేనా? ఆ పెంకెపిల్లెట్టాగూ నే సెప్పిన ట్టినదు. అయినా, యిదెంమ కొచ్చిందో, యెల్లిరానీ. ఆపోతురాజూ, నాంచారమ్మా

నాపాలిటుండి ఆరాపోడికన్ను మాసింతామణిమీ
వోలిం దంటే మల్లీ, కోట్లోపాగాయేశా నన్నమాటే
మల్లీ నాయిజారా నాకిచ్చేసినన్నోరాజును సేసినా
సేత్తాడు.

ఐరావతి :-మీ రట్లాంటిఆశ లేమీ చింతామణిమీద పెట్టుకోవద్దు. అది తాను వరించిన బ్రాహ్మణ్ణే గాని అంగీకరించదుట. పైగా మీరు దానితండ్రిగారికి శత్రువు లని మీమీద దానికి కోపం.

పోతునీడు :-దానికి నే నేమపకారం సేశానూ ? దాని పూళ్ళూ, యీయిళ్ళూ, తోటలూ నాయిజారాలోవే నని నేమండా లాక్కున్నానా ? ఇంకా పెంచి పెద్ద దాన్ని సేసి, యింతఆటాపాటా సెప్పించినందుకా నామీద కోపం ? సివరికి నే సెప్పిన ట్టైన కెక్కడికి పోద్దేంటి ? రాజు కీపిల్లని నజరెడితే మన మంతా మల్లీ సుకంగా బతకొచ్చు.

ఐరావతి :-ఇదా మీఆలోచన ? మీ రిదివఱకు చేసినదంతా నాకోసం చేశారు గాని, దానికోస మేం చెయ్యలేదు. నేనూ దాని క్షేమంకోసమే మీచెప్పుచేతల్లో వున్నాను. అది మీకడుపున పుట్టనన్నా లేదు. దాని మీద మీ కేమీ అధికారం లేదు. అది మీకు

లోంగేదీ కాదు. దానిమీద మాత్రం మీకుట్రబుద్ధి
ప్రయోగించకండి. మీకు పుణ్యముంటుంది.

పోతునీడు :-పున్నె మేంటి? ఓబోడిబాపనోడు, మారాజు
కంటె మంచిమొగుడౌతాడా యేంటి? బోగందానికి
పెబువు దొరకటంకంటె కావాల్సిం దేవుంటుంది?
నే నాలోసిచ్చేది నీపిల్లకి మంచి గాని సెబ్బరి గాదు.

ఐరావతి :-అమ్మయ్యో! నావొక్కపిల్లా ఆమహారాజుగారి
వెంట దేశాంతరాలు వెళ్ళిపోతే నే బతగ్గలనా?
దానివూళ్ళూ, యీమేడలూ, ఆస్తులూ, యేం
గావాలి? మాకు రాజులూ వద్దు గీజులూ వద్దు. దేశ
మధ్యాన్న మావాళ్ళనలుగుర్లోనూ, ఇట్లా బతికితే
మా కదే పదివేలు. ఆసభలకి నాపిల్లనీ పంపను,
నేనూ వెళ్ళనుబాబూ! రాజసమ్మానం లేకపోతే
పీడా పాయిరి!

నారాయణ :-పోతునీడుగారియడియాసలే గాని శ్రీకృష్ణదేవ
రాయలవారు ఇష్టములేని స్త్రీని నిర్బంధపెట్టుప్రభువులు
గారు. పైగా నెంతవారలకైన నట్లు బలాత్కరించువారిని
శిక్షింతురు. అనవసరముగ జంకి మహారాజానుగ్రహ
మునుఁ జెడగొట్టుకొన గూడదు. సభల కేగుటవలన,
సర్వవిధముల శుభమే యగును గాని, చెడు
గెన్నడును కాదు.

ఐరావతి :- కేవలము నాయిష్ట మేమి చెల్లును? యుక్త వయస్సు వచ్చి బుద్ధి తెలిసినవిద్యావతి చింతామణి మాట సాగును గాని, నాపెత్తన మేమియు లేదు. అంతయు దానియిష్టమే.

[నదియావల మజల వాద్యములు వినఁబడును]

నారాయణశాస్త్రి :- రాత్రి రెండవయామ మైనది. ఇక విశ్ర మింతము.

[అందరు నిష్క్రమింతురు]

"అబోధ స్మృతి" యను

**ద్వితీయాంకము సమాప్తము.**

శ్రీ శ్రీ శ్రీ



1. అధ్యాపనకొరకు ఏర్పరచుకొనే స్థలము మనస్సును ఏవిధముగను చలింపజేయుట కవకాశములేని స్థలమైయుండవలెను. ఆకర్షకశక్తులను ప్రభవింపజేయు వస్తువులతో నిండియుండవలెను. ఇతరవస్తువులతోపాటు అచట పవిత్రమగు పంచరంగులు వర్తులముగా సమకూర్చబడియుండవలెను. దుష్టశక్తులేమియు గాలిలోలేకుండ స్థలము పరిశుద్ధముగానుండవలెను. (ఆస్థలమీపనికే ప్రత్యేకింపబడి మరియేపనికి ఉపయోగించకూడదు. పవిత్రమగు పంచరంగులు, అనగా, ఇంద్రధనస్సులో కనబడు ముఖ్యమగు అయిదు రంగులు, ఇవి గొప్ప ప్రభావముగలవి. దుష్టశక్తులనగా పోరాటములు, తగువులు, స్పర్ధలు మొదలగునవి. ఇవి వెంటనే భువర్లోకపు వెలుగులో, అనగా, ఆస్థలముయొక్క వాతావరణములో ముద్రితములయి గాలిలో వ్రేలాడుచుండును. ఈ మొదటి నియమమును సాధించుట సులభముగా గనబడునుగాని బాగుగ యోచించిచూచినచో కష్టతమమయినదని తెలియును).

2. శిష్యుడు గురువునొద్ద ముఖాముఖని విద్య నభ్యసించుట కనుమతి బడయుటకుముందు, బేసిసంఖ్యగల ఇతర క్రొత్తశిష్యులు కొందరితోకలిసి ఆరంభవిద్య కొంత నేర్చుకొనవలెను.

(ఇచట 'ముఖాముఖని' అనగా, ఇతరులతో నిమిత్తములేకుండా తాను ప్రత్యేకముగా తన అంతరాత్మ యెదుటగాని తనగురువుయెదుటగాని విద్యను స్వీకరించుట అని అర్థము. అప్పుడే ప్రతివాడును తన జ్ఞానమును వినియోగించిన రీతిని బట్టి తన అర్హతకొలది క్రొత్తజ్ఞానమును బొందగలడు. బోధచేయుట సమాప్తియగు కాలముననే ఇది సంభవించగలదు.)

3. (గురువువగు) నీవు లానూకు (శిష్యునకు) 'లామ్రిన్' లోని పవిత్ర వాక్యములను చెప్పుటగాని, 'దూజైద్' నకు సిద్ధముచేయ ననుజ్ఞ నిచ్చుటకుగాని ముందు వానికి పూర్ణముగా చిత్తసంశుద్ధిగలిగినదనియు, అందరితోను ముఖ్యముగా అతని యితరఆత్మలతో మైత్రిగలిగి ప్రశాంతముగనున్నాడనియు శ్రద్ధతో జూడవలసియున్నది. లేనిచో, జ్ఞానముగురించియు, సద్ధర్మముగురించియు నీవు పలికెడు మాటలు చెదరి గాలికి కొట్టుకొనిపోవును.

(లామ్రిన్ అనునది ట్సాన్ - ఖా - పా గారిచే రెండు భాగములుగా వ్రాయబడిన గ్రంథము. ఒకభాగము మతసంబంధమగు బాహ్య విషయముల నిమిత్తమున్ను, రెండవది రహస్య ఉపయోగము కొరకున్నూ వ్రాయబడినది. అది అభ్యాసార్థమైన

ప్రకటించినపండితకవిశతములలో నగ్రగణ్యు లెవ్వరో పరీక్షకులు నిర్ణయించిన నగ్రబహుమానమును సబిరుదముగాఁ బ్రభువు లొసంగుదురు.

అల్లసాని పెద్దన :-దేవభాషకవనమునఁ గళానిధిమిశ్రు లద్వితీయులు. పరీక్షకులుగా నున్నమాకన్న నెన్నిమడుంగులో సంస్కృతకవిత్వమున మిన్నలు. వారి కగ్రబహుమాన మిచ్చుటలో నభిప్రాయభేద ముండదని నానమ్మకము.

ముక్కుతిమ్మన :-యథార్థము.

రాయలు :-గడువు తక్కువగా నీకృష్ణాతీరవాసులకుమాత్ర మేర్పాటుచేసిన యీకొద్దిసభలలోనే కాక యీవద్భారతదేశపుఁ గవు లందఱికి సభజరిగినను గళానిధి మిశ్రులు మొదటిబహుమానము నంద నర్హులు. వారికిదివఱకే ప్రాప్తించి, రూఢమైయున్న,'కళానిధి' యనుసార్థకబిరుదమునకన్న ఘనమైనబిరుదము లభింపనిగారణమునఁ దత్ప్రదానమునకు మేము పూనుకొనమైతిమి. వారి కృష్ణవిషయికకవిత్వము పరమోత్తమము. అదిగాక, అసంఖ్యాకములైనకళ లన్నిటిలో నంతగాఢప్రజ్ఞ యుండుట యతిమానుషము. వారికిని వారిశిష్యసహస్రములకును సుఖజీవనార్థముగా వేయిపోటుకత్తులమాన్యమును వారు కోరుకొను గ్రామములలో నిప్పించుటకు మా మండలికాధికారి

కిప్పుడే యుత్తరవుల నిచ్చుచున్నారము. వారి యసదృశసంస్కృతకవిత్వకళకు నివాళిగా సింహతలాటములురత్నవలయములతోను, మకరకుండలద్వయముతోను, వారి నీసభలో నలంకరింపఁ జేయుచున్నారము.

[సభ్యులహర్షసూచక కరతాళధ్వనులు]

ఉద్యోగి : రెండవపరీక్షాంశ మాంధ్రకవిత్వము. పరీక్షకు లాంధ్రకవితాపితామహ, తిమ్మనార్యులు.

పెద్దన :-భాషాపాండిత్యము, పదలాలిత్యము, శబ్దగుంభనసారళ్యము, భావసంపద, రసస్ఫూర్తి, వ్యంగ్యమర్యాద మొద లగునుత్తమకవిత్వలక్షణములలోఁ గళానిధిమిశ్రుల తెలుఁగురచన యసమానమైనదే కాని మన దేశభాషాకవనపుఁ బుట్టుకనాటినుండియు ననుస్యూతముగా, వచ్చుచున్న యతిప్రాసనియమముల నుల్లంఘించుటచే వారిరచనకుఁ గవిత్వనామ మొసంగుటకు వీలు లేదు.

తిమ్మన :-నాయభిప్రాయము నదియే.

కళానిధి :-తమరు నారచనలలోఁ గల వని యుగ్గడించిన యుత్తమకవిత్వలక్షణము లన్నిటి నెగురగొట్టగల గౌరవము గలదా, శబ్దాలంకారమాత్రము లైన తెలుఁగు యతిప్రాసలకు ?

తిమ్మన :-శాస్త్రదృష్టితోఁ జూచిన లేదు గాని, తెలుఁగు కవిత్వప్రస్థలగునాదికవు లేర్పఱచిననీమముల నుల్లంఘించినది, కవిత్వము కాజాలదు.

కళానిధి :-కవిత్వమున కాలంకారిక నిర్వచన మేమి ?

పెద్దన :-మీరు మమ్ము శాస్త్రవాదములోనికిఁ దింపఁ జూచుచున్నారు. దేవభాషలోని శాస్త్రములన్నియుఁ దెలుఁగుభాషకుఁ బూర్తిగా నన్వయించుటకు వీలు లేదు. తెలుఁగుభాషకుఁ గొన్ని ప్రత్యేకలక్షణము లున్నవి. తెలుఁగునుడికారమర్యాదకును, అనగా జాతీయతకును, యతిప్రాసములకు నవినాభావసంబంధము కలదు. సామాన్యజనులు వాడుకొను సామెతలలోను, మనగేయవాఙ్మయమునఁ గూడ యతిప్రాసము లుండుటయే యిందులకు తిరుగులేని ఋజువు.

కళానిధి ;-అలంకారశాస్త్రమూలము లన్నిభాషలకు సమానమే. సామెత లన్ని దేశభాషలలో శబ్దాలంకారయుక్తములై యేదే నొకరకపు యతిప్రాసములతోడను, గమకముతోడను జ్ఞప్తిసులభములుగను, శ్రవణపేయములుగను నుండును. సామెతలే ప్రతిభాషలో, గవిత్వప్రథమాంకురములు. సామెతలాయాభాషలలోని సహజకవిత్వప్రథమరూపములు. అటుతర్వాత ప్రతిభాషయు పదకవిత్వసోపానము

నెక్కును. గేయము లెప్పుడునుఁ గంఠ పాఠప్రచారాధారములు గనుక జ్ఞాపకార్థమునుఁ బాటసొంపుకొఱకును, విశ్రమస్థానమునను, జంటలో రెండుపాదముల మొదటను శబ్దాలంకారసహితములుగ నుండును. మీ రెత్తినకోటి దేశికవితకు సంబంధించినది గాని మార్గ కవిత కన్వయింపదు.

పెద్దన :-మనమార్గకవితలోఁ గూడఁ బ్రారంభమునుండియు యతిప్రాసము లేల నిర్వికల్పముగ నవలంబింపఁబడినవి ?

కళానిధి :-ప్రాసమును ద్విపదరూపగేయమునుండి మనవా రెరువుఁదెచ్చికొని, చతుష్పాదసంస్కృతానుకార ఛందస్సులను గూడ దండఁగుచ్చుట కుపయోగించిరి. విశ్రమస్థానమునఁ దెలుఁగుపాటలలోనిసామ్యాక్షర యతుల ననుకరించిరి. ఆసాధనము లాంధ్రమున మార్గ కవితావతారబాల్యమున, నాక్రొత్తమాదిరికవిత్వమునుఁ దత్పూర్వపుటలవాటులతో మేళవించి, జాతి కలవాటు చేయుటకు మొదట నుపకరించినను గవిత్వాంగన ముగ్ధత్వము వదలినతరువాతఁ గూడ బాల్యాలంకారముల నూడ్చకుండుట యువతి బుట్టజడలను,రావిరేకను ధరించునట్లును, ప్రౌఢ పైట లేకుండ, మట్టలాగు దొడిగికొని తిరుగునట్లును, విరళ

1. అధ్యాపనకొరకు ఏర్పరచుకొనే స్థలము మనస్సును ఏవిధముగను చలింప జేయుట కవకాశములేని స్థలమైయుండవలెను. ఆకర్షకశక్తులను ప్రిభవింపజేయు వస్తువులతో నిండియుండవలెను. ఇతరవస్తువులతో పాటు అచట పవిత్రమగు పంచరంగులు వర్తులముగా సమకూర్చబడియుండవలెను. దుష్టశక్తులేమియు గాలిలోలేకుండ స్థలము పరిశుద్ధముగానుండవలెను. (ఆస్థలమీాపనికే ప్రత్యేకింపబడి మరియేపనికి ఉపయోగించకూడదు. పవిత్రమగు పంచరంగులు, అనగా, ఇంద్రధనస్సులో కనబడు ముఖ్యమగు అయిదు రంగులు, ఇవి గొప్ప ప్రభావముగలవి. దుష్టశక్తులనగా పోరాటములు, తగువులు, స్పర్ధలు మొదలగునవి. ఇవి వెంటనే భువర్లోకపు వెలుగులో, అనగా, ఆస్థలముయొక్క వాతావరణములో ముద్రితములయి గాలిలో వ్రేలాడుచుండును. ఈ మొదటి నియమమును సాధించుట సులభముగా గనబడునుగాని బాగుగ యోచించిచూచినచో కష్టతమమయినదని తెలియును).

2. శిష్యుడు గురువునొద్ద ముఖాముఖని విద్య నభ్యసించుట కనుమతి బడయుటకుముందు, బేసిసంఖ్యగల ఇతర క్రొత్తశిష్యులు కొందరితో కలిసి ఆరంభవిద్య కొంత నేర్చుకొనవలెను.

(ఇచట 'ముఖాముఖని' అనగా, ఇతరులతో నిమిత్తములేకుండా తాను ప్రత్యేకముగా తన అంతరాత్మ యెదుటగాని తనగురువుయెదుటగాని విద్యను స్వీకరించుట అని అర్థము. అప్పుడే ప్రతివాడును తన జ్ఞానమును వినియోగించిన రీతిని బట్టి తన అర్హతకొలది క్రొత్తజ్ఞానమును బొందగలడు. బోధచేయుట సమాప్తియగు కాలముననే ఇది సంభవించగలదు.)

3. (గురువువగు) నీవు లానూకు (శిష్యునకు) 'లామ్రిం' లోని పవిత్ర వాక్యములను చెప్పుటగాని, 'దూజెడ్' నకు సిద్ధముచేయ ననుజ్ఞ నిచ్చుటకుగాని ముందు వానికి పూర్ణముగా చిత్తసంశుద్ధిగలిగినదనియు, అందరితోను ముఖ్యముగా అతని యితరఆత్మలతో మైత్రిగలిగి ప్రశాంతముగనున్నాడనియు శ్రద్ధతో జూడవలసియున్నది. లేనిచో, జ్ఞానముగురించియు, సద్ధర్మముగురించియు నీవు పలికెడు మాటలు చెదరి గాలికి కొట్టుకొనిపోవును.

(లామ్రిం అనునది ట్సాన్-ఖా-పా గారిచే రెండు భాగములుగా వ్రాయబడిన గ్రంథము. ఒకభాగము మతసంబంధమగు బాహ్య విషయముల నిమిత్తమున్ను, రెండవది రహస్య ఉపయోగము కొరకున్నూ వ్రాయబడినది. అది అభ్యాసార్థమైన

విసర్జన మేరికి నపచారము కాదు. కవితాకుటుంబినికి శాపవిమోచన మొనర్చుట యనుమహాపుణ్యకార్యము.

తిమ్మన :-ఆదినుండి యిప్పటివరకు మహాకవు లేలనాసీమముల నావంత యైన నతిక్రమింపక పాటించిరి ?

కళానిధి :-'గతానుగతికో లోకః' అన్న ట్లొకరివెనుక నొకరు గొఱ్ఱెలవలె నడచినవారే గాని స్వతంత్రబుద్ధితో నాలోచించినవారు గాని, ధైర్యము చేసి యుల్లంఘించి తమకవితాశక్తిచే సలక్ష్యముగా సమర్థించినవారు గాని లేకపోవుటచేతను, మీబోటిపెద్ద లట్టిరచనలను బైకెక్కనీయక యణగద్రొక్కుటచేతను.

తిమ్మన :-తెనుఁగులక్షణశాస్త్రములో నానాటికిఁ బెరిగిన యతిప్రకరణబాహుళ్య మంతయు నిరుపయోగమై ఖిలము గానలసినదేనా !

కళానిధి :-యతులఁ గూర్చినప్రకరణమునుగూడ శాస్త్రమనుటకంటె హాస్యాస్పద ముండదు. మొదట నియమించినదారుణశాసనములఁ బాటింప లేక క్రమక్రమముగాఁ గవులపరంపర యొనర్చిననియమభంగములను భిన్నభిన్నయతులుగా నంగీకరించి కూర్చినయతిప్రకరణమునకుఁ గూడ శాస్త్రత్వసిద్ధియా? అట్టిశాస్త్రములు నశించినను లోపము లేదు.

రాయలు :-బహుభాషాకోవిదు లగుకళానిధిమిత్రులు చేసిన హేతువాదమును, దెలిపినయతిప్రాసములపట్టుపూర్వోత్తరములును మాకు నచ్చినవి. శాస్త్రమే లేనప్పుడు శాస్త్రవాద ముండదు. మాకు యతిప్రాసముల యనావశ్యకతయు, ప్రతిబంధకత్వమును యథార్థములనినమ్మకము కలిగినది. కాని

పండితమండలియొక్క యేకగ్రీవామోదముఁ బడసిన గాని మేము క్రొత్తదానిని స్వతంత్రించి యంగీకరింపఁ జాలము. రాజు నధికారమున్న ధర్మమునుఁ బాలించుట గాని క్రొత్తధర్మమును దెచ్చి పెట్టుట గాదు. అది ఋషులపని. ఈవిషయమునఁ బండితకవులే ఋషులు కళానిధిమిత్రు లొక్కరే యీనూతన ధర్మప్రవక్తలును, గాని తక్కినలోక మందఱు, వారికి వ్యతిరేకులు కాబట్టి మాస్వంతవిశ్వాస మెట్లున్నను, మే మిందు తీర్మానించు నవకాశము లేదు.

ఈసభలోఁ దెలుఁగుకవిత్వ బహుమానమును సర్వోత్కృష్ట మైనయాంధ్రకవిత్వమునుఁ జెప్పిన కళానిధిగారికిఁ గాక మఱియొకరి కివ్వజాలము. వారి కిచ్చుటకుఁ బండితమండలి వ్యతిరేకులగుటచే మేముః స్వతంత్రించి యిచ్చి ధర్మపాలనాభంగ మొనర్పము. కనుక నీ సభలోఁ దెనుఁగు కవనమునకుఁ బారితోషికము నిచ్చుట ... ...... ...

తిమ్మరుసు :-(లేచి) ఒక్కింతసేపు నిలుపుజేయసెలవు వేడుచున్నాను. నా కింకనుఁ గళానిధిగారి కవితావినోదముతోఁ దనివితీఱ లేదు. వారి కొకప్రశ్నము నీయ గోరుచున్నాను.

రాయలు :-మహామంత్రులవారికుతూహలమున కాటంక ముండునా ?

తిమ్మరుసు :-యతిప్రాసములతోఁ దెలుఁగుకవులు పడుపాట్ల నభివర్ణింపుచు, యతి ప్రాససహిత మైన మాలిక నొకదాని రచియింప శ్రీ కళానిధి మిత్రులఁ గోరుచున్నాను.

కళానిధి :-చ॥ వడులునుఁ బ్రాసము ల్గదిగ వావిరిఁ దప్పగనీకఁ గూర్చునా
మిడుకుడులో మదిం ద్రోలుత మేకొనినట్టి తలంపు రూపఱన్
సుడివడుటో, బరాబరిగఁ జొప్పడ కెక్కువతక్కువై యడావుడి తగులాటమై పడిగ బోయెడువానికిఁ గచ్చ యూడి ముం
దడుగున కడ్డపడ్డగతి నల్లరిమేళము సాగుటో యగున్.

తిమ్మరుసు :-అట్టికవికినిఁ గవితకు నెట్టి సంబంధము ?

కళానిధి :-పడతి మిటారిఁ జేరి యొకవాజబొజుం గడి మోముఁ ద్రిప్పి యా
గడ మొనరింపకుంట కని, గ్రక్కున వీనులు మెల్చి పట్టి, లేఁ

దొడ లణగార దానియొడిఁ ద్రుళ్ళున గూలబడన్,
"లబోదిబో

విడు విడు చాలుఁజాలు కడువేడుకకాదవు లె
మ్మ"టంచు వా

దడబడ నింతి కూయిడ, నతం డదె యజ్జని చేలు లాగి ము
ద్దిడ గడగం, బడింబడిగ నేడ్పులు, తిట్టులు,
చెంపపెట్టులున్

వడిఁ బడదన్నుటల్, బలిమిఁ బైటికి నెట్టుటలున్
జెలంగఁ జే

డ్పడుఁజదుకుం బడలుఁ బాడువడుల్ బలుగాకె ప్రాసముల్
సడలగ నీక మేకులపసందున నచ్చు తెలుంగుకై తలన్
బాడుగునఁ బాతి పద్దెముల ముళ్ళిక ముచ్చిరు
బాసకూర్పు కాడు.

తిమ్మన్న :—యతిప్రాససహిత మగు గీర్వాణవాణి యెట్లుం
డును ?

కళానిధి :—అడకువ మాలి యట్టి డమృతాశనవాణి రచించె
నేని ప్రా

వృడృతుసమాగమప్రబలవిస్తృత పుష్కల
నామ మేఘరా

డుడుపథగామియుద్ధశకటోపరిసంస్థితక్రుద్ధగోత్ర భి
ద్విడచలశృంగపక్షతటపృష్ఠవిఖండనదక్షసంచల
త్తడిదశనిప్రఘాతపరిదారితగండశిలాప్రపాతత
ఝడితి విలుంఠనాక్రమమిథఃప్రతి ఘాత విఘూర్ణనోద్గను

దృఢబడఢాండ మేన్నినదభైరవఘోషసదృక్షసాహితీ
రడననిపీడితశ్రవణరంధ్రము, దీర్ఘసమాసబద్ధసం
జడ విషమార్థహీనపదజాలము, దుర్గమభావసంకట
తృటితసమన్వయంబుఁ బహుదోషమయంబుఁ

దదుక్తికం బగున్.

తిమ్మరుసు :-షెబాష్ ! ఇఁక జాలును ! (పెద్దనగారి వంక తిరిగి) పరీక్షాధికారుల కీకవిత్వ మంగీకార్య మగునా ?

పెద్దన :-(దృష్టి మఱల్చి నెమ్మదిగా) ఇట్టికవితకు మాయాక్షేప ముండదు.

తిమ్మరుసు :- అటులైనఁ దీనినిఁ బురస్కరించుకొని కళానిధుల కాంధ్రకవిత్వ బహుమాన మిచ్చుటకు మీరను మతించెదరా ?

పెద్దన :-ప్రభువుల కట్టిదభిప్రాయ మున్నచో మాయాటంకము లేదు.

తిమ్మరుసు :-రెండపరీక్షాధికారులమభిమత మేమి ?

తిమ్మన :-నాసమ్మతి పెద్దనార్యుల ననుసరించును.

రాయలు :-అసాధారణసమయస్ఫూర్తితో యుక్తవన్ని కళానిధిమిత్రులచే యతిప్రాససహిత మైనకవిత్వ

మునుఁ జెప్పించి, యన్యాయమును దప్పించి, మా కోరిక నెఱవేర్చినమహామంత్రులకు మే మెంతయుఁ గృతజ్ఞులము.

తిమ్మరుసు :-మహాప్రభూ ! తమ వచస్సరణి నాలకింపఁ దెలుఁగు కవిత్వమున కసలే బహుమానము నీయకుండ నిలుపుచేయఁ బోవుచున్నట్లుతోఁచి నే నడ్డుపడితిని. దేవరనే తెలుఁగునఁ గృతిరచింప నాదేశించిన యాంధ్రనాయకుని సన్నిధి నాంధ్రకవితకు బహుమతి నీయకుండు టాదేవుని కపచార మగుననుభయమున న ట్లొనర్చితిని.

రాయలు :-(ఉద్వేగముతో) అప్పాజీ ! తమయనుగ్రహమున మాకీదినమున నెట్టి ఘోరప్రమాదము తప్పినది ! "నిలుపుచేసితి" మనునపచార వాక్యము మానోట నుండి వెడలకుండ నాపినమీయప్రమత్త రక్షణదీక్షకు మావినయపూర్వకనమస్సహస్రములు.

తిమ్మరుసు :-మహారాజా ! సహస్రాయువులై, ధర్మరక్షకులై దిగ్విజేతలై కీర్తికాములై వర్ధిల్లుడు.

పెద్దన :-తథాస్తు ! మహామంత్రులచెయ్దు మెద్దియు నేక ప్రయోజనకారి మాత్రము గాక సహస్రముఖములఁ బివిధలక్ష్యసిద్ధి నొనర్చుకొనును.

బండారుల ॥పెద్దనామాత్యుల మద్దెలదరువులకవిత్వమునకుఁ బ్రతిగర్జనము పుట్టినదని వారికిఁ గొంచెము కించ కలిగి నట్లున్నది.

కళానిధి :-మహారాజామాత్యశేఖరులయవ్యాజకరుణచే నా కాంధ్రకవిత్వబహుమానము లభించినను, నా స్వేచ్ఛ చేఁ గాక మంత్రివరులవినోదముకొఱకు నే నాశువున నుడివినయసమ్మతకవిత్వమునూలమున నాకుఁ గలుగబోవు గౌరవము నాకామోదావహము కాజాలదు. ఇఁకముందెందుకొఱకై నను, యతిప్రాస సహితమైనకవిత్వమునుఁ జెప్పననిశపథముఁ జేయు చున్నాడను.

రాయలు :-కళానిధిగారినిర్యతిప్రాసకవిత్వమునకు వారికి 'ఆంధ్రకవితాశాపవిమోచక' బిరుదము నొసంగుచు వారి యుభయమార్గములకవిత్వమునకుఁ బారితోషి కముగా, శతసహస్రసువర్ణనాణకముల సతాంబూల ముగ నిచ్చుచున్నారము. అదిగాక, మే మాంధ్ర దేవులకు, రాగభోగకైంకర్యముల నిమిత్తము శాసన పూర్వకముగా సమర్పించినగ్రామములఁ బరిపాలించి, సమస్తకళామార్గముల నాదేవునికి సేవలు జరిపిం చుట కాగమకళాసంప్రదాయమర్మజ్ఞశేఖరు లగుఁ గళానిధిమిత్రులను ధర్మాధికారపీఠమునఁ బ్రతిష్ఠిం చుచున్నారము.

(సభ్యుల హర్షధ్వనులు)

సభానిర్వాహకుడు :-ఇక మూడవపరీక్షాంశము లాస్యవిద్య. ఆవిద్యఁ బ్రదర్శించినబహునటీరత్నములలో నగ్రగణ్య యెవ్వతెయో పరీక్షకులు నిర్ణయించిన నగ్రబహుమానమును సబిరుదముగాఁ బ్రభువు లొసంగుదురు. శ్రీలక్ష్మీనారాయణామాత్యులు తమ యభిప్రాయమును మొదట సెలవీయ నర్హులు.

లక్ష్మీనారాయణ :-గాజులలంకనుండి వచ్చినపువ్వులచింతామణియు, ఏలూరునుండి వచ్చినదేశప్రసిద్ధ మైన నల్లబోగము వంశపుఁగళావతి, చదలువాడమధురనందినియు నగ్రగణ్యలు. వారిద్దరిలో మధురనందిని యాటపాట లెక్కువశాస్త్రానుగుణము లని నాయభిప్రాయము.

ఉద్యోగి :-కళానిధిమహాశయా ! తమయభిప్రాయ మేమి ?

కళానిధి :-లక్ష్మీనారాయణ పంతులుగారి తీర్మానములోని 'యెక్కువశాస్త్రానుగుణము ల'న్నమాట నా కవగాహనము కాలేదు. చింతామణి యాటపాటలలో లాలిత్యము నెక్కువ సున్నితములును, లాఘవాధికములు నగు లాస్యగానముల మెళుకువలు, తద్విరుద్ధము లైన వాటివలె నతివిరళస్ఫుటములుగా నుండవు. పైగాఁ జింతామణి హిందూస్థానీ బాణీలో నెక్కువపనిఁగను పఱచి, కర్ణాటకము తగ్గించినది. అందువలనఁ గూఢ

లక్ష్మీనారాయణగారి కట్టు తోఁచి యుండవచ్చును. కేవలము కర్ణాటకమునే ప్రదర్శించిన మధురనందిని విద్యతోఁ జింతామణి ప్రకటించిన కర్ణాటకలేశ మెంచునను దీసిపోదు. మధురనందినివిద్య గురువులకుఁ బారమప్పగించుకొనువాదమే కాని భావవ్యంజకమైనస్వాతంత్ర్యసంచారము కలది కాదు. చింతామణికి సాహిత్యసంపదయు, రసలాలసత్వమును మెండగుటచే నామె కల్పనాచాతుర్యమును, స్వరగత్యాదుల వైచిత్రిలాలిత్యములును మిరుమిట్లుగొల్పును. సర్వ విధములఁ జింతామణి మధురనందినికంటె వేయిరెట్లు మిన్న.

ఉ. కోయిలకన్నెనో ర్కుగుల నీని కలస్వనధార, మధుకరీ
గీతము కేవలశ్రుతివికారముగాఁ గడకొత్తుమూర్ఛనౌ
దార్యము,వల్లకీక్వణనమాంద్యము జీవము లేమిగా సురా
ళించు తనుస్వరస్యదముఁ గల్గినగానము హీనమయ్యెనే ?

ఎ. చక చక నింగిరంగమునఁ జిత్రగతుల్ మెఱయున్ ఘనాఘన
ప్రముఖముఖంబు లుల్లసిల, స్నిగ్ధగభీరధళంధళా ర్భటుల్
మొఱయఁ దళుక్కు దళుక్కున భ్రమించుతటి న్నటి కంగహారపున్
గుటిలతఁ దీర్చుమోహానపుఁగుల్కులు బెళ్కు చుల్కనైనవే !

ఉ. కింకిణి నిక్వణంబుల కశేషమృదుస్వరజాతినై ఖరుల్
జానుగఁ బల్క నేర్చినపదక్రమచాతురి, హ స్తకల్పనా
పాండితి, సాత్వికాభినయభావరసౌచితిఁ బెంపు మీఱుచిం
తామణిలాస్య మామధురనందిని యాటకు మేటి
కాదొకో?

ఉద్యోగి :-ఇక మహాప్రభువుల తీర్మానముపై నాధారపడి యున్నది.

కృష్ణదేవరాయలు :-మేము కళానిధిమిత్రులతో నేకీభవించితిమి. వారు చెప్పనివిశేష మొక్కటి యున్నది. చింతామణి నవవయోరూపలావణ్యసహజముగ్ధత్వములు గూడ నామెకళలకు వన్నెదెట్టుచున్నవి. 'పద్మావతీ చరణచారణచక్రవర్తి' యనియున్నశ్లోక మామె పాడి యభినయించినపుడు ప్రకటించిన తన్మయత్వ, లాలిత్యముగ్ధత్వసకరుణశృంగార భక్త్యావేశములకు మెచ్చి యీమెకు 'అభినవపద్మావతి' యని బిరుదము నిచ్చుచు, నాబిరుదమును జెక్కినసరత్నకనకహంసక కంకణయుగ్మములును, గలకింకిణీసహితనవరత్న స్థగితకాంచనకాంచికయు, ముప్పేటముత్యాలహారమును, సకంచుకములుగాఁ బైడిసరిగపనినిండుగల చీనాంబరద్వయమునుఁ, బసుపుకుంకుమతాంబూలములతో బహుమాన మిచ్చుచున్నాము.

[సభాసదుల హర్షసూచక కరతాళధ్వనులు]

ఉద్యోగి :-మధురవాణికి రెండవబహుమానమును, చింతా మణిగురువు లగు వెంకటనారాయణశాస్త్రిగారికిఁ బారితోషికమును గూడఁ బ్రభువు లేర్పాటు చేయించినారు.

[వైతాళిక వాక్యము]

ఉదయాదిన్ నికటప్రపంచమున కుద్బోధంబు గల్గించి, విశిష్టుల హృష్టాత్ములఁ జేసి, విష్ణుపదమాలంబించి, సర్వాశలన్ వసుపూర్తిన్ దనియించి, దిగ్విజయయాత్రల్ సాగి, వేడ్కన్ గళా నిధి కౌజ్జ్వల్యము గూర్చి, యేగెడునినుం డివ్వేళ వేర్వాంకకున్.

ఉద్యోగి :-సూర్యాస్తమయ మగుచున్నది. సభఁ జాలించి ప్రభువు లంతిపురమున కేగుదురు.

[బ్రాహ్మణులు స్వస్తివాచకములఁ జదువుదురు. రాజులవారు లేచి సభకు నమస్కరింతురు. బ్రాహ్మణు లాశీర్వదింతురు. అందరు నిష్క్రమించుచుండగా.]

కళానిధి :-(వేదండభట్టు నుద్దేశించి) బావా! సంధ్యావందనమునకు నది కేగుదము రమ్ము.

వేదండ :-నీ కట్టిమంచిబుద్ధి పుట్టిన నేను కాదందునా? అటులే కానిమ్ము.

[ఉభయులు పరిక్రమింతురు]

రంగము :-కృష్ణానదీతీరము. రేవునకుఁ గొంచెముదూరముగా

ప్రవేశము :-తెల్లనియిసుకతిన్నెపైఁ గళానిధి వేదండభట్టు లుపవిష్టులై.

వేదండ :-బావా ! ఈరోజున రాజసభలో నద్వితీయమైన గౌరవము నందియుఁ, గోరికకు మించినభూధనములఁ గడించియు, నప్పుడే యజీర్ణవ్యాధితో బాధపడు వానివలె మొగము చిట్లించుచు నట్లుంటివేల ?

కళానిధి :-నా కొకక్రొత్తబాధ యంకురించినది, బావా ! పాప మాచింతామణి యేదోతీరరానివేదనఁ బడు చున్నదనియు, నారోగులు నావలనఁ గాని తీర దనియు, నా కామెయందు గుండెలు కరిగిపోవుజాలి యుదయించి, నన్ననునిమిషమునుఁ గలంచివైచు చున్నది. ఆమెనుఁ జూడకుండ, నామె ననునయించి, యామెయార్తి నాశక్తికొలఁది మార్చకుండ నాపు కొనుట, నానిగ్రహశక్తికి మితిమీరుచున్నది.

వేదండ :-ఓహో ! అదియా నీబాధ ! అటువంటిబాధ నాటినవారలకు నిగ్రహశక్తి నిలుచునా ? పూర్వము విశ్వామిత్రపరాశరాదులకచ్చడముల భేదించిన దిట్టి బాధయే ! దీని కింత ద్రావిడప్రాణాయామ మెందు లకు ? 'చింతామణిని వలచితి న'ని సూటిగా జెప్ప రాదా ? ఇది యొకకవిత్వముకాఁబోలు ! పైగా

చింతామణి కేదోతీరరానివెంజిలి యున్నదని కల్పన యెందులకు ? ఆమె కేమైననాధివ్యాధు లున్నచో నంతసే పంతకట్టుగా నృత్యాభినయనముల సాగించి లోకమందఱిమెప్పింపఁ గలదా ?

కళానిధి :-నే ననుకొనినట్లే విపరీతముగా గ్రహించితివే కాని నాహృదయము నెరుంగలే వైతివి ! నేను నీతో మర్మముగా మాట్లాడుట లేదు. నాయాత్మబాధ నంతరంగమిత్రుఁడ వగునీతోఁ జెప్పినఁ గొంత యుప శమనము గలుగు నని, గంపెడాసతో దాపరికము లేకుండఁ జెప్పితిని. ఒకరిహృదయము, మరియొక రెఱుంగు టెంతదుర్లభము ! చింతామణి గొప్ప యావేదనము నొందుచున్న దనుట నిశ్చయము. అది ప్రారంభించి విశేషకాలము కాకుండుటచే నామె దాని కింకనుఁ గ్రుంగిపోలేదు. గాని, బాధమాత్ర మతితీవ్ర మైన దనుట స్పష్టము.

వేదండ :-ఇతరులహృదయ మెఱుగుట యసాధ్య మైన, మా కెవరికిని గోచరింపనిచింతామణియార్తి నీకు మాత్రము చెప్పకుండ నెట్లు తెలిసినది ? ఆమెయాట పాటలవలనఁ జూపఱకందఱకు హర్షము కలుగ నీ కొక్కనికేమాత్రము, జాలియు, బాధయు, నెట్లు కలిగినవో నా కగమ్యముగా నున్నది !

కళానిధి :-అది పూర్వజన్మసంబంధమహిమము. ఆసత్యమునే మహాకవికాళిదా సిట్లు నిర్ధారించి యున్నాడు.

తే. గీ. రమ్యవస్తువుఁ జూచిన, మధురరవళి
వినిన, సుఖజీవి కళవళ మొందు నేని,
భావమునఁ బాదుకొన్నతొల్బాము చెలుము
తెలుక కెక్కక లోస్మృతిఁ గదలుటఁ జుమి !

వేదండ :-చింతామణికి బాధ యని నీ వనుకొనినది యామె యభినయచాతుర్యము గానోపు. లేనిభావముల నటించుట వేశ్యలకు నైజము.

కళానిధి :- అభినయమునకు సమయసందర్భోచితి యుండవలెను. బాధను, దయాప్రార్థనమును గ్రంథమునుబట్టి నటించవలసినయవసరము లేనిచోట నాభావములఁ బ్రకటించుట యభినయ మెట్లగును ?

వేదండ :-అ ట్లెప్పుడు జరిపినది ?

కళానిధి :-శ్రీరాయలవా రుద్ఘాటించిన గీతగోవిందశ్లోకమునఁ దేటతెల్లముగ వ్యక్తము చేసినది. 'పద్మావతీ' నామమును దన పరముగా నతిదీనముగా నభినయించి, 'జయదేవ' పదమును స్పష్టముగా నన్నుద్దేశించి ప్రార్థనాసహితముగ నుచ్చరించి, 'వాసుదేవ' శబ్దమును శ్రీ కృష్ణరాయల కన్వయించి, సభక్తికముగా నటించినది.

వేదండ :-(సాశ్చర్యముగ) ప్రభువు కూడ నీసంగతి నంతను గ్రహించిరో యామెకు 'అభినవ పద్మావతీ' బిరుదము నిచ్చెనా యేమి ?

కళానిధి :-ఎంతవఱకు గ్రహించెనో ఆమహారాజునకే ఎఱుక ! కాని రాయలవంటి రసికాగ్రేసరచక్రవర్తు లరుదుగా జన్మింతురు. ఆయన చింతామణి కిచ్చినబిరుదమే యందులకుఁ దార్కాణము. నా రామె నాదరించి సమ్మానించినవిధము వారిలోకాతీతజ్ఞానమును వెల్లడి చేయుచున్నది.

వేదండ :-చింతామణియును, నీవునుఁ బూర్వజన్మమునఁ బరిచితులై మఱల నిప్పుడు పరస్పరాకర్షితు లగుచున్నారా ?

కళానిధి :-నా కట్లు తోచుచున్నది కాని, మాయాకర్షణము భౌతికము గాదు.

వేదండ :-భౌతికము గాకున్న నాధ్యాత్మికము కాబోలు ! ఆధ్యాత్మికాకర్షణము గురుశిష్యులమధ్యమున గాక, యావనులునుఁ గ్రొత్తవారు నగు స్త్రీపురుషులమధ్యమునఁ గూడ నేర్పడు ననుట నీవలనఁ గ్రొత్తగా నేర్చికొనుచున్నాము.

ళానిధి :-అది గాదు బావా ! చింతామణికిఁ గృష్ణభక్తి ఘనక్కుట మని యామెగీతగోవిందగానాశక్తిచే

వ౦న నెఱిగి, యట్టియు త్తమనటితో స్నేహమువలన నాభక్తి యోగము శీఘ్రసిద్ధినొందు నని యుత్సాహమును, నామెసాంగత్యముకొఱకు కౌతుస్క్యమును జనించినవి.

వేదండ :- మీయుభయులసహవాసము మీయోగాభ్యాసములతో నాగు నందువా?

కళానిధి :-సహజనిగ్రహము గలయాకన్నియ నిర్మలహృదయము నాయందుఁ బ్రేమబద్ధ మగుట గూడ మాయిరువురిసంసారతరణమున కుత్తమోపకరణ మగును.

వేదండ :-వహవ్వా! ఇంతగొప్పసాధన మేశాస్త్రప్రమాణము ననుసరించినది. బావా!

కళానిధి :-తంత్రాగమశాస్త్ర సమ్మతము. ఆతంత్రయోగము పునాదిగా గలదే.

## రాధాకృష్ణ వైష్ణవమతము

వేదండ :-మీయాధ్యాత్మికాకర్షణమున మీయుభయుల రూపలావణ్యాదు లాలంబనములుగాఁ గలశృంగార రసము మిశ్రితము కా దందువా?

కళానిధి :-శృంగారామోదము లే దనను గాని, యది యైనను కళాసౌందర్యప్రీతిమూలకము గాని, కర్మేంద్రి యప్రేరణజన్యము కాదు.

వేదండ :-కళానందార్థము వేశ్యాసాంగత్య మొనర్చుట శ్రోత్రియునకు జెల్లునా ?

కళానిధి :-ఎంతటి శ్రోత్రియున కైనఁ గళాతృష్ణ నైసర్గిక మనియుఁ, దత్తృష్ణాతర్పణ మైనఁగాని జీవితానుభవము తుదముట్ట దనియు నంగీకరించిరే క్రతుకర్తల కందఱకు స్వర్గసుఖములును రంభాద్యప్సరస్సంపర్కమును యజ్ఞసన్నిహితఫలములుగాఁ జేర్కొనఁబడినవి. యజ్ఞాదిపుణ్యకార్యములు పారలౌకికకళలు. వాటికి ఫలిత మైనయానందము స్వర్గాది పరలోకములలోఁ గలుగును.

వేదండ :-నిష్కామయజ్ఞకర్మ లేదందువా ?

కళానిధి :-కామ్యకర్మ మొదటిమెట్టు. నిష్కామకర్మ దానిపైది. మొదటిదానియనుభవ మీజన్మముననో వెనుకటిపుట్టువులలోనో నెఱవేరినఁ గాని రెండవదాని కధికారము కలుగదు. అనిత్యానందములఁ గోరక ఐహికకళల నైననుఁ బారలౌకికకళల నైనను, నాధ్యాత్మికకళలకు సాధనములుగా నుపకరించుకొనుకౌశలమే

## కర్మయోగము

వేదండ :- నీనిర్వచనమువలనఁ గళలు గానికర్మలు కర్మయోగి కాచరణీయము లేకా వనియుఁ గళాచతు

రుఁడు కానివానికిఁ గర్మయోగి యగుట కధికారమే లేదనియు విపరీతసిద్ధాంతము బయలుదేరుచున్నది.

కళానిధి :-ఆవైపరీత్యము నీజ్ఞానమున నున్నది గాని నానిర్వచనమున లేదు. చెప్పెదను వినుము. **ఈ సృష్టి కళాకర్మ** అది భగవంతునిలీలచేఁ బుట్టినది. అట్టిసృష్టిలోఁ జేతనాచేతనోద్భవముగాఁ గనుపట్టుఁగర్మ మంతయుఁ బర్యవసానమునఁ గళగాఁ బరిణమించును. మన యసమగ్రజ్ఞానమునుఁబట్టి సత్కర్మలనియు నసత్కర్మలనియు మన మనుకొనువాటిలోఁ గర్మయోగి సాధకావస్థయం దసత్కర్మలఁ ద్యజించి, సత్కర్మలనే చేయుట గాని, స్వభావాది ధర్మభేదములంబట్టి సాధనకునుఁ జేయక తప్పని సత్కర్మభిన్నముల నన్నిటి నుపాసనాంగయోగ్యములుగా మార్చుకొనుట గాని మొదటికౌశలము.

వేదశాస్త్రవిహిత మైనసత్కర్మ స్వతస్సిద్ధముగనే కళామయము. సత్కర్మకు ఫలము సుకృతము. అసత్కర్మకు దుష్కృతము. సత్కర్మగా శాస్త్ర మంగీకరింపని దానిలోనిమాలిన్యమును నేర్పుచేఁ దొలగించి దానికిఁ గళారూపమును దిద్దినచో నదియు నుపాసనోపకరణముగాఁ బనికివచ్చును. అటుతర్వాత నట్టిరెండు విధముల కళారూపకర్మల నిష్కామముగా నొనర్చి యాత్మోన్నతికుపయోగింపఁజేసికొనుట రెండవకౌశలము

అందువలననే "యోగః కర్మసు కౌశలం" అని చెప్పఁబడినది. కర్మయోగికన్నఁ గళాచతురుఁడు లేడు. కర్త యొక్క కౌశలముచేఁ బ్రతికర్మయుఁ గళ యగును. సుకృతదుష్కృతశబ్దములవ్యుత్పత్తికీ సత్యమే మూలము. కౌశల మనగా 'నేర్పు' 'చాతుర్యము,' 'ప్రావీణ్యము'. **"ప్రావీణ్యమే కళకుఁ బ్రాణము."**

వేదండ :-ఇహలోకసత్కర్మకు ఫలితముగా స్వర్గమున దేహాంతరముతోఁ బాటు రంభాసంభోగాదులు యాదృచ్ఛికముగాఁ గలుగుటకును, భూలోకమునఁ బురుషుడు స్వేచ్ఛచే వేశ్యాలోలు డగుటకును భేదము లేదా?

కళానిధి :-నే నిదివఱకుఁ జెప్పినట్లే యథమేంద్రియప్రీత్యర్థము గాక యుత్తమకళానందముకొఱకై నకళావతీ సహవాసము స్వర్గానుభవమునకుఁ దీసిపోదు గాని యది రసోపాసకులైనయుత్తమాధికారులమధ్యమునఁ గాక సామాన్యులపట్లఁ జెల్లదు. కలగలుపు లేని శుద్ధసుఖానుభవము ద్వంద్వోపహతమైనభూలోకమున సాగదు గనుక, నట్టిలోకాతిశయకళానందానుభవమున కర్హులు పుట్టు టీలోకమున నరు దగుటను, లోకాంతరమును దేహాంతరమునుఁ గల్పింపఁబడనది.

వేదండ :-ఇది నీస్వంతసిద్ధాంతమా? లేక యేశాస్త్రములోనైన నున్నదా? అథవా యేపెద్దలవలననైన నిట్టి నిర్ధారణమును వింటివా?

కళానిధి :-ఈనిర్ధారణము ఆనందవల్ల్యుపనిషదనుశ్రుతమును, సర్వేతిహాసపురాణాదిసమన్వయసారమును. ఈసిద్ధాంతరహస్యమును నాగురువర్యు లగుశ్రీసోమగిరిస్వాములు నా కుపదేశించిరి. కళోపాసకునకు నుత్తమకళానంద మీయఁ గలకళావతితో సంయోగము పతనహేతువు గాక యుచ్చస్థితి కెత్తు నని కూడ వారు సెలవిచ్చిరి.

వేదండ :-ఓహో! అట్లైన క్రిందటిశయనైకాదశినాఁడు నీవు చింతామణినిఁ జూచినప్పటినుండియు నిట్టిచింత నీ హృదయమున రగులు చున్నదన్నమాట ! ఏస్వాము లెట్లుచెప్పినను గులమువారును గుటుంబపెద్దలు నేక గ్రీవముగ గర్హింతురు గాని యామోదింపరు. నీనవీన తర్కసిద్ధాంతములు వారిమనస్సుల కెక్కవు.

కళానిధి :-మొదటినుండియు మాయిద్దరిసమావేశము దైవప్రేరితముగా నవార్యముగా, నద్భుతముగా, దగ్గర దగ్గరకుఁ జేరుకొని వచ్చుచున్నది.

వేదండ :-అట్లైన నీచివరభాగమున ముడిపెట్టుటకు నన్ను రాయబారము పంపనెంచి నాతో నీసంగతులఁ జెప్పితివా ?

కళానిధి :-అంతనిగ్రహము లేనిచపలుఁడను గాను. నే నిదివఱ కెన్నడును బర, స్త్రీనిఁ గాంచి [illegible]

చింతామణియందు నాకు స్వాభావికముగా నంకురిం చినకోర్కె పాపరహితమును, నిర్మలకళామూలక మును, నిశ్శ్రేయసపదప్రాపకమును, దైవనిర్మితము నైనచో, నిదివఱకు జరిగినసంభవములవలెనే కడ మయు నాయత్నము లేకుండనే పూర్ణీభవించు నని నాకు దృఢవిశ్వాసము కలదు.

[ఉద్రేకముచేఁ గళానిధియు, విస్మయముచే వేదండభట్టు నొక్కనిమిష మూరకుండుదురు]

వేదండ :-నీవు సంకల్పసిద్ధుఁడవు, బావా ! ఇంతఁదనుక నేటిగట్టుమాటున నున్నకుముదబాంధవుఁడు నీ విప్పు డాధీరవచనములాడినతోడనే పైకిఁ బొడఁజూపి మనల శీతలకరస్పర్శచేయుటయు, చకోరమిథునము లా వెలుఁగున కామోదామ్రేడితముల నదించుటయు నీకు శుభసూచకములు.

కళానిధి :-నీయాశీర్వచనము సఫలము కావచ్చును గాని నా కిప్పుడాశ్వాస మించుకయుఁ గలుగుటలేదు. ఏలయన

ఉ. చిత్తమునందు హత్తిన విచారకళంకము పైకిఁ దోప నా
హ్లాదకరాస్యమండలపు విన్నదనంబునఁ జాలిగొల్పు చిం
తామణిదైన్యరేఖ, ఉభయపక్షకళానిధి సాక్ష్య మిచ్చెడిన్
వెన్నెలపుల్గు లావలది యోర్చెదు వేదనతీర్గఁ దెల్పెడిన్॥

[తెరలో] ఆకంఠధ్వని కళానిధిగారిదే. ఆకూర్చుండి యున్నవారివద్దకుఁ బోయి చూచెదను. (అని వినబడును.)

వేదండ :-బావా ! నాజ్యోస్య మూరక పోవునా ? నీరొట్టె నేతిలోఁ బడినది. వెంకటనారాయణశాస్త్రి నిన్ను వెదకికొనుచు నిటు వచ్చుచున్నాడు. ఆయన చింతామణిరాయబార మేదో తప్పకఁ గొనివచ్చును.

[ప్రవేశము-వెంకటనారాయణశాస్త్రి]

వెంకట :-ఆర్యులారా ! నమస్కారములు.

కళానిధి :-శాస్త్రిగారూ ! దయచేయుడు

వెంకటనారాయణ :-తమదర్శనమునకై యకు సూర్యాస్తమయ మునుండి ప్రయత్నించుచుంటిని.

కళానిధి :-ఏమి విశేషము ?

వెంకట :-తమదర్శనార్థము చింతామణియు, నామెతల్లియు, నేనునుఁ దమయింటికి వెళ్ళితిమి.

కళానిధి :-అచట మీకుఁ దగినమర్యాదల నెవ్వరైనఁ జరిపిరా ?

వెంకట :-మాయర్హతకు మించినమర్యాదలు జరిగినవి.

కళానిధి :-అ దెట్లు ?

వెంకట :-మేము వెళ్ళినపుడు మీయింటఁ బురుషు లెవ్వరు లేకున్నను, స్త్రీలు మమ్మందఱఁ గారవించి, యుచిత

రీతి నాసీనులఁ జేసిరి. తమ రింట లే రని తెలిసినతరు వాతఁ జింతామణి తమధర్మపత్నిగారినిఁ జూడఁ గోరి నది. అప్పుడు కామేశ్వరమ్మగారు లోపలనుండి మాకడకు రాగానే చింతామణి వారిపాదములకు నమ స్కరించినది. అంతటఁ గామేశ్వరమ్మగారు చింతా మణి నాశీర్వదించుచు లేవఁదీసి కౌగలించుకొని తమ సోదరిని జూసినకంటె నెక్కువ సంతస మైన దనియుఁ, దనతో నింతటినుండి చెల్లెలిస్నేహము నెఱపవలసి యున్న దనియు, సర్వస్వమునుఁ జింతామణి కిచ్చునంతటి ప్రేమ కలిగిన దనియు, నపరిమితదయతోఁ బ్రసం గించిరి.

కేదండ :–చింతామణి యేమనెను ?

వెంకట :–తన కీరోజున రాజసభలోఁ జరిగిన సమ్మాన మంతయుఁ గళానిధిగారి రసికతానుగ్రహముల మూల మనియుఁ దాను వారికి స్వయముగాఁ గృతజ్ఞతావంద నము లర్పించి సెలవుఁ గైకొనుటకు వచ్చితి ననియుఁ, దనపూర్వపుణ్యావశేషమున మహాలక్ష్మీస్వరూపిణి యగు నొకయక్కగారు స్వయందత్త మై లభించిన దనియు, నాభాగ్యము దన కిక సర్వశ్రేయస్సులకుఁ గారణము కాగల దని నమ్ముచుంటి ననియు మనవిఁజేసి కళా నిధిగా రొకసారి తనగృహమునుఁ బావనముఁ జేసి, తనకృష్ణమందిరమును గౌరవించి, తనవిద్యల బత్తా

మర్నించున ట్లక్కగారు బావగారితో సిఫారసు చేసి పంపవలె నని దీనముగా వేమారు ప్రార్థించినది.

వేదండ :-చింతామణికోరిక కావెట్టియిల్లా లెట్టియుత్తరము నిచ్చెను ?

వెంకట :-పరమహర్షముతో భర్తను బంపుదు ననియుఁ, జెల్లెలు తనను మరువక, వీలగునపుడెల్ల వచ్చి చూచి పోవుచుండవలె ననియు జవాబు చెప్పిరి.

కళానిధి :-నాయర్థాంగి నాకు బూటగా మాటయిచ్చి యుండ మఱల నాకొఱకుఁ దమ రేల వచ్చితిరి ?

వెంకట :-చింతామణి రాజమర్యాదల నెఱిగిన దగుటచే, నంతటితోఁ దనివి నందక, తనవందనములను, వినయపూర్వకాహ్వానమును నాముఖమునఁ దమ కందఁజేయు మని కోరుటచే వచ్చితిని.

కళానిధి :-చింతామణి యుచితజ్ఞతకుఁ జాలసంతస మైనది. కాని నన్నామె తనయింటికి రమ్మని కోరుటకుఁ గత మేమి ? ఆమెవిద్యల రాజసభలోఁ జూచి యానందించి యుంటిని గదా ?

వెంకట :-మీరు రాజసభలోఁ జూచినలేశ మామెవిద్యలలో సహస్రాంశము. ఆమెకుఁ గృష్ణమందిరములోఁ గలిగెడి కళాతన్మయత్వమునుఁ, గల్పనయు, నితరచోట్ల నుద్భ

వింపవు. ముఖ్యముగా మీరు కృష్ణభక్తు లనియుఁ, గళాలోలురనియు, మీయందామె కపారగౌరవము. మీయెదుట తనవిద్యలఁ బ్రదర్శించుట దేవునిమను ష్యావతారమునెదుట నివేదించుటగాఁ దలంచుచు న్నది. ఇదివఱ కెన్నఁడు నేపురుషు నిట్లాహ్వానింప లేదు. మీరు రాకున్నఁ జిన్నపుచ్చుకొని చాలబాధ నొందును. ఆమె మిమ్ముఁ బండితమాత్రునిగా నెంచుట లేదు.

వేదండ :—ఈతఁడు పండితమాత్రు డెట్లగును? భూసురోత్త ముఁడు, పూర్ణయౌవనవయస్కుఁడు, సుందరుఁడు, మహాకవి, సకలకళావేత్త, మహామంత్రోపాసకుడు. ఇప్పుడు రాయలయనుగ్రహమున గొప్పవసతిదారుడు. ఇంక నెన్నియో ఘనతలు గలవాఁడు.

వెంకట :—కనుకనే వీరియెడఁ జింతామణివంటియుత్తమవేశ్య కనన్యలక్ష్యము కుదిరినది. ఆమె మాత్రము సామాన్యు రాలా? అప్సరోవంశసంభవ, సుక్షేత్రయునిబిడ్డ, యాగర్భశ్రీమంతురాలు, నవయౌవన, మహారూప వతి, సంపూర్ణకళావతి, యనన్యకాంత, నిష్కళంక వృత్తి కలది, పవిత్రహృదయ, కృష్ణోపాసకురాలు, ఎంతని వర్ణించను? స్త్రీరత్నము గాని వేశ్యామాత్రు రాలు గాదు.

కళానిధి :—మాబావయు నేనును వచ్చుట కెప్పు డనుకూల ముగా నుండును?

వేదండ :-నేనుఁగూడ నీవెంట వచ్చిన మఱల నన్నేయజ్ఞ యాగాదులకైన బుత్త్విజునిగాఁ బిలతురా ?

కళానిధి :-పిలవకున్న నామాన్యములపై ని న్నధికారినిఁ జేయుదును లెమ్ము; భయపడకుము; నీవు రాకున్న నేను బోను. వచ్చిన నీకనేకకళారహస్యముల బోధింతును.

వెంకట :మీాకీలునుఁబట్టి మీా రెప్పుడు వచ్చినను రావచ్చును గాని, ప్రతియేకాదశినాడునుఁ జింతామణి నియతాహారముల గొని యారోజెల్ల హరిసేవఁ జేయుచు, నాడుచుఁ బాడుచు భక్తివివశముగఁ బ్రొద్దుపుచ్చును. రాఁబోవుహరివాసరమునాటిసాయం సంధ్యాకాలమునకు మీారు వచ్చిన రమ్యముగా నుండును.

(ఆంధ్రవిష్ణుగుడిలోని జయఘంటానాదములు వినవచ్చును.)

కళానిధి :-అట్లైనఁ దప్పక యీాబహుళైకాదశినాడు సూర్యాస్తమయసమయమునకు వచ్చెదము. తమరు కూడ నక్కడనే యుండుడు.

వేదండ :-గుడిలోసేవాసమయ మైనది. మన మక్కడకుఁ బోవలెను.

(అందరు నిష్క్రమింతురు)

"దిగ్విజయ" మను

**తృతీయాంకము సంపూర్ణము**

శ్రీ శ్రీ శ్రీ

శ్రీః

# నయనామృతము

## చతుర్థాంకము

రంగము : చింతామణిమేడలోఁ బడకగది.

సమయము : రాత్రి రెండవయామము

ప్రదేశము : చింతామణి చెక్కుటఁ జేతి నానుకొని చింతాక్రాంతురాలై మంచముపైఁ గూర్చుండి యుండును. తరువాత ఐరావతి ప్రవేశించును.

ఐరావతి :-అమ్మా ! రాత్రిలో రెండవజాము సగపడినది. ఇంకను నిద్రపోవైతివేల ? ఈపూటఁ గృష్ణమందిరములో సేవయుఁ గొలదిలో ముగించితివి. ఒడలు స్వస్థముగ నున్నదా ?

చింతామణి :-శరీరబాధ లేదు కాని, మనస్సు మిక్కిలి కలవరముగా నున్నది.

ఐరావతి :-ఏమికారణము ?

చింతామణి :-పోతుసీమగారి ముఖచిహ్నములును, ఆయన చర్యలును, నాకు భయముఁ గొల్పుచున్నవి. ఆయన మొన్న నవనిగడ్డనుండి యకాయకి నిక్కడకు రాకుండనే పడవమీఁద బెజవాడ వైపు వెడలిపోవుట నాకనుమానముగా నున్నది. నామీఁద కష్టటలు పన్ను

చున్నా డని మనకు స్పష్టముగాఁ దెలియుచున్నది గదా? దుర్వ్యాపారులకుఁ జీకటిరాత్రులు సుముహూర్తములు. ఈదిన మమావాస్య గనుక నేమైన ఘోర కృత్యము జరుగునేమో యని యనుమానము తగిలి, నాయంత్రమునుండియు నాందోళనముగా నున్నది.

ఐరావతి :-నీయిష్టదైవము కృష్ణదేవుడే నిన్నుఁ గాపాడును. అదిగాక మొన్నటియేకాదశినాడు కళానిధిగారిక్కడకు వచ్చినప్పుడు నేను వారితోఁ బోతునీడుగారినిర్బంధమునుఁ గురించి చెప్పగా, వారు శ్రీరాయలవారి కీ పన్నగడను స్వయముగాఁ దెలియజేసియైన, మన కేయాపత్తును గలుగకుండఁ గాపాడుదుమని సెలవిచ్చిరిగదా! నీ కింక భయ మెందులకు?

చింతామణి :-పోతునీడుగారు బూర్వము మాతండ్రిగారివిషయమునఁ బన్నినతంత్రములును, గొనసాగించినద్రోహములును నీ వెఱిఁగి యుండియు, నంతచులకనగా మాట్లాడుదు వేల? ఆయనస్వార్థముకొఱకెట్టిదురంతముల నైనఁ గడురహస్యముగ నిర్వహించఁ గల సమర్థుడు.

…నతి :-నిజమే. ఐనను గళానిధిగారి మాటయందును వారిశక్తియందును నాకుఁ గలవిశ్వాసముచేత ధైర్యముగా నున్నది. వారు పూనుకొన్నచో పోతునీడుగారి క్షుద్రతంత్రములు పాఱవు.

చింతామణి :-కానీ, ఆమహాత్ములకు మనపై నంతదయయు, శ్రద్ధయు స్థిరముగా నిలుచునా? వారి కనేకవ్యాసంగములు. వాటిలో మనసంగతి జ్ఞప్తికు రాకుండునా?

ఐరావతి :-పిచ్చితల్లీ, వారియెడల నీ కెంతలక్ష్యమో, వారికి నీయం దంతయభిమానము కలదుసుమా!

చింతామణి :-అట్టియభిమాన మున్నచో, నీవు వారికి నన్నుగురించి చెప్పినవిషయములకు దగినప్రత్యాశనొసంగిరా?

ఐరావతి :-నోటితోఁ జెప్పకున్నను, వారిచేష్టాసాత్త్వికాదులగు లక్షణములవలన వారు నీయెడల గాఢానురాగులని స్పష్టముకాలేదా?

చింతామణి :-అంతప్రేమ గలవారైన * * * * * * తమరు పురుషులుగదా! * * * * నీవు నా యవస్థ సూచించిన తరువాత నైనఁ దమభావము నేలఁ బ్రకటింపఁ గూడదు?

ఐరావతి :-వారు శుద్ధశ్రోత్రియ సంప్రదాయకుటుంబమునఁ బుట్టినవారు. పైగా నన్నలు మొదలగుపెద్దలచాటువారే గాని, స్వతంత్రులుగారు. అంతేగాక, యుత్తమ ధర్మపత్నికులు. నీతో స్నేహము నంగీకరించినఁ గులమువారు నింటివారును గర్హింతురేమో యను సందియము, వారి నింకను వీడినట్లు దోఁచదు. ఐనను

చింతామణి :-నీవాపద్యమునఁ జేసినమార్పులు, నాకాపద్య మును నీహితబోధగా వర్తింపఁజేయుట కని తెలియు చున్నది గాని, యందులోనిభావములు నాపట్ల నన్వ యింపవు. నావలపు కనువేదురును గాదు, నాకులపు నీతి బూటకపుఁ బ్రేమ నటించుటయుఁ గాదు.

ఐరావతి :-కాకున్న నెట్టిది ?

చింతామణి :-నాకులవృత్తి బ్రహ్మానంద ప్రతిబింబమైన యుత్తమకళానంద మిచ్చి లోకోపకార మొనర్చుట. అట్టియానందము స్వరూపము నెఱుఁగని మన కులపుఁ దుచ్ఛకాంతలు పెక్కురు పైపైవలపులుఁ జూపి యల్పద్రవ్యలబ్ధికై దేహముల నమ్ముకొనుటచే మన కట్టి యపఖ్యాతి కలిగినది. నావలపు కేవలాకారసౌష్ఠ వాదులకుఁ బ్రమయుటచేఁ బుట్టినది కాదు. అది నిష్క ళంక కళాజన్యమై సకలకళాపూర్ణుఁ డగుమహాత్మున కర్పించిన పరిశుద్ధాధ్యాత్మిక ప్రేమ. నాపూర్వపుణ్య వశమున నావలఁపుకాడు వరూధినీప్రియునివలెఁ గళా సంప్రదాయమూఢుడును, నరసికుఁడు నగు ఛాందస మూర్ఖుఁడునుఁ గాడు.

ఐరావతి :-తల్లీ ! నీసునిశిత తత్త్వదృష్టియథార్థజ్ఞానముల ముందు నే నేమిమాట్లాడగలను ? నీవంటిపుణ్యాత్మ శాలినిఁ గని ధన్యనైతి నని సంతసించుచున్నాను.

చింతామణి :-నాపుణ్యము పండినప్పుడుగదా నీవు సంతసించుట! కృష్ణపరమాత్మయందు భక్త్యావేశముచేఁ దన్మయముఁ జెందునప్పటి యానందమునకును గళానిధి మహాత్ములస్మరణసాన్నిధ్యాదుల ననుభవించునప్పటి యానందమునకును, నాకావంతయు భేదము గన్పించుట లేదు. కృష్ణునకును గృష్ణపరాయణు లగుభక్తశ్రేష్ఠులకు నభేదము ప్రతిపాదించు నాగమసిద్ధాన్తసంప్రదాయార్థములయనుభవజ్ఞాన మిదియే కాబోలు!

ఐరావతి :-అట్లైన నీకుఁ గళానిధిగారితో సాంగత్యమువలన రాధాదేవిగోపాలకృష్ణునితోఁ గలిసినయానందము కలుగు నందువా?

చింతామణి :-సందియమేమి? మొన్న వారిసమక్షమునఁ గృష్ణమందిరములో నేను లాస్యముఁ జేసినప్పుడు కృష్ణవిగ్రహము మీది నాలక్ష్య మప్రయత్నముగా మాటిమాటికి గళానిధిగారిపై వ్రాలుచుఁ దత్పూర్వమునకన్న నెక్కుడు రసాస్వాదము కలుఁగు చుండెడిది.

ఐరావతి :-నీసాంగత్యమువలన వారి కేమైన నాధ్యాత్మికోపయోగ ముండునా?

చింతామణి :-లేకేమి? సృష్టిలోని ప్రకృతిపురుషతత్త్వముల రూపములే స్త్రీపురుషులు. స్త్రీ పురుషునందుఁ బురుషోత్తమభావనఁ జేసి కడతేరును. పురుషుఁడు పరమ

పురుషుస్వరూపమున నారాధించును. అట్టియారాధనమునకుఁ భక్తియోగ మొకసాధనము. పూర్వము శ్రీజయదేవులకు పద్మావతీదేవికంటె నేను నా ప్రాణనాథులకు భక్తియోగమున నధికముగ నుపకరింతును.

ఐరావతి :-నీకింత వేదాంత మెవరు బోధించిరమ్మా ?

చింతామణి :-బావాజీభరతాచార్యులవారు. వారు నాకు గీతగోవింద ముపదేశించుటలో రాధాకృష్ణమతసంప్రదాయరహస్యములను వివరముగ దెలిపి, కృష్ణభక్తాగ్రేసరుసంగము లభించు నని న న్నాశీర్వదించిరి.

ఐరావతి :-కళానిధిగురువు లగు శ్రీపరమహంసస్వాముల వారును సరిగా నట్టియాశీర్వచనమునే యనుగ్రహించిరికదా ! నీ వొకకారణజన్మవు గాని సామాన్యురాలవు గావు తల్లీ !నీవు వరించినభూసురేంద్రుఁడు నీకన్నివిధముల నధికారియే.

చింతామణి :-ఆరసికచంద్రులు పరమనోభావముల నెంత సూక్ష్మముగ గ్రహింతురమ్మా ! నాయభినయము మాత్రమున నామానసికబాధ నెఱింగి, నాస్వాస్థ్యమునుగూర్చి, యెంతో సానుభూతితో నన్నుఁ బ్రశ్నించిరిగదా !

ఐరావతి :-సభలముందు త్రయోదశినాడు నీ వభినయించు-
మూర్ఛఁజెందుటయు, దన్నివారణమంత్రములున
వెంకటనారాయణశాస్త్రిగారు చెప్పగా నంద
సూచనకుఁ గళానిధిగారి కుదయించినహర్షాదిభా
ములు ప్రస్ఫుటములు.

చింతామణి :-శ్రీరాయలవారు నా కనుగ్రహించినబిరు
మును, బహుమానములును, నన్నుఁగూర్చి వా
సెలవిచ్చినమాటలును, వారికి నాపైఁ బుత్రికావాత్
ల్యము గలుఁగుటనుఁ బ్రకటించు ననుట నాప్రియుఁ
చెప్పకముందు మన మెవ్వరము గ్రహింపలేమైతిక
గదా !

ఐరావతి :-నీయభినయమువల్లనే ప్రభువుల కట్టిభావమ
కల్గెనా యేమి ?

చింతామణి :-శ్రీరాయలవారు నన్నపేక్షింతు రని పో
నీడుగా రాసవడుటచే నాకు జంకు గలిగి యట్టిసంభ
మునకు వారణక్రియగా, నాహృదయము భూసుర
త్తముదత్త మని, చక్రవర్తికి నిగూఢముగా నె
గించుఁ బ్రయత్నమున నాప్రభువునందు జగత్పిత
భావన జేసినటించితిని. ఆక్రియవల్ల నావల్లభు
నాయాశయు మెఱుంగుటయును రెండవ ప్రయోజనమ
కూడఁగలిసివచ్చునట్లుఁ జేసితిని. వరదత్తానుపాలనధర

ప్రతు డగునారాయలును, పరమకరుణామూర్తి యగు నాహ్నాదయోశులునుఁ దుల్యప్రతిభులు గనుక నా యసందర్భాభినయములోనినిజమును గ్రహించఁగలిగిరి.

ఐరావతి :-నీవు జరిపినపనికి నీవు కోరనిమూడవయర్థము లభించినది. నీవు పద్మావతివంటిశీలముగలదాన వనియుఁ, బ్రియున కంతవశంవదవు, నుపయుక్తవు, వనియు లోకమునకుఁ బ్రకటమైనది.

చింతామణి :-నాప్రాణేశుల కవిత్వము, వారివాచికవైఖరి, గానమాధుర్యము ననన్య సులభములు గదా ! వారు మనకృష్ణమందిరములోఁ జెప్పినశ్లోకము లెంతమనో హరములు !

శ్లో. మదశిఖండిశిఖండవిభూషణం
మదనమంథరముగ్ధ ముఖాంబుజమ్ !
వ్రజవధూనయనాంచలవంచితం
విజయతాం మమ వాఙ్మయజీవితమ్ ॥

శ్లో. శృంగారరససర్వస్వం శిఖిపింఛవిభూషణమ్ ।
అంగీకృతనరాకార మాశ్రయే భువనాశ్రయమ్ ॥

ఐరావతి :-నా కాశ్లోకముల నన్వయించి చెప్పుము తల్లీ !

చింతామణి :-నేను వాటికిఁ జేసిన తెలుఁగుపద్యములనే చదివెదను వినుము.

తే. గీ. పోతరించిననెమ్మిరాపురి తురాయి
మరునివేగున వగ లొల్కు మోముదమ్మి
వెలయ వ్రేతలవాల్చూపువలలఁ బడిన
నాదుపల్కుల ప్రాణభూతునకు జయము ॥

తే.గీ. సర్వశృంగారరసఖని, నీలకంఠ
బర్హ శేఖరు, నరరూప మాదరించి
భువనమోహన మొనరించువిశ్వరూపు
నాశ్రయించెద నెల్లశ్రేయములకొఱకు ॥

ఐరావతి :-అమ్మా! రెండుజాములు దాటినది. ఇక పరుండి నిద్రపట్టించుకో, తల్లీ !

చింతామణి :-అష్టపదులలో ననేకచోట్ల నా కదివఱకుఁ దెలియనిక్రొత్తభావములఁ బోధించి, యనురూపాభినయములఁ గఱపిరి. అట్టిరసికావతంసునితో, నిరంతర సాంగత్య మీజన్మమున లభించునో లేదోకదా !

[అని కంటఁదడి పెట్టును]

ఐరావతి :-అమ్మా! దుఃఖించుట తప్పని యెఱుఁగని దానవా! నా కెందులకో వారు నీకడకుఁ దొందఱలో వత్తు రని తోఁచుచు, నెడమక న్నదరుచున్నది. (వినుట నభినయించి) ఎవరో మేడమెట్లనెక్కి వచ్చుచున్నట్లు చప్పుడగుచున్నది. నేనుఁ బోయి చూచి

వచ్చెదను. నీవు బరుండుము (అని చెప్పి గదిబైటికి వచ్చి తలుపు మూయును)

[తెరలో] నే లేనప్పుడు తల్లీకూతుళ్ళిద్దరూ యీఅంతస్తుమీద కృష్ణమందిరానికి దచ్చినపేపు గదిలో పండుకుంటారు. అక్కడి కెల్దాం రండి! (అని వినఁబడును)

ఐరావతి :-(తనలో) అది పోతునీడుగారిమాట! యిం కెవరినో కూడా తీసికొస్తూన్నట్టుంది. ఇక్కడే ఉండి చూస్తాను. ఇప్పుడు నాకుడికన్నదురుతోం దెందుకో! కృష్ణా! నాకన్నబిడ్డనుఁ గాపాడుము తండ్రీ!

[ప్రవేశము :-పోతునీడును, మఱొకపురుషుఁడును]

పోతునీడు :-(గదిముందు చీకట్లో నిల్చియున్న ఐరావతినిఁ జూచి వెనుకకు జంకి) యవరది? పలకవేం? దెయ్యానివా? బూతానివా? నేను పోతురాజు బత్తు ణ్ణెరుగుదువా?

ఐరావతి :-పిశాచాలు సంచరించేవేళ తిరిగేవాళ్ళకళ్ళ కవి ప్రత్యక్షం గాకపోతే దేవతలు కనపడతారా?

పోతునీడు :-ఐరావతీ! నువ్వేనా? తెల్లసీరె కట్టుగ్గోడకాను క్కదలకుండా నుంచుంటే సీకట్లో యేమిటో అనుకుం

డాను. సరే! లేపక్కర్లేకండా సరిపోయిందిలే! ఇదిగో! యీారు మన పెబువులు తిమ్మానాయకుడు గారు. మనఅమ్మాయిని సూడా లొచ్చారు. దానోమాటు లేపి యిట్టా పిలుత్తావా?

ఐరావతి :-తిమ్మానాయకుడా! బొమ్మానాయకుడా! ఈఅమావాస్యచీకట్లో, యీాదొంగపొద్దువేళ కుదిరించా లగ్గం. ఆయన చూట్టానికీ, మీారు చూపించటానికీని? అది మూడోఅంత స్తుమీాద పడుకుంది. ఇప్పుడు లేపినా లేవదు. రావణాసురు డొచ్చినా మాట్లాడదు. తెల్లారింతర్వాత చూడొచ్చులెండి. వారికీ మీాకూ గదుల్లో పక్కవేయిస్తాను పడుకోండి. శారదీ! రంజికా! మీారిద్దరూ యిట్టా రండీ (అని అరచును)

పోతునీడు :-అట్టా అరుత్తావేం! పెబుల్ని తూలనాడతావా? ఇదేనా నీమరియాద? ఆరి కైయ్యాల తీరుబడి అయ్యి, రాప్పెంగా సూట్టాని కొత్తే రేపటిదాకా వుంటారా? ఆరు మల్లీ యిప్పుడే యెల్లిపోవాల. కుఱ్ఱదాన్ని పిలకతప్పదు.

ఐరావతి :-వారు ప్రభువులైతే, వారికీ మనకీ అసలు ప్రభువులు దగ్గిర్లో కొండపిల్లికాడే ఉన్నారు. తిమ్మానాయకుడుగారు క్రిందటిపంచమినాడు పదివేలమోహ

రీలనంపి, చింతామణిపొత్తు గోరుతూ కబురంపిన
ప్పుడే ఖచ్చితంగా మాకు వీల్లేదని జవాబు పంపితే,
మళ్ళీ యిప్పుడీవిధంగా యెందుకు రావాలి? నాబిడ్డ
నిప్పుడు లేపడానికి నే నొప్పుకోను. రే పుంటే చూపి
స్తాను గాని, యిప్పుడే వెళ్ళాలిసుంటే వారు దాన్ని
చూడకుండా వెళ్ళిపోవాలిసిందే.

పోతునీడు :-రాయలోరు శెక్కరవొర్తైనా, మన బెజవాడ
మండలానికీరే పెబువులు. యీరేంసేసినా సెల్లుద్ది.
మనమందరం యీరి కిందోళ్ళం. సభల్లో సూసినా
ళ్ళుండి సింతామణిమీద యీరికి మాగొప్పదయ
పుట్టింది. అదొప్పుకుంటే మనయిజారా మల్లీ మన
కిప్పింతా మంటుండారు. ఈనాటికి సింతామణీ రాణీ
యై యెలిగిపోద్ది. ఈమాట లన్నీ మీరు యినక
ఆ తెలివితక్కువజవాబు అంపేప్పుడే శెప్పాను. ఇప్పు
డారోన్నటితో మీకు సెప్పిచ్చటానికి తీసికొచ్చాను.
పిచ్చిపిచ్చి మేసాలుపోక దాన్ని పిలు.

ఐరావతి :-మీరు తిమ్మానాయకుడిగారితో చేసే కుట్ర
లన్నీ మాకు తెలుసు; నాబిడ్డ ముమ్మాటికీ వారి
సాంగత్యం చెయ్యదు. దానిమనసు వేరేవిధంగా
వుంది. బలవంతంపెట్టినా కార్యం లేదు. ఇప్పటికి
మర్యాదగా వెడితే మంచిది.

పోతునీడు :-ఇగ నోరుముయ్యకపోతే పక్కఎముక లాగ్తాతై. కబడ్దార్ ! నువ్వు లేవకపోతే నేనే లేపి తీసికొత్తాను తలుపు కడ్డంలే.

[అని ఐరావతిని ప్రక్కకు ద్రోసివేసి, తలుపు తీసుకొని గదిలోనికి బోవును. గదియంతయు గలయఁ జూచి]

పక్కక్కడేవుంది గాని, పిల్ల కనబడదేం ! ఇదిగో యీతలుపుగుండా మందిరంలో కెళ్ళి దాక్కుంది గామోసు.

[అని తలుపుఁ ద్రోయగా నది లోపల వేయబడి యుండును. అపుడు పోతునీడు పలుగు దెచ్చి యుత కెత్తి తలుపు దెఱచును. తరువాఁత తూర్పువైపు తలుపుఁ దెఱచును.]

## ప్రవేశము :

[చింతామణి రాధాకృష్ణ విగ్రహాభిముఖంగా నిశ్చలంగా గూర్చునియుండును ఆవిగ్రహాలకు రెండు ప్రక్కలను రెండుదీపములు వెలుగును మంచికాంతి నిచ్చుచుండును.]

ఐరావతి :-ఆమందిరంలో మీ రేమన్నా తప్పుడుమాటలు మాట్లాడినా. దుర్మార్గప్పన్లు చేసినా శాస్త్రి వెంటనేఁ

జరుగుతుంది. జాగ్రత్త. ఆబాజీమహారాజుగారు వేసినయంత్రంమహిమ మహాతీవ్రమైనది. వూరికే ఒట్టిబొమ్మరిల్లు గాదు.

పోతునీడు ;-తిమ్మానాయకుడుగారూ ! లోపలికి దయ సెయ్యండి !

ఐరావతి ;-(తిమ్మానాయకునితో) చెప్పు లొదిలి వెళ్ళండి !

[తిమ్మానాయకుఁ డాప్రకారము చేయును. ఐరావతికూడా మందిరంలోనికి వెళ్ళును. చింతామణి మనుష్యులకేసి చూడక విగ్రహములమీద దృష్టి నిలిపి యుండును.]

పోతునీడు :-సింతామణీ ! బెజవాడ దుర్గరచ్చకులు తిమ్మానాయకుఁడుగారు నీ కోస మొచ్చారు. ఆరికేసి తిరిగి మాట్లాడు.

[చింతామణి తిరగదు, మాట్లాడదు]

పోతునీడు:-నువ్వు మాట్లాడకపోతే నా కోప మొచ్చిందంటే లాక్కెళ్లి ఆరిపాడవలో యేసి, యిప్పుడే బెజవాడ పంపించేత్తా. మర్యాదగా ఆరికేసి తిరిగి మాటకి జవాబు చెప్పు.

[చింతామణి వెనుకటివలెనే కదలక కూర్చుని యుండును]

ఐరావతి :-మీరు నోటితో యేమ్మాట్లాడినా ఒప్పు కుంటాను గాని, నాబిడ్డమీద చెయ్యేశారంటే వూరుకోను. అది మీబిడ్డ కాదు. అది మీకు పరస్త్రీ. దాన్ని మీరు తాకూ్డదు. మీరు బెదరిస్తున్నట్టు, అఘాయిత్యం యేమన్నా జరిపారంటే, యీరాత్రే నే బయలుదేరి అన్నాహారా ల్లేకుండా కాలినడక నైనాసరే శ్రీరాయలవారివద్ద కెళ్ళి వారికాళ్ళమీదఁ బడి మొర్రెట్టుకుంటా. అప్పుడు తెలుస్తుంది మీయందరిసంగతి.

తిమ్మానాయకుఁడు :-పోతునీడుగారూ! మనం పోదాం రండి. తరువాత నెమ్మదిమీద మళ్ళీ మాట్టాడొచ్చు!

పోతునీడు ;-తమ రూరుకోండి, బాబూ! పనంతా నే జటీపి యీరాత్రి సింతామణ్ణి మీ కప్పగించకపోతే నాబతు కెందుకు ? ఈఆడముండబెదిరింపులు నమ్మఁబోకండి. అ దెక్కడికి పోద్ది. గడప కదిత్తే కాళ్లిరగ్గొట్టి కూకెమెట్టనూ, అంతే! హా!

ఐరావతి :-నా ఆదుర్దాకొద్దీ నే నెడ్తా నన్నా గాని శ్రీరాయుల వారికిదివరకే కబురెళ్ళింది. మీకుట్రలూ, మీరు తిమ్మానాయకుఁడుగారికి చేసినకబుర్లూ, మీ రవని గడ్డనించి బెజవా డెళ్ళటం, ఇవన్నీ నే నెఱగ నను కొన్నారుగామన్న, మీరు బెజవాడలో నిలవున్న సంగతీ రాయులవారికి తెలుసు. వారికి మాఅమ్మాయి

మీద కన్నకూతురిమీదకంటె యెక్కువ ప్రేమ. మీ యిద్దరికదలికలూ ఓకంట కనిపెడుతూనే వుంటారు. ఈపాటికే, మీ రిద్దరూ యిక్కడి కొచ్చిన సంగతి ప్రభువులు తెలుసుకుని, మీ వెనకే యెవర్నో సిబ్బందీతో పంపించే వుంటారు. మాతండ్రి మాకృష్ణమూర్తి సత్యమైనవాడైతే తెల్లారేలోగా రాయలవారిదగ్గర్నించి యెవరో కొందఱు మీచర్యలు కనిపెట్టి మమ్మల్ని కాపాట్టాన్కి వచ్చితీర్తారు. చూసుకోండి.

తిమ్మానాయకుఁడు - పోతునీడుగారూ! మీతో ఒకసంగతి చెప్పాలి? కిందకెళ్ళి మళ్ళీ వద్దాం. ఓసారి రండి.

పోతునీడు :-యీదొంగముండమాటలు నమ్మి తమరు జంకుతుండారా. అది మాయలమారిముండ. ఎన్నబద్ధాలన్నా కలిపిస్సుద్ది. మీ కెందుకు? మీ రూరుకోండి. ఈసిన్నలంజెని కట్టి మీపడవలో యేత్తాను. యెట్టు కెల్తురుగాని! యీళ్ళబా బెవ డడ్డమొత్తాడో, చూద్దాం.

[అని చింతామణి దగ్గర కెళ్ళి]

ఇదిగో! ఇటు తిరక్కపోతే రె క్కట్టుకులాగుతుండా!

[అని పట్టుకోఁ బోవును]

ఐరావతి :-(అడ్డము వెళ్ళి) నువ్వాపని చేస్తే తల పగిలి చస్తావు. నీచావు మూడింది. దుర్మార్గముండా

కొడకా ! దూరంగా పో ! (అని పోతునీడును వెనుకకు త్రోయును) Acc 9845-894, 8132 VEN

పోతునీడు :-ఓసిముండా ! నీకెంతపొగరెక్కిందే? నా కడ్డ మెచ్చేపాటిదాన వైనావంటే !

వెంకటకృష్ణమూర్తి, భావరాజు.

[అంటూ ఐరావతి మీదికి కెళ్లి కాలితో దన్నును. ఐరావతి "చస్తిని దేవుడో! అమ్మో బాబో! అని యేడుస్తూ నేల గూలును. పరిచారికలు గొల్లున యేడుస్తూ వచ్చి ఉపచారములు, చేయుదురు.]

చింతామణి :-(గజగజవణుకుతూ, కృష్ణవిగ్రహంపాదాలు పట్టుకొని గద్గదకంఠంతో) కృష్ణా!!! ఆపద్బాంధవా!! దీనరక్షకా !!! ఆర్తత్రాణపరాయణా

[అని స్మరించును]

పోతునీడు :-ఒసే ! సిన్నలంజా ! నీయమ్మకైనట్లు నీకూడా కావాలా ! తిన్నగా వొచ్చి పడ వెక్కుతావా? [అని రెక్కపట్టి లాగును]

చింతామణి ;-హా ! కృష్ణా !! ద్వారకావాసా !!! ద్రౌపదీ మానసంరక్షకా !! గజప్రాణదాతా !!! ప్రహ్లాద వరదా ......తండ్రీ ! నీవే......ది......క్కు !!!

[అని కృష్ణవిగ్రహంకాళ్లు గట్టిగా కౌగలించు కొనును. పోతునీడు బలవంతముగా లాగి, కుడిచేతి

పట్టు వదలించి గట్టిగా యీడ్చును. మఎడచేతి పట్టుతోఁ బెనుగులాడుచుఁ బోతునీడు తిమ్మానాయకుల వెనుకకుఁ జూచి]

నా ప్రభూ ! శ్రీకృష్ణదేవా ! వచ్చారా ! దాసురాలిమీద ఎంతదయ! ఈమాటు చక్రవర్తిరూపంగా వచ్చారా స్వామీ ధన్యాస్మి ! ధన్యాస్మి !!

[అంటూ నమస్కరించి మూర్ఛపోవును. పోతునీడు తిమ్మానాయకులు వెనుకవైపుఁ జూచుదురు. పోతునీడు చింతామణిని వదిలివేయును. తల్లియు పరిచారికలు నుపచారములు చేయుచుందురు.]

ప్రవేశము :-కృష్ణరాయులు కుడిచేతిని కత్తిపిడిమీద నుంచుకొని రాజసముగా నడచుచు సమీపించును. వెనుక నిద్దరనుచరులాయుధపాణులై గుమ్మమునకిరుప్రక్కల నిలుతురు. పోతునీడు తిమ్మానాయకులు చక్రవర్తిని జూచి నిర్ఘాంతపోయి రాతిబొమ్మలవలె నిశ్చేష్టులగుదురు. ఒక్కనిముష మైన తరువాత తిమ్మానాయకుఁడు రాయలకాళ్ళమీద సాష్టాంగపడును. పోతునీడు దక్షిణపు గదిలోనికిఁ బారిపోవును. గుమ్మముకడ నున్నసిపాయిలలో నొకఁడు తిరిగి వెళ్ళి ఆగదిలో ప్రవేశించి, అక్కడనుంచి పారిపోవుచున్నపోతునీడును జుట్టి పట్టుకొని రాయల సన్నిధికి దెచ్చి నిలువఁబెట్టును.

కులు :-తిమ్మానాయకుడా ! నీకు మే మిచ్చిన యధి
కారమును మహాపుణ్యకార్యముల కుపయోగించు
చున్నట్లున్న దే ?

మ్మనాయకుడు :-మహాప్రభూ ! అపరాధిని నే నేమియు
నీ స్త్రీలజోలికిఁ బోలేదండి. తమరు వారి నడిగి తెలిసి
కొనవచ్చును. నాయపచార మొకటి యొప్పుకొను
చున్నాను. తమశ్రీకాకుళంసభలలో చూచినప్పటి
నుండియుఁ జింతామణిమీద నాకు వెర్రిమోహం
కలిగి నే నంపినవర్తమాన మామె నిరాకరించినను,
ఈపోతునీడు నాయాశను రగుల్కొల్పి, యీరోజున
నా కామెను స్వాధీనపఱతు నని తీసికొనివచ్చినాడు.
ఇంతబలవంత మవసరమని నాకుఁ దెలియ లేదు.
నేను సమ్మతించకపోయినను పోతునీడు చెయ్యిచేసి
కొని, అత్యాచారము నడపినాడు. తమశిక్షకు బద్ధు
డను. సేవకుడిప్రథమనేరము క్షమింపు డని యేలిన
వారిని ప్రార్థించుచున్నాను. రక్షింతు మని యభయ
హస్త మివ్వనిదే నేను తలయెత్తి లేవలేను.

రతి :-మహారాజా ! నేను చింతామణి తల్లిని. నాపేరు
ఐరావతి. తిమ్మానాయకుఁడుగారేమియు మమ్ము
బలుకరించక పోవుటయు, మాజోలికి రాకపోవుటయు
నేకాక తమపేరు నే నెత్తినపుడెల్లఁ బోతునీడును
వెళ్లుదము రమ్మని తొందఱచేయుచు వచ్చిరి కాని,

పోతునీడు చేయుదుష్కృత్యమును వారించ రై
పోతునీడు నన్ను దుర్భాష లాడి తన్నినాడు. చింత
మణి నీడ్చి బలవంతముగాఁ దిమ్మానాయకుడుగా
పడవలో వేసి, వారికి స్వాధీనముఁ జేయఁ బ్రయ
త్నించుచుండగా దేవరవారు విజయం చేసినారు.

రాయలు :-తిమ్మానాయకుడా! నీపుస్వయముగా నత్యా
చారముజరుపకపోయినను, నీకొలఁది కితరుడు దుష్కా
ర్యము జేయుచుండ సహించుట గొప్పతప్పిదము,
ఐనను మోహాంధుడ వైననీనేరము ప్రథమతప్పిద
మగుటచే వెంటనే ని న్నధికారమునుండి తొల
గింపము. నీనేరమునకుఁ దగినప్రాయశ్చిత్తము బెజ
వాడలో విధింతుము. అంతవఱకుఁ బోతునీడును నీ
స్వాధీనము చేయుచున్నారము. వీని నినుపగొలుసు
లతోఁ గట్టి, బెజవాడదుర్గమునఁ గారాగారమున
నుంచి, మాసెల వైనప్పుడు హాజరుపెట్టుట నీజవాబు
దారీ (సిపాయి నుద్దేశించి) హనుమాన్‌సింగ్!
ఈపోతునీడును కాలుసేతులు గట్టి మనపడవలలో
నొకదానిమీద నీయిద్దరిని జేర్చి నాలుగంచెలపడప
వాండ్ర నిచ్చిఁ బెజవాడ చేరువరకు పడవ నాపకుండఁ
ద్రోసుకొని వెళ్ళుఁ డని మాయుత్తరువులుగాఁ
జెప్పినది. రే పుదయము మే మక్కడికిఁ జేరునప్పటికి
నీ రక్కడ హాజరై యుండవలెను. ఇకఁబొండు.

[సిపాయీలు, పోతునీడు తిమ్మానాయకుఁడు నిష్క్రమింతురు.]

ఐరావతి :-మహాప్రభూ ! తమరు విజయముచేయకున్న మే మీరోజున నేమగుదుమో ! మావంటి సామాన్యులాంధ్రవిషయముననుగూడ రక్షణకార్యము స్వయముగా నిర్వర్తించుదేవరవారు సాక్షాత్తుగా భగవదవతారము గాని మఱియొకటి కాదు. కృష్ణదేవులను తమనామము సార్థకము, మాయిలువేల్పు రాధాకృష్ణుడును, తమరును మాపాలిట నొకటి గాని భిన్నులు గారు, ఏలినవారిదాసురాంధ్రమైన మేము ఆజన్మము కృతజ్ఞులము. మాకుఁ బ్రాణదాతలును, మానరక్షకులు నైనతమఋణము ననేకజన్మము లెత్తి తమకుఁ జరణసేవఁ జేసినను, దీర్చుకొనలేము. మేము చేయగలది తమప్రత్యక్షముననుఁ బరోక్షముననుసదా వందనము లర్పించుట గాక, వేఱొకటి లేదు. తమ యనుగ్రహమునకు విధేయలము.

రాయలు :-ఐరావతీ ! మేము చేసినది భగవంతుఁడు మాకు విధించిన ధర్మము. అంతయు నాపరమేశ్వరునాజ్ఞ మేఱ జరుగుచుండును. ఐనదాని కేమి గాని, చింతామణి మూర్ఛదేరినదా ? [సమీపించి]

అభినవపద్మావతీ ! భయము లేదు లెమ్మా ! మీరాధాకృష్ణుఁ డెంత మహిమాఢ్యుఁడు ! ఎంత సొగసుగాఁడు !

శ్లో॥ రాధా రాధిత విభ్రమాద్భుతరసం, లావణ్యరత్నాకరం
సాధారణ్యపదవ్యతీతసహజస్మేరాననాంభోరుహం
ఆలంబే హరిలీలగర్వగురుతానుసర్వస్వనిర్యాపణం
బాలం, వైణవికం, విముగ్ధమధురం, మూర్ధాభి
షిక్తం మహః॥

శ్లో॥ సర్వజ్ఞత్వేచ మౌగ్ధ్యేచ సార్వభౌమ మిదం మమ
నిర్విశన్నయనం తేజో నిర్వాణపద మశ్నుతే॥

ఐరావతి :-మహారాజా ! తమకృష్ణవర్ణనము విని చింతామణి తెలివి నొందుచున్నది. ఇదిగో! లేచినది (చింతామణి నుద్దేశించి) అమ్మా ! సార్వభౌములు నీకు స్మృతి వచ్చువఱకు నుండి, నీ కభయహస్తమును స్వయముగాఁ బ్రసాదింప ననుగ్రహించి యున్నారు చూడుము.

చింతామణి :-వారు కేవలము భూలోక సార్వభౌములే కాదు. నామాన ప్రాణశరీరసీమలు, వారియేకచ్ఛత్ర మునీడ సురక్షితములు. నాయాత్మ, దేహము వారి సామ్రాజ్యమున నొకలేశము. నాజీవితసర్వస్వ చక్రవర్తులకు నాప్రణామములు.

రాయలు :-సుకుమారీ ! నీరాజభక్తికి బరమసంతసము. నీకిక ముం దెట్టియుపద్రవములు కలుఁగ కుండు బాధ్యత మేము పూనితిమి.

చింతామణి :-మహాప్రభూ ! నాకన్న ధన్య యెవ్వతె ? మహాప్రసాదము.

రాయలు :-ఐరావతీ! తిమ్మనామకుఁడు మీమండలాధికారి గదా! చింతామణి యాతనికోరిక నేల నిరాకరించినది.

ఐరావతి :-దేవా ! మన మన్యత్ర లగ్న మగుటచే !

రాయలు :-వెలవెలఁదికి మనసార నొకని ప్రేమించుటయు ద్రవ్యాధికారముల దృణీకరించుటయు నస్వాభావికములు గదా ?

ఐరావతి :-దేవరా ! కళావతులకుమాత్ర మంతఃకరణము లుండవా ? తక్కిన కులములలోవలెనే మాలో గూడ నున్నతనీచసంప్రదాయము లున్నవి మా శ్రీకాకుళ క్షేత్రవాసిను లప్సరసలకోవవారు. బ్రహ్మచే స్వర్గమునుండి యాంధ్రదేవ సేవార్థము భూలోకమునకుఁ గొనిరాబడి రని యితిహాసము. మాకన్యలకు విధిగాఁ గళాశిక్ష నొసగుటయు, గన్నెరికమునకు భూసురునే వరించుటయు, సరసుఁడు విడనాడ కుండునంతవఱ కాయననే నమ్ముకొని యన్యులఁ జూడ కుండుటయు, ప్రియుల నంగీకరించుటలోఁ గులవిద్యాగుణసంపత్తు లనే ముఖ్యముగా గణించుటయు, విద్యలవలననే జీవించుటయు, స్వసంతానము మూలముననే వంశపరంపర నిలుపుకొనుటయు మాకులాచారములు.

చింతామణి :-అమ్మా ! ఉత్తమకళాపాండిత్యమును, తండ్రుల వంశోన్నతులును గూడ మనకులపుఁబాలికల కార్జవభావములఁ గూర్పవా ? మాతండ్రిగా రెవ్వరో మహాప్రభువులకు విన్నవించితివా ?

ఐరావతి :-ప్రభూ ! వారు బ్రాహ్మణోత్తములు మహాపండితులు. వారికినిఁ జింతామణియం దభిలాష యున్నను నేలుకొనుపట్ల నింకను గృతనిశ్చయులు కాలేదు.

రాయలు :-చింతామణి వరించిన భూలోకస్వర్గాధిపతి నామ దివ్యాక్షరము లెట్టివి ?

ఐరావతి :- **శ్రీ కళానిధి మిశ్రులు.**

రాయలు :-ఎట్లూ ! మనకళానిధియే ! మే మనుకొనినట్లే అయినది. చింతామణి యభినయమును బట్టి మేము నట్లే శంకించితిమి గాని మరల నేమరితిమి. అట్లైన నీ గాంధర్వమునకు మేమే పెద్దలమై, కళానిధికి వెంటనే వర్తమాన మంపి త్వరలో శుభలగ్న మేర్పఱచి మీకు దెలియఁ జేసెదము.

ఐరావతి :-దేవా ! తమ ముచ్చట మాకును వారికిని పరమ సమ్మత మైన ముదల యగును. మాయదృష్ట మీ లోకము నతిక్రమించినది.

చింతామణి :-(సిగ్గు నభినయించుచు) అమ్మా ! మహారాజుల కృష్ణస్తుతి కవిత్వమువల్లనే వారు "సుధామయు ల" ని తెలియలేదా ?

[తెరలో స్వస్తి మంత్రములు వినఁబడును]

ఐరావతి :-అది వేదండభట్టుగారి కంఠము. వా రీసమయమున నిచ్చటి కెందులకు వచ్చిరో ?

(ప్రవేశము :- సద్య స్స్నాతుఁడై, విభూతిమొద లగు శుద్ధ శ్రోత్రియలక్షణములతో. వేదండ భట్టు పుణ్యాహవాచనమంత్రములఁ జదువుచు కలశోదకమును మామిడి మండలతో మందిరమంతటను ప్రోక్షించి)

వేదండ :-జయము జయము, సర్వతంత్రస్వతంత్ర సార్వభౌమునకు దేవా! యథాజ్ఞగా బద్ధుఁడై పోతునీడునుఁ, దిమ్మనాయకుఁడును బడవమీఁద, బంపఁబడిరి. గమనవేగముబట్టి యీవేళ కాపడవ యొకయోజనము పోయియుండును.

ఐరావతి :-స్వామీ! వేదండభట్టుగారూ! నమస్కారములు

[చింతామణికూడ నమస్కరించును.]

దయ చేయుడు. తమ రెప్పుడు వచ్చితిరి ? తమ రావగా రెచ్చట ? మీరు కృష్ణార్జునులవలె నొకరి నొక రెడబాసి యుండరుగదా !

వేదండ :-నేను వచ్చిచాలాసే పైనది. మాబావగారు నిచ్చటనే యున్నారు. వారికొలువు నాకుఁ దప్పునా ?

ఐరావతి :–మీమాటలు నాకర్థ మగుటలేదు. కళానిధిగా రిపుడిచ్చట నున్నఁ జక్రవర్తుల సన్నిధి కేలరారు ?

వేదండ :–చక్రవర్తులును మాబావగారు నేకమై జరిపిన తంత్రమే యిది.

[రాయలు ప్రక్కకుఁ దిరిగి శిరోవేష్టనమును శ్మశ్రువులు మొద లగునవియుఁ దీసివేసి, కళానిధిముఖముతో నవ్వుచు స్త్రీలవంకకుఁ దిరుగును. వారు పరమవిస్మయ హర్షములు నటింతురు.]

చింతామణి :–కృష్ణవిగ్రహమువద్ద నున్నహారతిపళ్ళెరమునుఁ దెచ్చి, కర్పూరమును వెలిగించి,

చం॥ అనిమిషలోచనప్రభల రాధిక హారతిపట్టు విభ్రమా
ద్భుతరసమూర్తి, మేమెఱుఁగుము త్రియపుంగని నై జహాసని
స్సమముఖపుండరీకము, సురాధిపసీలమదాపహారి, గా
యనగణపట్టభద్రతరుణత్వము నూనెదఁ గ్రమతేజముస్॥

తే॥గీ జ్ఞానసర్వస్వముగ్ధత్వరాజ్యములకుఁ
జక్రవర్తిత్వ మూనునీదివ్యధామ
మందుఁ జొఱఁబాఱి శాశ్వతానందపదము
రుచి మరగి మఱల కున్నవి నాదుకనులు.

కళానిధి :–(జనాంతికముగా వేదండభట్టుతో) బావా ! చింతామణి రసగ్రహణపారీణతయు, నేకసంధాగ్రహణ

శక్తియు, నాశుకవితా మాధుర్యమునుఁ గమనించి తివా? నే నామెను మూర్ఛఁదేర్చుటకు రాధాకృష్ణు నుద్దేశించి సందర్భోచితముగా నాశువున నుడివిన శ్లోకముల రెంటినిఁ బ్రస్తుతరసముల కన్వయించి, యాంధ్రీకరించి, నాయందుఁ గృష్ణత్వారోపణముఁ జేసి నా మాటలు నాకు మఱలనప్పగించినది. !

ఐరావతి :-(కళానిధి నుద్దేశించి) చాతుర్యచక్రవర్తి ! తమరు మాయిక్కట్టు శ్రీరాయలవారికిఁ దెలియజేసినను వారి కనుగ్రహమున్నచో నెవరినైనఁ బంపుదు రను కొంటిని గాని యింతచిన్నపనికి వారే స్వయముగ వత్తు రని నే ననుకొన లేదు. కాని, యనుకొన కున్ననుఁ, బ్రత్యక్షముగఁ జూచుచు నమ్మకుండు టెట్లు ? మనశత్రువుల కేమాత్రమైన నీకీలకము తెలిసినచో నీసంవిధాన మెట్లు ముగిసెడిదో యని నా కిప్పుడు భయము కలుగుచున్నది.

కళానిధి :-నారహస్యము పరమదుర్భేద్యము. నీ వన్నట్లింత చిన్నపనికి సార్వభౌముల శ్రమపెట్టు టెందుకని నేనే వారిధర్మమునుఁ బూనితిని. ఐనను శత్రువులయేఁబది మందిపదివారమునకును, రెండుపడవలకును, నే నిన్నూరుమందిపరిజనమును ఐదుపడవలను సమకూర్చి వారీయింటఁ బ్రవేశించుట కనిపెట్టి, ముందు శత్రుభటులఁ జక్రవర్తినామోచ్చాటనమంత్రముచేఁ బలా

యితులఁ జేసి, వారిపడవల స్వాధీనముఁ జేసికొని, లోపలఁ బ్రవేశించితిమి. సర్వథా శాంతవిజయము కాకున్న యుద్ధవిజయమునకున్ను సిద్ధపడియుంటిని గాని, దురాత్ముల దౌర్జన్యము సాగనిత్తు ననుకొంటివా?

ఐరావతి :-మహాత్మా ! తమచర్యలు, వీరాద్భుతశృంగార రసభరితములు. మనవైరుల కిక ముందెప్పుడైన నీవంచనము తెలిసినచో నేమిచేయుదురో కదా!

కళానిధి :-దానికి ముందుకాపు నప్పుడే వేసి యుంచితిని. ఈ సంభవము నంతను గృష్ణదేవమహిమ మను పేర నొకన వరసభరిత మైనప్రబంధముగా రచించి శ్రీరాయల వారికి రేపే సంవత్సరాదికానుకగాఁ బంపుదును. వారి కది వినోదహేతు వగుటయే కాక, ఆతంత్రజ్ఞచక్రవర్తి లీరహస్యము బయట పడకుండఁ దమముందుచర్యల నాగ్రంథములోనివాటి కనుసంధించి నడిపింతురు.

చింతామణి :-అమ్మా- మరియొకరిపిలుపు నా కంతత్వరగా స్మృతి తెప్పింపగలదా ? ఆకవిత్వము మఱియొకరికి సాధ్యమా? మొదటినుండియు ననుమానముండినది గాని, నడుమనడుమ, మాయమాటలకు మోసపోవుచు వచ్చితిని. చివఱచివఱ కంతయు దేటతెల్లముగ నుండినది.

వేదండ :-భావా! నాల్గవజాము ప్రారంభ మైనది. మన మందర మీారహాస్యము రెండవకంటివానికిఁ దెలియ కుండ మనయూరు చేరుకొనవలయును లెమ్ము!

కళానిధి :-(లేచుచు వేదండభట్టు నుద్దేశించి హానుమాన్ సింగ్! చక్రవర్తులనే యాజ్ఞాపించునంతటివాఁడ వైతివా? [అందఱు నవ్వుదురు]

ఐరావతి :-ఉచితజ్ఞశేఖరా! చక్రవర్తిగారియీారోజునాజ్ఞ లవిలంబముగా నెరవేర్ప విన్నవించుచున్నాను.

కళానిధి :-(నవ్వుచు) రాజశాసన మందఱి కనుల్లంఘనీయమే కదా!

ఐరావతి :-నరనారాయణులకు మాఁయందరినమస్సులు. అనుజ్ఞ వేడుచున్నారము. [చింతామణి యుభయుల పాదములకు నమస్కరించును]

కళానిధి :-శోభనపరంపరావాప్తి రస్తు!

వేదండ :-తథాస్తు!!!

[అందఱు నిష్క్రమింతురు]

"కృష్ణ దేవ మహిమ" యను

**చతుర్థాంకము సంపూర్ణము.**

శ్రీ శ్రీ శ్రీ

శ్రీః

# నయనామృతము

## పంచమాంకము

### ప్రథమ రంగము

స్థలము :-చింతామణిభవనమున నలంకారగృహము.

సమయము :-ఫాల్గుణశుద్ధసప్తమీ, సూర్యోదయానంతరము.

ప్రవేశము :-అప్పుడే యభ్యంగనము చేసి యెత్తైనపీఠము.

మీఁదఁ గూర్చుండి యున్న కళానిధి కలంకరించుచుఁ జింతామణి, చింతామణి కలంకారపరికరముల నందించుచుఁ బెక్కురు కళావతులు. కళానిధి పీతాంబరము నొకదానిఁ గట్టి యొకదాని వల్లెవాటుగా వేసికొని యుండును. మెడలో క్రొత్తతులసి మాల యుండును. చింతామణి కళానిధిజుట్టులోఁ గ్రొత్తనెమలిపింఛమును ముడిచి ముఖమునఁ గస్తూరి బొట్టు పెట్టి, యొడలికిఁ గంధము పూసి, హారతి నిచ్చి, పాదములకు నమస్కరించి, తేరిపారఁ

జూచి పాడును——

చింతామణి :-

ఉ. శ్యామఘనుండు వాన విలు వేసిన సొంపున శ్రీకలాపమున్
బెన్నెరిపాదునన దురిమి తీగమెఱుంగులు చుట్టువారెనా

బంగరు సేలఁ దాల్చి, తులసీవనమాల ధరించి, స్వప్నసా
క్షాత్కృతి నన్నుఁ గౌగిలె హరిన్మణిదండసువృత్త
బాహులన్ ॥

కళానిధి :-(నవ్వుచుఁ జింతామణి నుద్దేశించి) ఓహో! ఇందులకా నా కీవిచిత్రవేషము వేసి యీయాశ్చర్యా ధనాతిశయము జరిపినది ? నీకుఁ గలలో గోపికాజారుఁడు ప్రత్యక్షమై నిన్నుఁ గౌగిలించుటేమి, నేను వలదనుచున్నను మానక యీరోజున నాయిష్టము చెల్లదని నన్నదలించుచు నీ పీయడవిదొరవేసమును నాకుఁ దగిలించుటేమి ?

చింతామణి :-నాకుఁ గలలోఁ గన్పించినపరమపురుషుఁడును మీరును నొక్కరే యగుదురా; కారా యనుసంశయము దీర్చికొనుటకు ! ఒడలిరంగు భేదించినను, స్వప్నాగతపురుషోత్తమునియందు మీలక్షణములే పొడకట్టుటచే మీ కావేషము వేసి, పోల్చి చూచుకొంటిని. మీవేషధారణచాతుర్యమునుఁ గలలోఁ గూడ నవలంబించి నన్ను మోసగింప జూచిన నాకను మీమాయలోఁ బడుటకుఁ జిన్నతనమునాటి బేలను గాను.

కళానిధి :-ఐదేండ్ల కప్పుడే ప్రౌఢ వైతివి కాఁబోలు ?

చింతామణి :-సంతతకేళీవినోదులగుమీవంటికళానిధుల శిష్యరికమున ముగ్ధత్వము వదలి జ్ఞానప్రౌఢ లగుట

కైదుసంవత్సరములు గూడఁ గావలయునా ?
పూర్వము కుబ్జాదుల కెంతకాలము పట్టినవె ?

కళానిధి :-నిపుణ్యమా యని యేసీలిమందో నామెడలినిండ పట్టించి చూడకుండ నింతటితో వదలిపెట్టితి వంతియే చాలును.

చింతామణి :_ఇవ్వేళ మీపుట్టినరోజుపండుగ యని నేను మీ కమూల్యానేకసుగంధద్రవ్యములతోఁ దెల్లవా ఱకముం దభ్యంగనము చేయించియుంటచే, మీమేన మున్నుండే రంగు పూయలేదు గాని, నాయనుమా నము తీరకున్న నిప్పుడైన మానియుందునా ?

కళానిధి :-ఈనెమలితోకతో నాతల బరువెక్కుచున్నది. నీకు మనస్సమాధానము కుదిరినది గనుక, దీని నిక తీసివేసి నేను స్వేచ్ఛగాఁ దిరుగవచ్చునా ?

చింతామణి :-ఈదినమున మీకు స్వేచ్ఛ యనునది లేదని చెప్పియుంటిని గదా ? నా కపూర్వలోకైకానందాను భవము నిచ్చి వేకువనే మెళుకువఁ దెప్పించిననా శుభస్వప్నముమూలమున నిదివఱలో నిర్ణయించిన నేటియుత్సవములక్రమము కొంత మార్చవలసి వచ్చినది. దయచేసి ముందు నా కాకలకుఁ ఫలమునుఁ జెప్పుడు. నా కాకలమీదఁ దప్ప మఱి దేనిమీదను మనస్సు నిలుచుట లేదు.

(16)

కళానిధి :-చెప్పుట కేమున్నది? స్పష్టమే కదా! నీమీద శ్రీకృష్ణపరమాత్మ కనుగ్రహము కలిగినది. ఈరోజు మొదలు నీయాధ్యాత్మికజీవితమున నూతనశకము ప్రారంభ మైనది. ఇంతటినుండి నీజ్ఞానార్జన మతిశీఘ్రముగఁ గొనసాగును.

చింతామణి :-ప్రాణేశ్వరా! ఇది యంతయుఁ దమయనుగ్రహఫలము. ధన్య నైతి ని. వేడగా, వేడగా, నిన్నెళ్ళకుఁ దమజన్మదినమహోత్సవముఁ జరుపుటకు నా కీయేడు మీ రనుజ్ఞ నిచ్చుటయు, నీరోజుననే నా కీకల వచ్చుటయుఁ జూడ సర్వము తమమహిమ యని కాక నే నేమనుకొనఁ గలను?

కళానిధి :-నేను కా దనినమాత్రము నీవు నమ్మెదువా? ఈకలియుగమున స్త్రీలదే యదృష్టము. ఋషులను గోపికలుగా పుట్టుడని పంచి, యవ్వల వారికి నేర్పిన మధురభావయోగమే ద్వాపరాంతమున శ్రీకృష్ణభగవానుడు కలియుగమున కందించినసులభమార్గము. అది స్త్రీలకే నైజము. వారు పురుషసామాన్యులనుఁ గూడ లక్ష్యములుగాఁ జేసికొని, పరమపూరుషైక్యము నొంద గలరు.

చింతామణి :-ఇఁక మహిమాఢ్యు లైనకృష్ణభక్తాగ్రేసరులు దొరకినయాడువాండ్రయదృష్టము చెప్పవలయునా?

తమరీకృష్ణవేషముతో నుండగా నిక్కడనే మీామె దుటఁ గొన్ని యష్టపదులనే నభినయించుటతో నీరోజు కార్యక్రమము నారంభించుట కనుజ్ఞ వేడుచున్నాను.

కళానిధి :-అంతయు నీయిష్టమే కదా ! కానిమ్ము.

చింతామణి :-కామునిపండుగరోజులలో వచ్చినమీాజన్మ దినమునుఁ, జిత్రవిచిత్రోత్సవములతో నతివైభవ ముగా జరుపుట కనేకచోట్ల కాహ్వానముల నంపి వినోదవిద్యాసంపన్నులఁ బెక్కురఁ బిలిపించితిని. మా కులములోఁ బ్రసిద్ధకళావతులునుఁ జాలమంది వచ్చి యున్నారు. వారిలోఁ గొందఱఁదమకుఁ బరిచయము చేయఁ గోరుచున్నాను.

కళానిధి :-అవశ్యము నట్లే కానిమ్ము.

చింతామణి:-తే॥గీ వల్లకీగాత్రవీణల మేళవించి,
యొకటి నొక్కటి మించఁగ నేర్పుఁ జూపి,
"వీణాధన మ"ని బిరుదంబుఁ బడసినట్టి,
మాకులపుఁబెద్ద యీావృద్ధవారముఖ్య॥

కళానిధి :-ఔను, ఈమె ప్రసిద్ధి నేను దక్షిణదేశపర్యటనము చేసినప్పుడు వినియుంటిని గాని చూచుట తటస్థింప లేదు.

చింతామణి :-తే॥గీ॥ సరససాహిత్యసంగీతకళయందు,
సమముగా నసమాన మాప్రతిభ గలిగి

యర్థ మార్జించి ధర్మకార్యము లొనర్చెఁ
గులశిరోమణి యీ "నాగరత్న" నామ్ని ॥

కళానిధి :-ఈమెఖ్యాతి నావిద్యార్థిదశలో దేశదేశముల
మ్రోగుచుండెడిది.

చింతామణి :-సీ॥ శ్రీశైలమల్లికేశ్వరుమీఁదఁ గృతు లల్లి
ఖ్యాతి గాంచిన "గంగసాని" యీమె
ఈమె సుల్తానులఁ గనుబ్రాము రాయల
కడకు వేగునడుపు "పీరసాని"
ఈ "రంగనాయకి" నాటకరంగాలఁ
బుధులమన్నన లందు బిరుదుపాత్ర
భామకలాప మనేకసీమల నోల
లాడించు జాణ యీ "పాపసాని"
తే॥ గీ॥ తక్కువారలలోఁ బెక్కువిద్యలందుఁ
జతుర లున్నారు; వీరెల్ల మీయపూర్వ
"సత్కథాయోగ" విశ్రుతి చవులుగొల్ప
భక్తిమై మిమ్ము సేవింప వచ్చినారు ॥

కళానిధి :-వీరిసేవల నందుటకు నాయర్హత యెట్లున్నను, వీ
రందఱు వచ్చినందులకుఁ జాలసంతసము. నీప్రయత్న
బాహుళ్యము చూడ కార్యకలాప మొక్కరోజులో
ముగియునట్లు లేదే!

చింతామణి :-ఈరోజు ఫాల్గుణశుద్ధసప్తమి ; మీ రవతరిం
చిన మహాపుణ్యదినము. నేటిమొద లీపూర్ణిమవఱకుఁ

గాముని పండుగలును, మీ జన్మదినోత్సవములు నేకవాహినిగా దివ్యవిభవముతోఁ గలియుగవైకుంఠమువలె వెలుఁగొంద గలవు.

కళానిధి :-ఇన్నిరోజులు నే నిట్లు నీకట్లలో నుండవలసిన దేనా?

చింతామణి :-(నవ్వుచు) అక్కఱ లేదు. ఈనా డసలురోజు గనుకఁ గార్యకలాప మొత్తిడిగా నుండును గాని తక్కినరోజులపను లతివిరళములుగా నుండును.

కళానిధి :-ఇప్పుడు నీలాస్యముతో నారంభించు నేటికార్యక్రమమునఁ దక్కిన భాగము లెట్టివి ?

చింతామణి :-ఈ ప్రథమయామమున నా "పతిదైవారాధనము" రెండవజామున "మహాసదస్సు" అందు మీరు బ్రాహ్మణపండితులకు నితరులకు యథేచ్ఛముగా భూరిసంభావన లిచ్చి మహదాశీర్వచనము నందుట. మూడవజామున నన్నికులములవారికి "భోజనసంతర్పణము". చతుర్థయామమున, "మహేంద్రసభ". అందు మొదలు "కళాభోగదేవేంద్రుడు" లగుఁదమకు స్వర్ణాభిషేకమునుఁ, దమసమక్షమున నానాదేశాగతులలోఁ బ్రసిద్ధులు కొందఱు తమతమ విద్యలఁ బ్రదర్శించుటయు జరుగును. రాత్రిమొదటి జామునఁ దమ "కేనుగుపై నూరేగింపు"

కళానిధి :-పండితసంభావనలకునుఁ గనకాభిషేకమునకును, ద్రవ్యము నెంత వెచ్చింపఁదలచితివి ?

చింతామణి :-సంభావనలకు పదివేలవరహాలు చాలు నను కొంటిని. ఇంకనుఁ గావలసి యున్నను సిద్ధముగా నున్నవి. అభిషేకమునకు నాణెము లైనచోఁ దమ యుత్తమాంగమునకుఁ గఠినస్పర్శము కలుగు నని తలంచి, మైదుమాణుగులమేలిమి బంగారురేకులతో నైదుగకములదేవతరుకుసుమములఁ దయారు చేయించి, మైదుగఁగాళములనిండ నాయాపుష్పముల యత్తరువులఁ బోయించి, వాటిలో నాబంగారు పువ్వుల నానఁబెట్టించి యుంచితిని. సమయమున నా కుసుమములను వెండిసజ్జలతోఁ దెచ్చి భూలోకాప్సరసలు మంగళములఁ బాడుచుఁ దమ కభిషేకింతురు.

కళానిధి :-(నవ్వుచు) లోహము మృదువగుటకును, సుగంధమును గ్రహించుటకును, నీవుకనిపెట్టినయుపాయములు శాస్త్రములోఁ జేర్పఁ దగియున్నవి గాని, నీకు మీ తండ్రిగా రిచ్చినధన మంతయు నొక్కరోజుననే కొల్లఁ బెట్టిన మనభూలోకస్వర్గ మిఁక ముందు సాగుటెట్లు ?

చింతామణి :-మాజనకులు పూర్వపుఁదెలుగురాయల పూర్ణ రాజ్యమును వైభవమునుఁ దిరిగి స్థాపింపవలె నను తలంపుతో నపరిమితధనమును సమకూర్చిరి. వా రా

యుద్యమ మారంభింపకపూర్వమే ద్రోహులచేఁ జంపబడిరి. దీర్ఘయుద్ధాదులకు సరిపడువారినిధులు మనవితరణానుభవములతో పట్టిపోవునవి కావు.

కళానిధి :-అంతవిశేషమైన ధనమున్నదని బహిరంగముగా ప్రకటించుకొన్నచో, దోపిడిగాండ్రకే కాక, సమీప భూపతులకు గూడఁగన్నెఱ్ఱ కలిఁగి వారివలన నుప ద్రవములు సంభవింపవా ?

చింతామణి :-నానిధులరహస్యస్థానములు నాకుఁ గాక మ ఱెవరికినిఁ దెలియవు. ఎంతప్రయత్నించిననుఁ బరుల కగమ్య మగునట్లు గుప్తము చేయబడినది. మాతండ్రి గారికి నేను గాక వేఱుసంతానము లేకపోవుటను, వారికి నాయం దమితవాత్సల్య మగుటను, నేను చిన్నపిల్లనైనను వారియాంతర్యాశయములను నాతోఁ జెప్పుచు వారినిధులగోపనమును నాకుఁ దెలుపు చుండెడివారు. ఇప్పుడు పోతునీడడుగంటు టయే కాక శ్రీకృష్ణరాయసహస్రాక్షులపాలనభాగ్యమును తమసహావాసరక్షణములును సమకూరి యుండుటచే నా కసలే భయము లేదు.

కళానిధి :-నా కభిషేకము జేసినబంగారము నెట్లు వినియోగింతువు ?

చింతామణి :-తమచిత్తము ప్రకారము.

కళానిధి :-సౌమ్యా నీదియుఁ జిత్తము నాదియునా!

చింతామణి :-ఆత్మేశ్వరా! నాసర్వస్వసమర్పణమునుఁ దమ రెరుఁగరా? నాకుఁ బ్రాణప్రియులును, గురువును దైవమునుఁ దమరే! నాధనప్రాణశరీరాత్మలు మీవి గాని నావి గావు.

కళానిధి :-అట్లైన నానాటికి మీకులములో క్షయించిపోవుచున్న యుత్తమకళాభ్యాసమునుఁ బ్రోత్సహించి, యర్హుల కావిద్యలు నేర్పుసౌకర్యము చేర్పుచుట కాద్రవ్యమును వినియోగింపుము.

చింతామణి :-చిత్తము తమయనుగ్రహమును, హితోపదేశమును మాకులము నుద్ధరించునుగాక! ఇప్పటి కప్పుడే రెండుగడియలప్రొద్దెక్కినది. నేనిఁక నర్తకివేషమును వేసికొనుటకుఁ బోయెదను. తమరు మావాండ్రకేమైన మంచిమాటలఁ జెప్పుచుండుడు. [అని వెడలి పోవును]

నాగరత్నం :-మహాత్మా! చింతామణియొక్కయుఁ దమయొక్కయుఁ బ్రేమకళాయోగముల క్రమము నొక్కింత నిరూపింప వేడుచున్నాను.

కళానిధి :-చింతామణియుత్తమకళావతారము, ఆమెరూపలావణ్యములు మాటవైఖరి, మనఃప్రసారము, సర్వ

చేష్టలు నొప్పిదములై లాలిత్యవిలాసౌచిత్యముల నొలికించుచుండును. ఒకస్త్రీ యేలలితవిద్యనైనఁ గష్టపడి యెరువుగా నేర్చుకొన్నంతమాత్రానసే కళావతిగాఁజాలదు. నేర్చినకళను వర్తనమున నెలకొల్పునాపెయే కళావతి. **కళామయచారుశీలమే** యుత్తమజీవితము.

నాగరత్నము :-పుణ్యవర్తనమును, మోక్షవిద్యాసాధనమునుఁ బ్రశస్తజీవిత మందురుగదా !

కళానిధి :-సుందరశీల మన్ననుఁ బుణ్యవర్తన మన్నను నొక్కటే. పుణ్య మనఁ గళామయకర్మఫలము. పాప కృత్య మనఁ గళావిరుద్ధకార్యము. సుకృతమునకు ఫలము, స్వర్గజ్ఞానములు. దుష్కృతమునకు నరకాజ్ఞానములు. అజ్ఞానమువలన మోక్షము. ఇది యనేక జన్మలభ్య మగుసర్వమానవసామాన్య మైనమోక్షక్రమము. దీనికి పిపీలికామార్గ మందురు.

నాగరత్నము :-ప్రతిపుణ్యకార్యమును కళామయ మగునా ?

కళానిధి :-సందియ మేమి ? దయాసత్యశౌచాదిధర్మముల ననుసరించుటేగదా పుణ్యవర్తనము ! ధర్మమే కళ కనుకనే ధర్మశబ్దము పుణ్యార్థకము నైనది. సక్రమ పురుషార్థసాధనమున కన్నఁ గళామయనయముకలదా?

కళ యానందదాయకము కర్తకును లోకములకన లౌకికానందము నిచ్చుకర్మయే కళ.

నాగరత్నము :-చింతామణి కళాస్వరూపిణి యైనఁ దమకు యోగసిద్ధి యెట్లగును ?

కళానిధి :-ఆమెకళాకౌశల మంతయు నా కర్పించుటచేత నేను కళాలోలుఁడను. ఆమె కళావతి. ఆమెసాహచర్యము నాకు నిరంతరకళానందము నిచ్చుచున్నది. ఆయానందముతో నీజన్మముననే బ్రహ్మానందము నందుకొనుట కిరువురమును సాధనముఁ జేయుచున్నారము. మాది విహంగమార్గము.

నాగరత్నము :-ఇకఁ బ్రేమయోగ మెట్టిది ?

కళానిధి :-ప్రేమయోగ మన్నను మధురభావ మన్నను, భక్తియోగ మన్నను నొక్కటే. కళాయోగమునకును భక్తియోగమునకును, సాధనసాధ్యసంబంధము. చింతామణి నాకుఁ దనకళాప్రేమముల నర్పించుటమూలమునఁ బరమాత్మయందు భక్తియోగము సాధనము చేయు చున్నది. నే నామెప్రేమమునుఁ గళలనుఁ గృష్ణార్పణబుద్ధితో ననుభవింపుచుఁ గళలయందు నా స్వవ్యాసంగమునుఁ గృష్ణోపాసనాంగముగా నొనర్చుచు నాభక్తిని నేను వృద్ధిఁ జేసికొను చున్నాను.

నాగరత్నం :-మీ రుభయులును భూమిపై స్వర్గసుఖము లనుభవించుటన నేమి ?

కళానిధి :-ఈయుభయకృష్ణావిభాగప్రదేశమున బంగారము పండుసీలంకయే స్వర్గఖండము. ఇందు శీతాతపములు తీవ్రత లేక యెల్లవేళల సమసుఖావహాములుగా నుండును. ఈదీవిపైఁ జింతామణితండ్రిగారు పెంచి యుంచినయీతోటలే నందనవనములు. వారు కట్టించిన యీమహా భవనమే వైజయంతము.

నాగరత్నము :-నిజమే ! ఈసౌధమును నిచ్చటిపరిసరపరికరములునుఁ దప్పక స్వర్గమునుఁ దలపించును. మీ రిద్దరును దేవదంపతులై యగుదురు.

వీరసాని :-ఇట్టివిభవము సామాన్యులకుఁ గాకున్నఁ గొందఱు రాజన్యులకైననుండవచ్చును. వా రందఱును భూలోకస్వర్గము ననుభవించుచున్న ట్లెంచవచ్చునా ?

కళానిధి :_రాజాదులభోగములు నిర్వికల్పములు కావు. వారి భోగముల క నేకవిఘ్నకారణము లడుగడుగునకుఁ గలుగుచుండును. మాయిరువురకునుఁ గళాభోగమ గ్నతతప్ప వేరు పని లేదు.

నాగరత్నం :-అంతకన్నను ముఖ్యమైనభేద మున్నది. మీవంటి స్త్రీపురుషులసంఘటనము కడునరిది. మీయుభయుల యుత్తమసంస్కారములు మొదలైనయిహలోకస్వర్గానుభవయోగ్యత లితరమిథునముల కబ్బుట సామాన్యముగాఁ దటస్థింపదు.

మామహేంద్రులకు నే జరిపింప నెంచినయుదుపోత్స
వమును మీా రందఱునుం జూచి సంతసింతురుగాక !

కళానిధి :-(నాగరత్నాదుల నుద్దేశించి) కేళీభోగములతోఁ
బాటు నాక్షేమెవలన దూషణమంగళములుఁ గూడ
నప్పుడప్పుడు రుచి తగులుచునే యుండును.

నాగరత్నము :-మీాయం దిట్టియనన్యభక్తితో నుండుచింతా
మణి మిమ్ము నిందించు ననుట మేము కలలో నైన
నమ్మఁ జాలము.

కళానిధి :-నమ్మకున్న నామెనే యడుగుడు !

చింతామణి :-నేనుఁ దమకొఱకుఁ గల్పించువినోదముల కడ్డుఁ
దగులుచు, నా కుత్సాహభంగ మొనర్చి, యుడికించి,
పీడించినప్పు డెప్పుడైన నొకసారి నాకుఁ గోపము
వచ్చుట యన్యాయమా ?

నాగరత్నం :-మీా ప్రణయకలహములో ననుకొనుమాటలు
నింద లెట్లగును ?

కళానిధి :-ఎంతపెద్దమాట లనినను నింద కాదా ?

నాగరత్నము :-అంతపెద్దమాట లేమనినది ?

చింతామణి :-నేనే చెప్పెద వినుడు. నీటియంచువఱకుఁ దమా
లాదివృక్షములతో నిండినయిసుకలంకలు గలిగి యమునా

తీరమును దలపించునీ యేటిపడమటిపాయదరి నున్న మాతోటలలో నొకసాయంత్రము మే మిరువురము చాలతడవు విహారించితిమి. ఆచెట్లక్రిందఁ బగలే చీకటిగా నుండును. మేము మఱలునప్పటికి సూర్యు డస్తమించెను. దారిలో నన్ను వీరు జడిపింపసాగిరి. నేను భీతిచే వీరిచేతినిఁ గట్టిగాఁ బట్టుకొని నడుచు చుండగా, నాచేయి విదల్చుకొని పాఱిపోయి, యెంత పిలిచిననుఁ బలుకక, యెంత వెదకిననుఁ గనుపింపక వీరు నన్ను మిక్కిలి విసిగించిరి. నాకు దారి తెలియక, భయము మిక్కుట మై యేడుపు వచ్చి రోషవచనము లాడువఱకును వీరు తమ మార్జాలకేళి మానరైరి.

పాపసాని :-అప్పు డేమంటివి ?

చింతామణి :-నే ననినమాటలు వీరు వెంటనే శ్లోకముగా రచించిరి. దానిఁ జదివెదను వినుడు.

శ్లో. హ స్త మాక్షిప్య యాతోఽసి, బలా త్కృష్ణ !
కి మద్భుతం ?
హృదయా ద్యది నిర్యాసి, పౌరుషం గణయామి తే !

వీణధనం :-ఇందుఁ దూలనాడు టే మున్నది ?

కళానిధి :-ఈమెమాటలు నే చెప్పెదను వినుఁడు.

తే. గీ. పెనఁగి బలవంతముగఁ జేతిపట్టు నూడ్చి
పాఱిపోవుట ప్రజ్ఞయే ప్రాణనాథ ?

హృదయబంధముఁ దప్పించుకొని యొకింత
వెడల గల్గిన నీమగతనము మెత్తు!

[అందఱు నవ్వుదురు]

గంగసాని :-శ్లోకమునఁగంటెఁ బద్యములో విశేషార్థములు ధ్వనించుచున్నవే అపుడు మీ రేమి చేసితిరి?

చింతామణి :-ఏమిచేసిరా! నామాటలు వినఁబడినంతనే, చెట్లమాటుననుండి కిలకిల నవ్వుచు నన్ను దరియ వచ్చి, నాకు నిజముగాఁ గోపము వచ్చిన దని గ్రహించి ప్రియురాలియెడ నపరాధి యైనపురుషుడు దేవుఁడైననుఁ జరుపకతప్పనిసాంత్వనవిధులకుఁ గడంగిరి. అప్పటివీరిమాటలును, చేష్టలును గీతగోవిందములో రాధనుఁ గృష్ణు డనునయించినపట్టునుఁ బోలి యుండును గాన, నాభాగము నే నిప్పుడు పాడి యభినయించెదను. విని చూడుఁడు [అని]

## — దేశవరాళరాగాష్టతాళాభ్యాం గీయతే —

**— ముఖారిరాగం ఆటతాళం —**

వదసి యది కించిదపి దంతరుచికౌముదీ,
హరతి దరతిమిర మతిఘోరం,
స్ఫురదధరశీధవే తవవదనచంద్రమా,
రోచయతు లోచనచకోరం,
ప్రియే చారుశీలే! ప్రియే చారుశీలే!
ముంచ మయి మాన మనిదానం

సపది మదనానలో దహతి మమ మానసం,
దేహి ముఖకమలమధుపానం-ధ్రువ.
సత్య మే వాసి యది సుదతి మయి కోపినీ,
దేహి ఖరనఖరశరఘాతం
ఘటయ భుజబంధనం, జనయ రదఖండనం,
యేనవా భవతి సుఖజాతం-ధ్రువ.
త్వ మసి మమ భూషణం త్వ మసి మమ జీవనం,
త్వ మసి మమ భవజలధిరత్నం
భవతు భవ తీహ మయి సతత మనురోధినీ,
తత్ర మమ హృదయ మతియత్నం -ధ్రువ.
నీలనళినాభ మపి తన్వి ! తవ లోచనం,
ధారయతి కోకనదరూపం
కుసుమశరబాణభావేన యది రంజయసి,
కృష్ణ మిద మేత దనురూపం - ధ్రువ.
స్ఫురతు కుచకుంభయో రుపరి మణిమంజరీ,
రంజయతు తవ హృదయదేశం
రసతు రశనాపి తవ ఘనజఘనమండలే,
ఘోషయతు మన్మథనిదేశం -ధ్రువ.
స్థలకమలగంజనం మమ హృదయరంజనం,
జనితరతిరంగపరభాగం
భణ మసృణివాణి ! కరపాణిచరణద్వయం,
సరసదలక్తసరాగం -ధ్రువ.

స్మరగరళఖండనం మమ శిరసి మండనం,
దేహి పదపల్లవ ముదారం
జ్వలతి మయి దారుణో మదనకదనానలో,
హరతు తదుపాహితవికారం - ధ్రువ
ఇతి చటులచాటుపటుచాటుమురవైరిణో,
రాధికామధి వచనజాతం
జయతు జయదేవకవిభారతీ భూషితం,
మానినీజనజనిత శాతం -ధ్రువ

(పాఠాంతరము) :-[పద్మావతీరమణ జయదేవకవిభారతీభణిత
మతిశాతం - ధ్రువ]

అను నష్టపది పాడి యభినయించును. తర్వాత.

సానందం నంద సూను ర్దిశతు పరతరం సమ్మదం
కుందమందం
రాధా మాదాయ బాహో ర్వివర మనుదృఢం
పీడయన్ ప్రీతియోగాత్
తుంగౌ తస్యా వురోజా వతనువతనో ర్నిర్గతౌ
మాస్మభూతాం
పృష్ఠం నిర్భిద్య తస్మా ద్బహి రితి వలితగ్రీవ
మాలోకయంతః

అను శ్లోకమును జదువును. తరువాత,

## — విభాసరాగైక తాళీతాళాభ్యాం గీయతే —

—విభావరాగం : ఆదితాళం—

కిసలయ శయనతలే కురు కామిని చరణ నళినవినివేశం
తవ పదపల్లవవైరిపరాభవ మిద మనుభవతు సదేశం
క్షణమధునా నారాయణం
అనుగత మనుసర రాధే !!! –ధ్రువం.
కరకమలేన కరోమి చరణ మహ మాగమితాసి విదూరం
క్షణ ముపకురు శయనే నోపరి మా మివ నూపుర
మనుగతిశూరం – ధ్రువం
వదనసుధానిధిగళిత మ మృతమ మివ రచయ వదన
మనుకూలం
వరహ మి వాపహాయామి పయోధరరోధక
మురసి దుకూలం – ధ్రువం
ప్రియపరిరంభణరభసవలిత మివ పులకిత మతిదురవాపం
మదురసి కుచకలశం వినివేశయ శోషయ
మనసిజతాపం – ధ్రువం
అధరసుధారస ముపనయ భామిని ! జీవయ మృత మివ
దాసం
త్వయి వినిహితమనసం విరహానలదగ్ధవపుష
మవిలాసం – ధ్రువం
శశిముఖి ! ముఖరయ మణిరశనాగుణ మనుగుణ
కంఠనిదానం

శ్రుతియుగళే పికరుతవికలే మమ శమయ చిరా
దవసాదం - ధ్రువం
మా మతివిఫలరుషా వికలీకృత మవలోకతు మధునేదం
మీలతి లజ్జిత మివ నయనం తవ విరమ విసృజ రతి
ఖేదం - ధ్రువం
శ్రీజయదేవభణిత మిద మనుపదనిగదితమధురిపుమోదం
జనయతు రసికజనేషు మనోరమరతిరస
భావవినోదం - ధ్రువం

అనునష్టపదినిఁ బాడును. తర్వాత,

అథ సహసా సుప్రీతం, సురతాంతే నితాంతఖిన్నాంగీ ।
రాధా జగాద సాదర, మిద మానందేన గోవిందమ్ ॥

అను శ్లోకమును చదివి.

రచయ కుచయోః పత్రం చిత్రం కురుష్వ కపోలయోః
ఘటయ జఘనే కాంచీ మంచ స్రజం కబరీభరే ।
కలయ వలయ శ్రేణీం పాణౌ పదే కురు నూపురా
ఇతి నిగదితః ప్రీతః పీతాంబరో పి తథా కరోత్ ॥

అనుశ్లోకము నభినయించును. చివఱ,

యద్గాంధర్వకళాసు కౌశల మనుధ్యానంచ యద్వైష్ణవం
యచ్ఛృంగారవివేక తత్వరచనాకావ్యేషు లీలాయితం ।
తత్సర్వం జయదేవపండితకవేః కృష్ణైకతానాత్మనః
సానందాః పరిశోధయంతు సుధియః శ్రీగీతగోవిందతః ॥

అనుశ్లోకమును పాడును.

కళానిధి :-(చింతామణి నుద్దేశించి) మొదటినీస్వప్నవృత్తాంతమునకును, జివఱకు మనప్రసంగములోఁ దేలిన విహారకథనమునకును సాదృశ్య మై యుచిత మైనముగింపుగానుండునట్లును శృంగారభ క్తిరసములు వెల్లివిరియునట్లును గీతగోవిందగ్రంథాంతమును నీవు నా ప్రోలఁ బాడి యభినయించిన రసికతకు మెచ్చి, నీకలను గ్రంథస్థముఁ జేయుట రూపముగా నిన్ను బహూకరించుచున్నాను. నీపద్యమునకు నేఁ జేసిన శ్లోకము వినుము.

శ్లో. వేణీమూలే విరచితఘనశ్యామపింఛావచూడో
విద్యుల్లేఖావలయిత ఇవ స్నిగ్ధపీతాంబరేణ
మా మాలింగ న్మరకతమణి స్తంభగంభీరబాహుః
స్వప్నే దృష్టః తరుణతులసీభూషణో నీలమేఘః

చింతామణి :-జీవితేశ్వరా ! మహాప్రసాదము. దీనిశ్లోకము ముందు నాపద్య మేపాటిది ? నాభావముల నింతగా గౌరవించి, శాశ్వత మగుతమగ్రంథమున నెల కొల్పుటకంటె నా కెక్కువవిలువ గలబహుమానము లేవి యుండును ? అది యమూల్యము గానఁ బ్రియముగా శిరసా వహించుచున్నాను.

కళానిధి :-ఇప్పుడు మీ కందఱ కొకక్రొత్తవిషయము చెప్పవలసి యున్నది. ఈదినము నాలవజాముననఁ జరుగనున్న

మహేంద్రసభలోఁ జివర కొకసుప్రసిద్ధుఁ డైనయైంద్ర జాలికుడు, నాకుఁ బూర్వపరిచితుఁడు తన యద్భుత విద్యనుఁ బ్రదర్శించును. మీ రాతనిమహిమముచే నపూర్వవిస్మయావహాత్రానుభవము లేమైనఁ గలిగి నట్లుఁ దోఁచినను విషాదము నొందకుండుదురు గాక యని హెచ్చరించుచున్నాను.

పీరసాని :-అంతసమర్థ్యమహా మొనరింపఁ గలవినోదకుం డేదే శముఁవాడు? ఇచటి కెట్లు వచ్చెను?

కళానిధి :-ఆయన శతానందుఁ డనుపేరు గల ఘూర్జరదేశపు జైనపండితుఁడు. నాదేశాటనపుఁగాలముఁన వారికిని నాకును మైత్రి కలసి నేను కొన్నివిద్యల నాయనకుఁ జెప్పి వారివలన నింద్రజాలమునుఁ గొంచె మెఱింగి తిని. ఇప్పు డాయనతీర్థయాత్రలఁ జేయుచు నీదేశమున నే నున్నా నని విని నిన్ననే నన్నుఁ జూడ వచ్చెను.

రంగనాయకి :-కానిండు; కళానిధు లగు మీదర్శనమునకు సద్యః ఫలితముగ మా కొకయపురూపకళావినోదము లభించుట మాభాగ్యముగదా!

చింతామణి :-సర్వతంత్రరహస్యవేత్త లగుమీ రండనుండ మాకు మనోవైకల్య మెట్లు కల్గును? ఆవినోదము ననుభవించుఁగుతూహలము నన్నుఁ ద్వరపెట్టుచున్నది. ఆసభ కాలస్యము గాకుండఁ దక్కినపనుల సకాల

ము:న ముగించి, మన మక్కడకుఁ బోవుయత్నమున నుండుదము రండు.

కళానిధి :-(నవ్వుచు లేచి) ఇఁకను నా కీలోక యుండవలెనా?

చింతామణి :-ఈరోజున కిక దానితోఁ బని లేదు. దాని నే భద్రపఱచి, యవసర మగునప్పుడెల్ల మీకుఁ దగిలించుచుండెద నిటు లెండు (అని పుచ్చుకొనును.)

[అందఱు నిష్క్రమింతురు.]

## ద్వితీయరంగము

స్థలము :-హిమాలయపర్వతములలో త్రిజగన్నాథ మను పుణ్యక్షేత్రము సన్నిధిని "గౌరీవనము"

ప్రవేశము:-చింతామణినిఁ జేయివట్టి బలవంతముగా లాగుచుఁ "గళానిధి", కళ్ళనీళ్ళొడ్చుచు వెనుకకుఁ బెనఁగుచుఁ "చింతామణి"

చింతామణి :-(గద్గదకంఠముతో) నాథా! నేను రాను. నన్ను విడువుడు నాయాసనుగూడ వదలుకొనుఁడు. మాయక్కగారికి మఱలఁ జైతన్యము వచ్చి, నాతో రానైన రావలెను; లేదా, నేనుగూడ నామెవలె ప్రతిమగా మారనైన మారవలెను. రెండునుఁ జరుగనిచో నే నాగౌరీదేవియాలయమున మాయక్కగారి ప్రతికృతిప్రక్క నే యుపవాసములు చేసి ప్రాణములు విడిచెదను.

కళానిధి :-ఆయాలయమునకు మఱిఁ బోయిన నింకఁ గన్నను ముప్పు వాటిల్లవచ్చును ! ఈపూరు నా కేమైన సంభవించిన నిపని యే మగునో యోచించుకొనుము. మూర్ఖమార్గ మవలంబించినఁ గార్యము లేదు. శ్రీత్రిజగనాథమహాక్షేత్రమున శ్రీవిద్యోపాసకులును తపస్సంపన్నులును, మహిమాఢ్యు లగుసిద్ధులును యోగు లగుసాధువులు ననేకు లుందురు. వారిలో నెవరినైన నాశ్రయించి కామేశ్వరికి మఱలఁ జైతన్యము గలుఁగునుపాయ మఱయుదము రమ్ము !

చింతామణి :-మాఅక్కగారు లేకుండ నేను వెనుకకు రాను. మీఱు నాతో గుడికి మఱల రా నక్కఱ లేదు. మీ రొక్కరును క్షేత్రమున కేగి యాపన్నివారణోపాయముల వెదకుఁడు. నేనుమాత్ర మీవనము దాటి కదలను. నే ననేకవిధముల వేఁడఁగా వేఁడఁగా నాప్రోత్సాహముపైఁ దీర్థయాత్రలకుఁ బయలుదేరిననా బహిఃప్రాణ మైననాయక్కగారిప్రతిమ నైనను సేవించి యుండుదును గాని, వదలి రాను.

కళానిధి :-హా దైవమా ! ఎంతపనిఁ జేసితివి ? నాప్రాణప్రియల నిద్దఱిఁ గూడ నేకకాలమందుఁ గోల్పోవుగతిఁ గల్పించితివే ! హా కామేశ్వరీ ! నీపాతివ్రత్యమహిమమునఁ గదా నారోజు లింతవఱకు మహేంద్రభోగములతోఁ బ్రవహించినది ! నే నిప్పు డేమి జేయుదును ? జైతన్య

ముతో నున్నయీమెనుఁ గూడ నీ ఘోరారణ్యమున నొంటరిగా వదలి యెట్లు పోఁగలను ? ఏమిగతి? కృష్ణా నీకన్నఁ బరదేవత వేరు గానున్నదా ? ఇది నీమాయ కాదా ? నిన్నే పరదేవతారూపమునఁ బ్రార్థించెదను

శ్లో॥ మాలాబర్హమనోజ్ఞకుంతలభరాం వన్యప్రసూనోక్షితాం
శైలేయద్రవక్ఌప్తచిత్రతిలకాం శశ్వన్మనోహారిణీం ।
లీలావేణురవామృతైకరసికాం లావణ్యలక్ష్మీమయీం
బాలాం బాలతమాలనీలవపుషం వందే పరాం దేవతాం॥

శ్లో॥ లావణ్యవీచీరచితాంగభూషాం, భూషాపదారోపిత పుణ్యబర్హాం ।
కారుణ్యధారాళకటాక్షమాలాం బాలాం భజే వల్లవవంశలక్ష్మీం॥

చింతామణి :-నాథా ! మీ ప్రార్థనము నంగీకరించి యీపరదేవత ప్రత్యక్షమైనదో యనున ట్లొకయోగిని మన వంకకు వచ్చుచున్నది చూడుఁడు.

కళానిధి :-ఆమె చేతిలోని త్రిశూలము మొదలైన లక్షణములఁ బట్టి యీమె యొకభైరవీయోగిని యని తోచుచున్నది. భైరవు లని యొకజాతివిరాగుల తెగవారున్నారు. ఈమెవలన మన కేమైన నుపకారము కలుఁగ వచ్చును. ఈమెకు వందనములు జేయుదము.

[అని సమీపించినతరువాత నమస్కరింతురు]

(ఆ) భైరవి :-మిమ్ము భైరవేశ్వరుఁ డనుగ్రహించునుగాక ! సంసారు లగు మీ రిచటి కెట్లు వచ్చితిరి ? మీ రెవ్వరు ? దుఃఖించుచున్నా రేల ?

చింతామణి :-అమ్మా! మాఅక్కగారును నేనును మాయుభయులభర్తగా రగువీరితోఁ గూడ సేతుశీతనగమధ్యమున నన్నిక్షేత్రముల దర్శించి చివఱ కీయద్రిరాజదేశముం బ్రవేశించి యీసమీపమున నున్న త్రిజగన్నాథక్షేత్రమున కీయుదయము వచ్చి యచ్చట నవిచ్ఛిన్నాగ్ని గలగౌరీశంకరుల వివాహకుండము మొదలగుపుణ్యస్థలముల సేవించి, యీనాలవజామున విహారార్థముగా నీమహోన్నతగిరులరామణీయకములఁ దిలకించుచుఁ గ్రమముగా నీసుందరవనముఁ జేరి, ఇచటికి దగ్గర నుత్తరముగా నున్నకదంబతరుపుంజమధ్యమున, నిర్మలస్ఫటికశిలానిర్మితమై యచ్చెరువులు గొల్పు నొకదేవతాయతనముం గని మువ్వుర మందుఁ జొరఁబడితిమి.

భైరవి :-ఈవనమున స్ఫటికాలయమా ! ఈసమీపముననే వసించుచు నిరంతర మీవనముల సంచరించుచు నే నెన్నఁడునుఁ జూడలేదే ! తరువాత నేమి జరిగినది ?

చింతామణి :-ఆయాలయములో నవరత్ననిర్మితమహాసింహాసనముపై, మహోజ్జ్వలమైన హైమవతీహేమవిగ్ర

హోమముం దిలకించి, విస్మయభక్తిపూర్వకనతుల
నొనర్చితిమి. అంతలో దేవి కిరుప్రక్కలను రెండు
వింజామరములు గనుపింప, మాయక్కగారును నేనును
జెరియొకటిం గొని, చామరములు వీవ, మాభర్తగా
రాయెదుట నాశువున దేవీస్తవముల బాడసాగిరి.
మేము ముగ్వుర మాసమయమునఁ గొంతతడవ మ
నస్కులమై యుంటిమి. దేహస్మృతి వచ్చి చూచు
నప్పటికి మాయక్కగా రానిలచియున్నపాటున వింజా
మరము చేతనుండగనే కాంచనవిగ్రహముగా మారి
పోయినది.

[అనిబాష్పరుద్ధకంఠయై మాటలాడలేకపోవును]

కళానిధి :-మే మిద్దరము, నామెకు మఱలఁ జైతన్యము
వచ్చునేమో యని, కొంతసే పాలోహప్రతిమనుఁ
బిల్చి జూచియుఁ గదల్చి నెంచియుఁ బ్రయోజనము
గానక, విలపించి, పిమ్మట, నింకను మసలిన నేమి
కొత్తయుపద్రవములు మూడునో యని, నే నీమెను
గూడ వెడలించుకొని యిక్కడకు లాగికొని వచ్చితిని.
ఈమె తనయక్కగారిప్రతిమను వదలి రా ననుచు
న్నది. నా కేమి చేయుటకుఁ దోప కున్నది. ఆపన్నుల
మగుమమ్ము రక్షింప దేవీకల్పు లగుమిమ్ముఁ
బ్రార్థించుచున్నారము.

[అని యిరువురును మఱల నామెపాదముల
నంటుదురు.]

భైరవి :-ముందు నాకాకదంబవృక్షవాటికను, గుడినిఁ జూపింపుడు. తరువాతఁ బ్రైసంగతుల నాలోచింప వచ్చును.

చింతామణి :-భగవతీ ! ఇటునిటు [అనుచు మువ్వురు నుత్తరమునకు నడతురు. వెదకి వెదకి యావృక్షములను గుడినిఁ గానక] నాథా ! ఆగుడిదాటి మనము నూరు బారలదూర మైననుఁ బోవ లేదు గదా ! ఏల నా మహీరుహ దేవళములు మరల గన్పింపవు ? అవి యుండవలసిన చోట నీజలాపూర్ణగర్త మున్న దేమి ? ఇది మొదట నిక్కడ లేదు గదా ? అహో! ఈచోటు బహుళాశ్చర్యమయముగా నున్నదే ! అన్నా ! మా కిక నేమిగతి ?

భైరవి :-ప్రాకృతులారా ! ఇది యంతయు నాపరమ్వతకన్యకా మహిమము గాని, వే రొండు కాదు. ఈవనమునకు గారీవన మని పేరు. ఆమె తనమది మెచ్చినమహా పతివ్రతలఁ దనసన్నిధి కనేకదారుల రప్పించుకొను చుండును. తనవనము ప్రవేశించినమీాయువతిపై నామె కనుగ్రహము కలిగినది. మీా రిఁక నెంతవిచారించినను, వేయేడు లన్వేషించినను, బ్రహ్మదేవుడు ప్రత్యక్ష మైనను లాభము లేదు.

చింతామణి :-అయ్యో ! అక్కా ! నీయాకృతి నైననుఁ గళ్ళారఁ జూచుకొనుప్రాప్తి కూడ లేకుండ పోయి

నదే ! నే నింక నెట్లు బ్రతుక గలను ? నే నింక నే మొగముతో మఱల నింటికిఁ బోవుదును ? ధర్మపత్నివై ననీవు నా కనుగ్రహించిననీభర్తతో నీవు లేకుండ నే నెట్లు కాపురము చేయుదును ? హా ! క్రూరదైవమా ? స్వర్గమును మించినమాకాపురము నొక్క వ్రేటున నెట్లు భగ్నము చేసితివి ? నాకుఁ బ్రాణాధికయైనమాయక్కనుండి నన్ను విడదీయుటవలన నీ వేమి మూటఁగట్టుకొంటివి ? ఓ ! గౌరీదేవీ ! నన్నుఁ గూడ నీలోకమునకుఁ గొనిపోరాదా ! నే నేమిపాపము చేసితిని ? ఓనాథా ! నా కింక నేమిగతి ? [అని కళానిధినిఁ గౌగలించుకొని రోదించును]

కళానిధి :-హా ! కామేశ్వరీ ! న న్నెంతయన్యాయము చేసితివి ? ఈనట్టడవిలో నన్నిట్లు విడిచి పోవుదు వని కలలో నైన ననుకొన నైతినిగదా ! దైవమా ! అనుకూల్యవతి యగునట్టిసహధర్మచారిణినిఁ గోల్పోయిననాబ్రతు కింక నడవినిఁ గాసినవెన్నెలగదా ! నావిద్యలును, నాప్రజ్ఞలును, నా కింక సంతసముఁ గొల్పునా ? నాగౌరవాధిక్యములును, సంపదలును నా కేమిసుఖము నీయఁ గలవు ? నా కీప్రపంచము రుచిహీనమై శ్మశానమువలె నైనది. ఐహికలోలుఁడ నైననాకు వైరాగ్యముఁ గఱపుటకు దైవము నా కీవియోగానలము దరికొల్పఁ గావలయు, నే నింక

సన్న్యసింక సంసారమున నెట్లు చరింపఁగలను?
కృష్ణా! అట్టియుత్తమకాంతామణిని సతిగా నొసంగి
సుఖింప నీయక మఱల హరించితివేల? ఆహా!
కామేశ్వరీ! ని న్నెట్లుమఱతును?

సీ॥ తొలుఁదొల్త మనపెండ్లినాటినీనునుసిగ్గు
చూపులు లేనవ్వు లెట్లు మఱతు?
నాప్రవాసపువేడు లీవొనర్చితి వన్న
కృచ్ఛ్రవతంబు లే నెట్లు మఱతు?
లోకమెల్లరు మెచ్చ కాపురం బొప్పించు
ననసూయశీలంబు నెట్లు మఱతు?
స్ఫటికాతివిశదపావనయుష్మదీయాంత
రంగప్రవృత్తి నే నెట్లు మఱతు?

తే॥ గీ॥ మృదుమధురభాషణంబుల నెట్లు మఱతు?
ప్రేమబంధురపరిచర్య లెట్లు మఱతు?
నవతరించినముక్తిసుందరివిధంపు
శశ్వరానందమయరూప మెట్లు మఱతు?

భైరవి:-బిడ్డలారా! ఊరడిల్లుఁ డూరడిల్లుఁడు. ఊరక శోకించిన ఫల మేమి? మీముందుదారి చూచుకొనుఁడు. మీరు త్రిజగనాథమునుండి యిచ్చటికి వచ్చుటకూడ నా కాశ్చర్యముగనే యున్నది? ఆక్షేత్ర మీప్రక్కనే యున్నను దుర్గమోన్నతములును, నీరంధ్రఘనీహారనిత్యనిర్మగ్నంబులు

నగుకొండల డ్డున్నవి. మీచెలి నిచ్చటి కాకర్షించు ప్రయత్నమున నాగారీదేవియే మీకు దారి కల్పించి యుండవలెను. ప్రాకృతు లెవరైనఁ బ్రమాదమున నిచట నడుగిడుట తటస్థించిన, నిచటిసంచారవృక్షములును, సంచారశిలలును, దూరముగా గొంపోయి వదలును. అజ్ఞానమున మీరైన నట్టిశిలలను ద్రొక్కుట గాని వృక్షము నంటుట గాని జరిగినచో నిప్పుడు మీరును విడిపోవుట గలుగును.

చింతామణి :-(ఉలికిపడి) దేవీ! మా కింకను ఘోర విపత్తులు కలుఁగకముందు మ మ్మీచోటు దాటించు దిక్కు మీరు గాక ఇచట నిం కెవ్వరు గలరు? ముంచుడు తేల్చుడు మీపాలనే పడితిమి.

[అని యుభయులు నామెపాదముల నంటుదురు.]

భైరవి :-అటులైనఁ దర్వరపడుడు. అదిగో! నాకు మీరు జూపిననీటిగుంటయొడ్డున నీశాన్యపుమూల నున్న ఆపాలరాతిబండపై మీరుభయులుఁ దూర్పుగాఁ దిరిగి కూర్చుండి కనులు మూసికొని, గౌరీదేవిని ధ్యానింపుడు. మీరు కోరుకొనుచోటి కేగుదురు.

చింతామణి :-చిత్తము. అనుగ్రహింపబడితిమి. మమ్ము మఱువకుడు. సెల విప్పింప వేడుచున్నారము.

[అని నమస్కరించి గుంటకడకుఁ బోవుటకుఁ దెర లోని కేగుదురు. భైరవి రెండవప్రక్కకుఁబోవును.]

## తృతీయ రంగము

స్థలము :- చింతామణి భవనములో మహేంద్రసభాస్థానము.
సమయము :- రాత్రి రెండవయామము

ప్రవేశము :-మహేంద్ర వేషముతో సింహాసనముపైఁ గళానిధియుఁ బ్రక్కను రత్నకంబళముపైఁ జింతామణి కళానిధితొడపై కుడిచేతి నానియు ఇద్దరును నిద్రపోవుచున్నట్లు కనులు ముకుళించుకొని యుండుదురు. తెర తీసినయొకనిముషమున కులికిపాటుతో నిద్దరును కనులు తెరచి చూడగాఁ దమరు మాత్రమే సభాస్థలమున నుంటయు, దీపములు వెలుఁగుచుంటయు గోచరించును -

చింతామణి :-ఇదేమి యిక్కడి కెట్లువచ్చితిమి ? నాథా ! మన వేషములుకూడ మారినవే ! నేను పూర్వము చేయించిన యలంకారములతో నున్నయీమహేన్ద్రసభ మఱలఁ గనబడుచున్న దేలనో ! ఇది కూడ దేవీ మాయయే కాబోలు ! మనము చేరవలసినత్రిజుగ నాథమున మనపరివారము మనకొఱ కెంతపరితపించుచున్నారో ! ఇదినిజముగా మనయిల్లైనచోఁ బరిజను లొక్కరునుఁ గన్పింప రేమి ?

కళానిధి :-చింతామణీ ! నీ కింకనుఁ దెలియలేదా ? మన మెంతవఱ కనుభవించితి మనుకొనిన దంతయు వట్టి

భ్రమ. అది శంతానదునిమాయ! ఆతని యింద్రజాలము యొక్క కల్పనము. మన మెక్కడకును బోవ లేదు. ఏమియు ననుభవింప లేదు. ఇక్కడనే యుంటిమి. ఈరోజుసాయంత్రమే సభ జరిగినది. తక్కినవారు కూడ మైకము వదలి యిప్పుడే వెడలి యుందురు.

చింతామణి :-ఏమీ! మనము తీర్థయాత్రలు తిరుగనే లేదా? చాలాకాలమునుండి పోవ నెంచుచుంటి మనుట నిజమేకదా! చివఱ కక్కగా రొప్పుకొను టయు, మనము వెళ్ళుటయు నసత్యములా! అట్లైన నామెగా రిప్పుడు శ్రీకాకుళమున క్షేమముగా నున్నారా? నాథా! ఎంతచల్లనిమాటఁ జెప్పితిరి! మీవాక్కు బ్రహ్మవాక్యమై మీరు శతాయుష్కులై జీవింపుడు. ఇప్పుడు రాత్రి ఎంతవేళ యైనదో? వీలైన నిప్పుడే శ్రీకాకుళము వెళ్ళి, మాయక్కగారిని స్పృశించి, పాదములకు నమస్కరించి, కౌగలించుకొని, నోటికరవుదీఱ మాట్లాడి, వచ్చెదను. అబ్బా! నాగుండెలలో బరువు దించివేసిన ట్లెంత తేలికగా నున్నది! ఎంతయాశ్చర్యము!

కళానిధి :-నీతోడ్రుపాటు నణచుకొని శాంతపడుము. సర్వము భద్రమే కాని; మన కేకీడును లేదు. ఈరాత్రివేళ నీవు శ్రీకాకుళము పోవ నవసరము లేదు. సభలోఁ

దక్కినవా అందరి కేమి యనుభవములు కలిగినదియు మన కెవరివలన నైన నిప్పుడే తెలియును. ఆమాటలు వినిన తరువాత నీ కిదియంతయు నొకపీడకలవలెఁ దోఁచి, మనసు కూటట కలుఁగును.

చింతామణి :-మనతోఁ ద్రిజగనాథమునకు వచ్చిన పరివారములో నున్నా డని మన మనుకొనినమాకుల వృద్ధుఁడు వెంకన్న మనదగ్గరకు వచ్చుచున్నాడు. ఆతని నిక్కడ జూచుటచే మీయూహయే యథార్థ మని నా కెక్కువ నమ్మకము కలుగుచున్నది.

[ప్రవేశము : వెంకన్న]

వెంకన్న :-బిడ్డా! సింతామణీ! "మీరిద్దరూ వూరేగింపాయాసం తీరుసుకుంటూ కాస్సేపు ముచ్చటాడుకొత్తా మని, యీసాల్లోకొచ్చి సాలాసే పైంది. రాత్రి రెండుజాములు కావొత్తోంది. అలి సున్నారు, కాత్తేమన్నా తింటే తిని, ఇహరొచ్చి పడుకో మని" మీఅమ్మ మీతో సెప్పి రమ్మంది.

కళానిధి :-వెంకన్నా! ఊరేగిం పెట్లా ఉన్నది?

వెంకన్న :-బాబూ? ఏంసెప్పను! కలిగ్గవైకుంఠమల్లే వుంది. ఆమేళాలు, ఆమతాబాలు, ఆదివిటీలు, ఆబంగారపడ్డలఅంబారిలో మాపురందరరాజుగారి

పెద్దేనుఁగు మేగనాధుఁడిమీద మీారూ, ఆవైభోగం సూసి అంతా యిడ్డూరపడ్డారు బాబూ !

కళానిధి :-ఉత్సవం ఎవరికీ యేమీా కష్టం కలక్కుండా శాంతంగా జరిగిపోయినట్టేనా ?

వెంకన్న :-అవ్వాయిసువ్వా టొచ్చి ఏనుఁగు కాళ్ళల్లో దూరినప్పు డాపరవత మేమన్నా బెదురుద్దేమో నని, దగ్గిరోళ్ళు కంగారుపడి అటూఇటూ సెల్లాసెదు రయ్యారు. గాని దేవాసురయుద్దాల్లో మెదిగినఆబద్దర జాతిపెద్దగటం యేమి సెలించక ఆసువ్వని తొండంతో పట్టుకు పైకిసిరేసింది. అంతకంటె గడబిడేం జరగ లేదు బాబూ !

కళానిధి :-ఇంద్రజాలాన్ని గురిం చేమనుకొంటున్నారు ?

వెంకన్న :-ఓరిబాబో ! ఆయిందరజాలం మరీ యిసిత్తర మై పోయింది. బాబూ ! ఓళ్ళ కొచ్చినకల యింకోళ్ళకి రాలేదు. ఓళ్ళ కోళ్ళు సెప్పుకు నవ్వుకోలేక యిరగబడిపోతుండారు.

కళానిధి :-నీ కే మొచ్చింది ?

వెంకన్న ;-నాకా బాబూ ? మాగొప్పక లొచ్చిందుండి. సింతామణితో యిందరలోకానికి మేళాని కెళ్ళి తి త్తూదానంట. అక్కడ మాపెద్దమారాజుగా రగ

పడ్డారుండీ! సేతుల్నిండా దండా లెట్టుకున్నాను బాబూ! ఆతరవాత అక్కడ దిరిగి ఇక్కడ దిరిగి యిమానాలమీద యింటి కొచ్చేశాం. తరువా తూరేగింపు చూశాను.

కళానిధి :-సరే గాని, చింతామణీ, నేనూ యీరాత్రికి భోజనం చెయ్య మనీ, ఆవుపాలుమాత్రం పుచ్చు కుంటాం గనక పడకగదిలో పెట్టించు మనీ, ఐరావతితో చెప్పి నీవు వెళ్ళి పడుకో. మేమూ నీవెనకే వస్తాం.

వెంకన్న :-సిత్తం. బాబూ!

[అని వెడలి పోవును]

చింతామణి :-ఎంతాశ్చర్య మైనయింద్రజాలము! మీరు లేకుండనే యూరేగింపు జరుగు టెట్లు? ముఖ్యుల మైనమన కూరేగింపుజరుగనట్లునూ, లోక మందరికి లోకోత్తరముగా జరిగినట్లునూ భ్రమ! ఇందులో నేది నిజము, యేది మాయ? లోకమున నన్నియనుభవ ములు నింతే కదా! జగత్తే మాయ యనువేదాం తులవాక్యములు నాకిప్పుడు బోధపడుచున్నవి. సుఖ దుఃఖాదు లన్నియు మన మనస్సంచార మనునింద్ర జాలములోని యనుభవములే! వాటికి సంతసించు టయు, శోకించుటయు, నజ్ఞానమూల మని స్పష్ట మగుచున్నది.

కళానిధి :-ఈయింద్రజాలమున నాకొకవిశేషమున్నది! మనకుఁ గలతీవ్రమైనకోరికలను, గాఢచింతలను ననుసరించి యున్నది. నీతీర్థాటనకాంక్షప్రకారము మనకును వెంకన్నయాలోచనలనుఁ బట్టి యాతనికిని మనోదృశ్యములు గోచరించినవి.

చింతామణి మీమనఃప్రవృత్తినిబట్టి మీకు వేరుగా రాక నాకోరికలప్రకారమే మనకిద్దరికి మాత్ర మొకటిగానుఁ దక్కినవారికి వేరుగానుఁ గలలు వచ్చుట కేమి కారణము?

కళానిధి :-కామేశ్వరియు నీవును, మీమనస్సులు నాయందు లగ్నముచేసి, నన్ను మీతో కట్టివేసికొన్నారు. శరీరములతోఁ బని లేకుండ మనస్సంచారము చేయు నప్పుడు మీతో నేనును, నాతో మీరును, వదలక యుండుదుము. ఇందు నీమనస్సున కెక్కువప్రాధాన్య మీబడినది.

చింతామణి :-నామనోగతులు శతానందులవారి కేమి తెలి యును? ఇది మనమనస్సులస్వయంసంచారమా? ఇంద్రజాలికుని కల్పనమా?

కళానిధి :-ఇంద్రజాలవిద్యలో రెండువిధములును గలవు. మనమనస్సులబాహ్యవ్యాపారము నంతను నిద్రఁ బుచ్చి, సూక్ష్మశరీరముల స్వతంత్రముగా సంచరింపఁ

బురిగోల్పుట యొకటి, ఆసూక్ష్మశరీరముల నైంద్ర జాలికునికల్పనముప్రకారము సంచరింపఁజేయుట మఱి యొకటి.

చింతామణి :-రెంటికిని భిన్నప్రయోజనము లున్నవా?

కళానిధి :-లే కేమి? మొదటిదానివలన మనకు భూతభవిష్య త్తులు తెలియును. రెండవదానివలనఁ బ్రేక్షకునికిఁ గేవలవినోదమును, ఇంద్రజాలికునికి మనోభీష్టసిద్ధియు ప్రయోజనములు.

చింతామణి :-అట్లైన, నింద్రజాలము జ్యోతిషమువలె భావి ఫలములనుఁ జెప్పఁ గలదా?

కళానిధి :- వెనుక శతానందుఁడు నాపై మొదటఁ బ్రయోగించినయింద్రజాలములోని సూచనలప్రకా రమే నాజాతక మింతవఱకును నడచినది.

చింతామణి :-ఇప్పటి మనకల యెట్టిది?

కళానిధి :-మొదటిరకపుది. తక్కినవారికి వేర్వేరుగా వచ్చి నవి మిశ్రమములును, వారందరు మొత్తమున నూరేగింపుఁ జూచుట కేవలము కల్పితమును.

చింతామణి :-ఏమీ! మనకలలోనియనుభవము భావివిప త్తును సూచించు నందురా?

కళానిధి :-ఆఁ, సూచింపవచ్చు !

చింతామణి :-మహాత్మా ! మీయింద్ర జాలమునకును మీకును వేయి వేలనమస్కారములు ! ఈపాడు ఇంద్ర జాలముతో మాఅక్కగారికిని నాకును గలయాత్మను బంధ మెట్టిదో స్పష్టపడినది. ఆమె కేమైనఁ గీడు మూడినచో నాప్రాణములు గూడ నుండవుసుడీ !

కళానిధి :-ఆమెకును నీయెడల నట్టిసానుభూతియే కలదు. నీవు నన్నువలచి, విరహావస్థలో నున్నప్పు డామె నిన్ను జూచినంతనే నీస్థితి కనిపెట్టి నిన్ను నే నంగీకరించువఱకు బరితపించి పోయినది. మీ రిద్దరు నేకజాతినాయికలు గాకున్నను, వయోరూపగుణాదుల యందు, మీయిద్దరికినిఁ గలవిశేషసామ్యమునుఁ బట్టియే, అవ్యభిచారి యైననామనస్సు నిన్నభిలషించి యుండును. ఆమెపై నాకు గలయపరిమితానురాగమే ఆమెపోలికలు గలనినుఁ జూడగనే పొంగి నీమీదకు గూడఁ బొరలిన దనుకొందును. ఆమెవియోగము నీకే కాదు, నాకును దుర్భరమే సుమా !

చింతామణి :-ఏమైనను, మీ రీమాయలమారియింద్ర జాలమునుఁ దెచ్చిపెట్టి, కష్ట మనున దెఱుగనినా మనస్సు నంతనుఁ గలచి వైచితిరి. మాతండ్రిగారి యేనుఁగుపై వారిబంగారపు అంబారీలో మిమ్మూరే గించి, నాకన్నులకఱవుదీరఁ జూచుకొనవలయు నని

నేనువిప్పిఘూర్ణరినముచ్చట నే జూడకుంటయే గాక, అసలే జరుగకుండఁ జేయింతితిరి.

కళానిధి :-ఇదియు నానెత్తినే చుట్టఁదలచు కొంటివా ?

చింతామణి :-భోగములయందు నాకెక్కువ మక్కువ యనియు, నట్టిలోలత్వ మాధ్యాత్మికసాధనమునకు విరోధి యనియు మీయభిప్రాయ మనినేనెఱుఁగుదును. నేఁ గల్పించుభోగములు మిమ్మునే నారాధించుటకు సాధనములు. అవి మీకొఱకుఁ గాని నాకొఱకు నే నమర్చుట లేదు ఐనను వాటియందును నాకీరాత్రితో వెగటు పుట్టినది. రేపటినుండి వైరాగ్యమునే సాధనముఁ జేయుచు, నాద్రవ్యమును దానధర్మాదులకు వెచ్చించె దను. ఎప్పటికైన నీ యింద్రజాలములోనిసూచన ప్రకారము జరిగినచో మనకలయిక కూడ మాయక్క గారిజీవితాంతమువఱకే యని నాదృఢనిశ్చయముగా మీకిప్పుడే చెప్పివేయుచున్నాను. కనుక, మీరు నందుకు సిద్ధపడి యుండుడు.

కళానిధి :-చాలకఠినముగా మాట్లాడుచున్నావే ! నాపైఁ గోపము వచ్చినదా ?

చింతామణి :-కోప మెందులకు ? నామనస్సతివ్యాకులముగా నున్నది. పోయి పరుండుదము రండు.

కళానిధి :-(లేచి) ఈయుత్సవములపర్యవసానము, నీకు నాపై మనస్సు విరుగుటయు, నేను వేశ్యాలోలుఁడ నై

ఇహపరములకుఁ జెడిపోవుచున్నా నని లోక మందరు చెప్పుకొనుటయు నని రెండు తెఱఁగులుగా నుండును. కానిమ్ము లోకమునకు నిజము నిలకడమీఁదఁ దెలియఁ జేయుఁడని శ్రీకృష్ణపరమాత్మను వదలివేసి, నేను తటస్థుఁడనై చరించెదను.

నేను నొక క్రొత్తనియమమును సరస్వతీదేవితోడుగా నవలంబించెదను వినుము.

శా॥ తల్లీ ! వాణిరో ! నిన్ను దుర్జనుల మ్రోలన్
నాట్యమాడించి, యే
మెగ్గున్ సిగ్గును లేక; నాకడుపుగూనన్
నింపుకొన్నాఁడ, నా
కన్నన్ బాపి గలాఁడె ? వత్సలపు సారళ్యమ్ము
నీసొమ్ము; నన్
సైరింప గదె ! పాచితం బౌనసుతుం కృష్ణైక
నుత్యాదృతిన్॥

[ఉభయులును నిష్క్రమింతురు.]

"చింతామణి యోగ" మను

పంచమాంకము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ

ఓం

# నయనామృతము

## షష్ఠాంకము

### ప్రథమ రంగము

స్థలము :-శ్రీకాకుళమునఁ గళానిధిగృహము.

సమయము :-ఉదయమునఁ బ్రథమయామాంతము.

ప్రవేశము :- కళానిధిఅన్నలు కాశీపతిసోమయాజులును సుబ్రహ్మణ్యసిద్ధాంతియు. నావరణలో నింటి వసారాఅరుగుల మీదఁ గూర్చుండి యుందురు. సోమయాజులు గారొకయరుగుమీద మడిగా పీటమీద దర్భాసనము వేసికొనికూర్చుండుదురు. సిద్ధాంతి రెండవయరుగుమీదచాపపై గణితము వేయుచుఁ గూర్చుండుదురు.

సోమయాజి :-సుబ్రహ్మణ్యం! మనతమ్ముఁడుకళానిధి యిప్పటి కింకను రాలేదు గదా! ఈదినమున నాయనగారి తిథిప్రయోజన మెట్లు జరుగును ?

సిద్ధాంతి :-(వ్రేళ్ళు లెక్కపెట్టి) మీ రడిగినప్రశ్నమునకు లగ్నముకట్టి చూడగాఁ గార్యసిద్ధి శీఘ్రముగా నగు నని వచ్చినది.

సోమయాజి :-నిన్న జ్యోస్యము చెప్ప మనలే దోయి ! మన మిప్ప డేమి చేయవలసి యుండుననుసంప్రదింపు కొఱ కడిగినాను.

సిద్ధాంతి :-నా కేమి తెలియును ? అతఁ డింటిమొగము చూచి పదునేనుదినములకుఁ బైగా నైన ట్లున్నది. ఇదివఱకు తద్దినములకు రాకపోవుట లేదు. ఇవ్వేళ నైననురావచ్చును.

సోమయాజి :-ఆబోగముదానియింటికిఁ గబు రంపుట తప్ప మనము చేయగలిగినది యే మున్నది? అట్టియసంప్ర దాయపుపని చేయలేక నే నిదివఱ కెవరినిఁ బంప లేదు.

సిద్ధాంతి :-మనకు విరోధి యైనయీగ్రామసభాపతి యిదివర కనేకసార్లు మనవారిని మనలను వెలివేయించవలె నని చేయుచున్నకుట్రలకుఁ దోడుగా నీయాబ్దిక మస్తావి స్త మైనయెడల మన కేమి గతి ?

సోమయాజి :-సభాపతివాదములో నన్యాయము లేదు. బ్రాహ్మణునకు శూద్రస్త్రీసంపర్కము కలియుగమునఁ జెల్లునా? ఆమాట నెవ రైనఁ బై కనినచో నన్ని శాస్త్రములప్రకారముఁ దప్పలే దని మనవాఁడు కారికలు విప్పి యోడించు నని మనయూరిబ్రాహ్మ

ణులు జడియుచున్నారు గాని, మఱియొక్కడైనచో నిదివఱ కెప్పుడో మాడ్చివేసి యుండురు.

సిద్ధాంతి :-ఇప్పుడు మనకు సహాయము మన వేదన్నవలనఁ దప్ప నితరులచేతఁ జరుగదు. వాం డ్రిద్దరికినిఁ గడు స్నేహము. వా డైనచో నచటి కేగుటకును సంకో చింపడు.

సోమయాజి :-అటు లైన వానికిఁ గబురంపుదమా? వాడును మన కొకభోక్తయే కదా। ఈపాటికి రావలసినదే ! ఎందులకు రాలేదో !

సిద్ధాన్తి :-అదిగో వచ్చుచున్నాఁడు. నీకు వేయేండ్లాయుర్దాయ మున్నదిరా వేదన్నా ! నీమాటనే యనుకొను చున్నారము.

వేదన్నభట్టు :-(ప్రవేశించి) ఏమి బావా! నాతో నేమి పని వచ్చినది? ఈప్రథమయామమున భోక్తృత్వమున కింకను వేళ కాదు గదా ! కళానిధిబావ వచ్చినాడా!

సోమయాజి :-కళానిధికవకళలు ప్రజ్వరిల్లుచున్నవి ! ఆబ్దిక మడవిని గలపి మే మందఱముఁ గృష్ణలో నిల్లు గట్టుకొనురోజులు వచ్చినవి.

వేదన్న :-సోమయాజులుబావగారూ ! తమరు తొందఱ పడకుడు. శాంతమూర్తులైనతమ రలిగి, యశ్లీలములు

పలుకుట శ్రేయస్కరము కాదు. నే నతనికొఱకు నిన్న సోదరికామేశ్వరమ్మకోరికమీద వెళ్ళి కబురు చెప్పి వచ్చితిని. రాత్రికే వచ్చెద నని చెప్పి రాకు న్నను, నే నాసంగతి మీతో కదుపలేదు. ఈపూట తప్పక వచ్చును. అతడు పరధ్యానమున మఱచిననుఁ జింతామణి జ్ఞప్తికిఁ దెచ్చి పంపును. తమరు విచా రింప నక్కఱ లేదు.

సోమయాజి :-మమ్ములను, మాపెద్దలనుఁ దరింపఁ జేసితివిరా వేదన్నా ! నీపెద్దలకు వేయివేలనమస్కారములును నీ కనేకశుభాశ్వీరచనములును.

సిద్ధాంతి :-మామఱఁదలు దేవమణి యుండుటంబట్టియే మే మింతసుఖముగా గంజిఁ ద్రాగుచున్నారము. తన మొగము తిన్నగా చూడని భర్తమీద నెంత యభిమానము ! పవిత్రతయనఁగా న ట్లుండవలెను.

వేదన్న :-కళానిధిమహిమాతిశయ మామెకుఁ దెలియునంత బాగుఁగా లోకములో నెవ్వరు నెరుఁగరు.

సోమయాజి :-వేశ్యాలోలుఁ డగువాఁ డెంతపండితుఁడై నను శక్తిచేవలు కోలుపోవును గాని, మహిమాధ్యుఁ డెట్లగును ?

సిద్ధాంతి :-ఈపాడు వేశ్య మావానిపాలఁ బడి యొకదశ పూర్తి యైనది. వాని జాతకమును బట్టి శ్రీసోమగిరి

స్వాములదర్శనమునాఁడు మొదలు వానికి మహోచ్చ దినములుగాఁ గనుపడినను, నాకుఁ గూడఁ దెలియని యేపాపగ్రహవీక్షణ మున్నదో కాని యోగము తప్పుదారిని బట్టినది. ప్రస్తుతకాలమున మఱల నొక నూత్నమహాయోగము పూర్వము దానికన్న ను గొప్పది రావలసి యున్నది. అది యేమార్గమునఁ బోవునో తెలియదు. ఈజాతకఫలములకుఁ బార్వతీశాప మున్న దనుమాట వాస్తవముగాఁ గన్పట్టును.

సోమయాజి :-అంతయుఁ గర్మఫలము. మనవెనుకటికర్మ మునుబట్టి యిప్పటియోగములును ఇప్పటికర్మమును బట్టి ముందుయోగములునుఁ గల్గుచుండును. కర్మకన్న గొప్ప దేదియు లేదు.

వేదన్న :-తమ రిద్దరు నాకన్నఁ బెద్ద లగుటవలనఁ దమ మాటలనుఁ గా దనఁగూడదు గాని కళానిధివిషయ మునఁ బామరలోకమువలెనే మీరును నన్యాయమైన యభిప్రాయముఁ గలిగి యున్నారు. అతఁ డొక గొప్ప యోగి. సిద్ధావస్థకుఁ జాల సమీపమునకు వచ్చినాఁడు. చింతామణి యుత్తమస్త్రీరత్నము. వారిద్దరు నొకరి సాయమున నొకరు పైపైకిఁ బోవుచున్నారు. వారి నాక్షేపించుటకు లోకమున కర్హత లేదు.

సోమయాజి :-నీకునుఁ గామేశ్వరమ్మకును నొక్కటే వెఱ్ఱి పట్టినది. కళానిధిమీఁద నీగవాల నివ్వరు! వేశ్య

యోగిని యగుటయుఁ దనవిటుని జ్ఞానాభివృద్ధికిఁ దోడ్పడుటయు, స్వర్గమర్త్యలోకములలో సృష్ట్యాది నుండియు నిప్పటికెన్నఁడును జరుగలేదు. అప్సరసలు సైతముఁ దమవిటులపుణ్యములను హరించుటకే సృజింపఁబడినారు. భూలోకవేశ్యలు విటులపూర్వ పుణ్యఫలములైనధనాదిసంపత్తులను బీల్చివేయుదురు.

సిద్ధాంతి :-మనవానిసంగతిఁ జూడఁగాఁ దెలియుట లేదా? ఈ వేశ్యాసంపర్క మేర్పడినతరువాత సర్వశాస్త్రవ్యాసంగమునుఁ గట్టిపెట్టి శిష్యులకుఁ బాఠములు జెప్పుట మానివేసి వారి నందఱఁ బంపివేయుటయు శ్రీరాయలవారిచ్చిన, మాన్యములఁ బరామరిక నైన జూచికొనకుండుటయుఁ గనుపడుట లేదా? ఎంత యోజగద్విఖ్యాతి గలపండితుఁడై పేరుకీర్తులను ధనాదిసంపదలను గడించునని మే మందఱము సంతసించినవాఁ డీతీరున మారినది వేశ్యామహిమమున గాదా!

వేదన్న :-మీ అన్నట్లు కళానిధి చెడినాఁ డని యొప్పికొని నను జింతామణి కాతఁ డేమిధనద్రవ్యాదులఁ గొల్లఁ బెట్టినాడు. ఆమెయే తనద్రవ్యము నంతనుఁ గళానిధి కొఱకును, నాతనియిష్టముప్రకారమును, వెనుక ముందులుఁ జూడకుండ ధారపోయు చున్నదికదా?

సిద్ధాన్తి :-దానికే తరగనిధన మున్నది గనుక వీనియల్పమున కాసింప లేదు గాని, పండువంటిపండితబ్రాహ్మణుని సర్వశక్తులను హరించుట చాలదా? వేశ్యాసాంగత్యము చేసి చెడిపోవనివాఁడును; బాగుపడినవాఁడును గలఁడా?

వేదన్న :-చింతామణి గొప్పపుణ్యాత్మురాలు. మనయిండ్లలో స్త్రీలనేకమందికన్న నెక్కువపతివ్రత. కళానిధినిఁ దప్ప పరపురుషుని కలలో నైన నెఱుఁగదు. ఆమెదానధర్మములకు మితి లేదు. ఆమె త్రవ్వించిన తటాకమో, కట్టించినగుడియో, స్థాపించినసత్రమో, ఏదే నొకటి లేనిగ్రామము గాని, ఆమెసాయమున నిబ్బందిఁ దీర్చుకొననిమనిషి గలయూరు గాని యీ సీమలో లేదు.

సోమయాజి :-నిరుడు దానితల్లి చనిపోయినప్పటినుండియు, దానతీవ్రత హెచ్చినదనియు, స్వంతభూములనుఁ గూడ నర్హులకు మాన్యములుగా నిచ్చివేయుచున్నదనియు ప్రజ లాశ్చర్యముగా జెప్పుకొనుచున్నా రేమిటి? ఆస్తి నంతను దానముచేసి ముందేమి చేయును?

వేదన్న :-సంసారమునుఁ ద్యజింప నిశ్చయించుకొన్నవారికాస్తితోఁ బని యేమి?

సోమయాజి :-దాని కాపాటివైరాగ్యము ముదిరినదా ? ఎవెఱవుననైన మనవానికి దానితో వియోగము కలిగినఁ బాగుండును. మఱల మేము నలుగురిలోఁ దలయెత్తుకొని తిరుగఁ గలుగుదుము.

వేదన్న :-కాశీపతిబావగారూ ! ఈరోజున మీనోటివెంట నశుభవాక్కు లవశముగా దొర్లుచున్నవి. మన మెక్కడకు విసరిన, నెక్కడకుఁ బోయి తాకునో యెవ్వరెరుఁగుదురు ? పాప మాచింతామణి మీ కేమియెగ్గొనర్చినది ?

సిద్ధాన్తి :-అపకీర్తికన్న నెక్కువయపకార మేమి కావలెను ? మావాని నెప్పుడు దనయింటనే కట్టివేసి యుంచుటచే వాడక్కడనే తినుచున్నాఁడనియుఁ ద్రాగుచున్నాఁడనియు సాటిబ్రాహ్మణు లందఱు గేలిసేసి బహిష్కరింపఁ బ్రయత్నించుటవలన మేము పడుకష్టములును నపకీర్తియుఁ జాలవా ? ఆతనిభార్య యనుభవించు ననాదరణము చాలదా ?

సోమయాజి :- పరిశుద్ధ మైననిరతాగ్నిహోత్రులకుటుంబ మీనాటికిఁ గర్మభ్రష్టులై, జాతిబాహ్యులై పోవలసినగతి పట్టినది ! వాఁడీపూట వచ్చినను రాకున్నను బ్రాహ్మణు లిఁక నెక్కువకాలము వానిచర్యలు సహించి యూరకొనరు.

వేదన్న :-కళానిధిని బహిష్కరింప నెంచువారు మహాపరిశుద్ధులా ? వారిలో నైదేండ్లక్రింద నాతనిజన్మదినోత్సవమునాడు చింతామణి తనయింటఁ జేయించిన విందులోఁ గుత్తుకఁబంటిగాఁ గుడిచి రాని బ్రాహ్మణుఁ డెవ్వఁడు ? భూరిసంభావన లిచ్చుచో నేకూటికైనను సిద్ధ మగుఁగక్కురితి మనబ్రాహ్మణుల కేర్పడుటచేఁ దక్కినకులములకు మనయందు లక్ష్యము తగ్గుచున్నది. కళానిధిభార్య ననాదరించుచున్నాఁడని మీ రనుకొనుచున్నారా ? ఆమెకూడ నట్లనుకొనుచున్నదా? ఆమె యెంతమాత్ర మట్లనుకొనుట లేదు ! భర్త యాధ్యాత్మికసాధనమునకుఁ దనకన్నఁ జింతామణి యెక్కువయుపయుక్త యని యంగీకరించి, యాతని నామెకు సమ్మతముగా నప్పగించినది. అతఁడును భార్యయెడ నధికగౌరవానురాగములు గలవాఁడు గాని విరక్తుఁడు గాఁడు.

సోమయాజి :-వానివాదశక్తి నీకుఁ గూడ నోంటబట్టినది. ఆరునెలలసహవాసముఁ జేసిన వారు వీ రగుదు రను సామెత యబద్ధము కాదు. వాని **వేశ్యాయోగము** నీకుఁ దెలియవలెను గాని మాకుఁ దెలియదు.

[ తెరలో ] శ్లో. అగ్రే సమగ్రయతి కామపి కేళిలక్ష్మీ
మన్యాసు దిక్ష్వపి విలోచన మేవ సాక్షి

హా? హన్త! హన్త మథ! దూర మహో! కి
మేతత్ ?
అసీ త్కిశోరమయ మంబ జగత్త్రియం మే ?

శ్లో. విశ్వోపప్లవ శమనైక బద్ధదీక్షం
విశ్వాస స్తబకితచేతసాం జనానాం !
పశ్యామః ప్రతినవకాంతి కందళార్ద్రం !!
పశ్యామః పథిపథి శైశవం మురారేః ॥

(వీటికిఁ దెనుఁగు)

శా. ఆహా! నాయెదుటన్ ప్రదర్శితము నిర్వర్ణ్యప్రభాలోలఖే
లాసర్వస్వ మయారె! తక్కడలందు న్నిండి ప్రత్యక్షమౌ;
వహ్వా? మూరెడుచేరువయ్యె! యిపు డేగెన్ దూర మమ్మక్క యే
మీ యీచిత్రము! ముజ్జగంబు శిశుపూర్ణం బయ్యె నా కియ్యెడన్.

తే. గీ. భక్తివివశాత్ము లౌ జను లెట్టియిడుమ
లొంద కుండఁగ బ్రతినవట్టినమురారి
చిఱుతరూపము గన్పట్టె నన్నిదిశలఁ
గ్రొత్తక్రొత్తవిలాసముల్ గోచరించు.

వేదన్న :-మీ రాక్షేపించినయోగ మెట్టిదో వినుఁడు. అత
నికి దిక్కు లన్నియు దారి యంతయుఁ గృష్ణమయ

ములుగాఁ గన్పించుచున్నది. అట్టివాఁ డెట్టిస్థితిలో నున్నాఁడో గ్రహింపుడు.

[ప్రవేశము : కళానిధి స్నాతుఁడై, తడిబట్టలతోఁ బ్రవేశించి యన్నగార్ల పాదము లంటి నమస్కరించి వేదన్నభట్టును వీవుఁ జఱచి లోని కేగును]

సోమయాజి :-(మెల్లగా) వేదన్నా! వచ్చినవాఁడు రానే వచ్చినాఁడు గాని యీరాత్రికి మాత్రము మఱల దానియింటికిఁ బరుగెత్తకుండ నాపుము. ఈరోజున స్త్రీసాంగత్యము జరిగినచోఁ బితృదేవతలకు వచింప రానియపచారము వాటిల్లును.

వేదన్న :-అతనికిఁ దెలియనిధర్మములు లేవు. ఒకవేళ నెందులకైన నక్కడ కీరాత్రి వెళ్ళినను నట్టియప చారమునుఁ జేయఁడు. అతనిని గ్రహశక్తి జ్ఞానవైరాగ్యములు మీ రెరుఁగరు. మీ రనుకొనునట్టిమోహా చపలుఁడు గాఁడు.

సిద్ధాంతి :-వాని దీలోకపుఁజూపుగా గన్పించుట లేదు. వాని జాతకమున నాధ్యాత్మికయోగకాలముకూడ సమీపించినది. ఏమిగా మాఱ గలఁడో తెలియదు.

సోమయాజి :-మన మిఁక నాబ్దిక ప్రయత్నములు చేసికొన వలెను. పాత్రలు దొన్నెలు చూచుకొందము. రండు

[అందఱు నిష్క్రమింతురు]

## ద్వితీయరంగము

స్థలము : చింతామణి గృహములో మూడవయంతస్తుమీఁద
బడకగది.

సమయము :- అర్ధరాత్రము

ప్రవేశము :-మూసినగదితలుపులకలుపలఁ దడిబట్టలతో
రక్తమయముగాఁ "గళానిధి" ప్రవేశించి,
తలుపుఁ గొట్టి, "చింతామణీ! చింతామణీ"!!
యని పిలచును. చింతామణి లోపలనుండియే
మాట్లాడును.

చింతామణి :-నాథా ! మీరిప్పుడు పిలిచి నాప్రాణములు
గాపాడితిరి. ఈ యర్ధరాత్రమున నిక్కడి కెట్లు వచ్చి
తిరి ? నే నీరాత్రి రావల దని చెప్పినను నన్నుఁ బ్రతి
కించుటకు శ్రీకృష్ణభగవానుఁడే మిమ్ముఁ బంపి
యుండును. మీరు పిల్చునప్పటికి నే నొకఘోరమైన
కలలో నుంటిని. నన్నొకక్రూరసర్పము కవ్వించి,
భయపెట్టుటచేతనే సగముచంపి, చివఱకుఁ గఱచి
నట్లును, ప్రాణములు పోవుచున్నట్లును, మరణబాధ
నను భవించు చుంటిని. అంతలో మీపిలుపు వినఁ
బడి మెళకువ వచ్చి బ్రతికితిని. ఇదిగో వచ్చి తలుపు
తీసెదను. ఇంకను గుండెలు కుదటపడ లేదు.

కళానిధి :-నావితడిబట్టలు, కృష్ణయీదివచ్చితిని. పొడిబట్టలను దీపము నిటు తెమ్ము. నీళ్ళోడుచు నేను లోపలకు వచ్చుటకు వీలు లేదు.

చింతామణి :-[తలుపు తీసికొని దీపము నొకచేతను, పొడిబట్టల నొకచేతనుఁ బట్టుకొని వచ్చి, కళానిధివైపు జూచి] ఇదేమి మహాత్మా! మీయొడలంతయు రక్తముగా నున్నదే! ఎవరితోనైన యుద్ధము చేసి గాయపడితిరా? అయ్యో! సేవకులఁ బిలుతునా? ముందు గాయ మెక్కడనో చూపుడు. కట్టు గట్టెదను.

[అని గుడ్డ చింపఁ బోవును]

కళానిధి :-(శరీరము చూచుకొని) నెత్తురా! నెత్తు రెక్కడిది? నే నెవరితోడనుఁ బోట్లాడలేదే! నా కేమియు గాయము తగిలినట్లుకూడ నాకుఁ దెలియదు. నీళ్ళలో న న్నేమియుఁ గరువను లేదు. [అని దేహముమీఁద రక్తమునుఁ దుడిచి యొడలు తడిమి చూచుకొనును]

చింతామణి :-గాయము లేకున్న నింతనెత్తురు మీమీఁద కెట్లు వచ్చినది? మీ రీమేడపై కేదారిని వచ్చితిరి?

కళానిధి :-అడుగుభాగమున నెంతపిలిచిన నెవ్వరునుఁ బలికి తలుపు తీయలేదు. అప్పుడు మొదటియంతస్తునుండి యొకమోకు క్రిందికి వ్రేలాడుచుఁ గనుపింపగా నెగిరి దానినిఁ బట్టుకొని మేడమీఁదికి ప్రాకితిని. అది

గట్టిగానుండి పైన బిగిగాఁ గట్టఁబడియుండుటచే నాబరువునకుఁ జెటజెటలాడినను, నన్నాపఁజాలినది. తరువాత, మేడమీఁదిమెట్లతలుపులు తీసియే యుండుటచే నొకయంతస్తునుండి యొకదానిమీఁది కెక్కి యిక్కడకు వచ్చితిని.

చింతామణి :-మేడమీఁదినుండి క్రిందికి వ్రేలాడుత్రాటినిఁ దీయకుండ సేవకులును నేనును బ్రమత్తుల మైయుంటిమా ? ఆత్రాటిమీఁదుగ దొంగలు వచ్చినను రావచ్చును గదా ? అసలక్కడ త్రాటి నెవరు గట్టిరి ? ఎందులకుఁ గట్టియుందురు ? కృష్ణమందిరమున సేవకునే నీసాయంత్రము పోయినప్పుడును, వచ్చినప్పుడును, నా కాత్రాడు కన్పింపలేదే ! నేలమట్టమున కేగి, మీకుఁ ద్రాడు దొరకినచోటివద్దనుండియుఁ జూచికొని వత్తము రండు.

[అని యిద్దరును క్రింది కేగుదురు. అడుగున మొదటిసోపానముపొడుగునఁ జూరుక్రిందుగ దక్షిణమునకు దీపముతో ముందుఁ జింతామణియు, వెనుకఁ గళానిధియు, నడచుచుఁ బదియడుగులు వేసినతరువాత, "అమ్మో ! పాము ! పాము !" అని చింతామణి వెనుకకుఁ దిరిగి కళానిధిచాటునఁ దాఁగును. కళానిధి దీపమందుకొని, చూడగా నక్కడనెత్తురుమడుగుతోఁ జచ్చి పడియున్న పెద్ద త్రాచుపాము కనబడును.]

కళానిధి :-ఈపాము చచ్చిపోయినది. ఎంతపెద్ద త్రాచు ! ఎట్లు చచ్చినదో ! ఒడలంతయుఁ బిగిలి యున్నది. అందు వల్లనే యింతరక్తము కారినది. ఏజంతువో సాగ లాగగాఁ జచ్చియుండును. పామునకుఁ గాళ్ళు లేకున్నను, నేలకుఁ గాని మఱిదేనికి గాని కఱచుకొన్న చో నొడలిప ట్లెక్కువ ఎంత లాగినను దెగియైనఁ బోవును గాని పట్టు వదలదు. దీని నేదో పట్టి గుంజగా నొడలు పగిలి యెముకలు పట్లూడి చచ్చినది.

చింతామణి :-(దగ్గఱకువచ్చి) అమ్మో నాకలలోఁ గనఁబడి కఱచినసర్ప మిదియే నాథా ! మీరు త్రాటితోఁ బై కెక్కినచో టెక్కడ ?

కళానిధి :-సరిగా నీసర్ప మిప్పుడు పడియున్నచోటునుండియే యెక్కితిని. నే నెక్కిన త్రాడు కనపడదేమి ? గోడ పొడుగునను నెత్తురుచార లున్నవే. ఈపాము పై కెక్కుచుండఁగ నేదియో క్రిందినుండి లాగుటచేఁ జర్మము పగిలి, యీగోడవెంట రక్తము కారి చివఱకుఁ జచ్చి క్రిందఁ బడిపోయినది.

చింతామణి :-ఆత్రాడు మనము మేడ దిగివచ్చునంతలో నే మగును ? త్రాడులేకుండుటయు గోడమీద రక్తము కారుటయు మీయొడలినిండ, గ్రొన్నెత్తురుండుటయు, మీ రెక్కినచోట సూటిగా నీపాముపడియుండుటయు

జూడ మీరే ఈపామును ద్రాడనుకొని పట్టుకొని యొక్కుటచే నది యెముకలు విరిగి చచ్చినది. నన్నుఁ గఱవవచ్చుచున్న యీపామును జంపి మొదటఁ బ్రత్యక్షమృత్యువునుండియుఁ, గలలో భయముచేఁ జచ్చుచున్న నన్ను నిద్దుర లేపి స్వప్నమరణము నుండియు రెండుసార్లు నన్నీరాత్రి మీరు బ్రతికించితిరి.

కళానిధి :-నా కేమియు దెలియదు. నీ వనిన రెండుపనులును నే నెంతమాత్రమును బుద్ధిపూర్వకముగఁ జేయ లేదు. నా కీజీవితములో రజ్జుసర్పభ్రాన్తిమూల మైన నిర్నిమిత్తభయము వదలి సర్పరజ్జుప్రమాదము గలిగినందువలననే నా కితరులమరణము నాపుమహిమ మేర్పడినచో నాప్రమాదము కూడ వదలిన నింక నెట్టిశక్తులు వచ్చునో కదా!

చింతామణి :-నాథా! ఎంతసాహసము చేసితిరి? ఆసర్పము మి మ్మేమాత్ర మైన ముట్టుకొన్నచో మన మందఱ మేమయ్యెడివారమో కదా?

కళానిధి :-శీఘ్రమున శుద్ధ వైరాగ్యము నవలంబించి, సంసారమునుఁ ద్యజించి విడిపోనున్నవారి కొకరి మరణమువలన నొకరికి శోకమును, ననుమరణ వాంఛ యు నెందులకు?

చింతామణి :-అట్టిస్థితి యెప్పటికో వచ్చునని కలిసియున్నంత వరకు సంబంధమూలము లైనభావములుకలుగకుండ మానునా ?

కళానిధి :-నీమాటలు పెండ్లిముందా, వెట్టిమానుటముందా యనుతర్కము ననుసరించుచున్నవి. సంసార లాంపట్యము నశించినఁ గాని సన్యసించుట కధి కారము లేదు. సంసారమున నున్నంతవఱకు లాంప ట్యము వదలదు. అదికాదు సిద్ధాన్తమునకు దారి వైరాగ్యమును సాధ్యమైనంతవఱకు సంసారమున సాధనము చేసి చివఱకు, ధైర్య మవలంబించి సంసార మునుఁ ద్యజించిరఁ గాని, వాసనారూపము లగు సూక్ష్మబంధములు వదలవు.

చింతామణి :-అసలు మీ రిక్కడి కెట్టిగాఢనిశీథమున మహా నది కడ్డముపడి రావలసినతొందర యేమి కలిగినది ఎంతయాత వచ్చినను మొసళ్ళు మొద లగునుపద్ర వము లనేకములు బాధింపవచ్చును గదా ! మాయ క్కగారిసందేశము ప్రకారమును, నామనవిప్రకార మును మీరు రేపుసాయంత్రమువఱ కక్కడ నుండున ట్లొప్పుకొనియు వాగ్దానము నేల యుల్లంఘించితిరి ?

కళానిధి:-నాకీయునమయముండుటచే నీదృష్టధ్యానము తీవ్రమై దూరదూరముగాఁ గృష్ణదర్శన మగుచుఁ బోవుచు

వచ్చినది. కాని స్పర్శసాన్నిధ్యమును, నిలుకడయు లభింపలేదు. నడుచుచున్నను, కూర్చున్ననుఁ గనులు మూసిననుఁ దెఱచినను, నంతటనుఁ గృష్ణచాపల్యకేళి కనుపడుచున్నది. అన్నలవెనుక ననుకరించుతద్దినము గనుక నాపరధ్యానము బయటఁబడలేదు. గాని, యాబ్దికసమయమున నేమి చేసితినోఁ నాకుఁ దెలియదు. రాత్రి కొంతసేపు పాదసంవాహనముఁ జేయుకామేశ్వరితో ముచ్చటించి పరుండినతరువాత నాకు నిద్ర పట్టక కృష్ణుని నిలిపి పట్టుకొనవలె నని యాశ కలిఁగి యందులకు నీకళాపూర్ణ సహాయమును మనమందిరములోని సుప్రతిష్ఠితకృష్ణబింబలక్ష్యమును నవలంబించినఁ గార్యసిద్ధి యగు నని తోఁచి యందఱు నిద్రించుచుండగనే లేచి కృష్ణ నీది వచ్చితిని. నదిలో మకరగ్రాహముపంటియాపద యేదైన వాటిల్లినఁ గృష్ణుడు హస్తగతుఁ డయ్యెడివాఁడు. కాని యుపాయముగాఁ దాటి వచ్చితిని. సర్పబాధను నాకుఁ దెలియకుండగనే తప్పించినాడు!

తే॥ సీ॥ ఎట్టియెడ నెట్టియిక్కట్టు నన్నుఁగొట్టఁ
బసివలపువాఁడు కనికరమొలుకుఁ గడలి
చిన్నికృష్ణుఁడు సోగనేత్రముల నిండ
నన్నెఁ జూచుచు డాసి యోదార్చు నోకొ!

శ్లో॥ కదాను కస్యాంను విపద్దశాయాం
కైశోరగంధః కరుణాంబుధి ర్నః ।
విలోచనాభ్యాం విపులాయతాభ్యాం
వ్యాలోకయిష్యన్ విషయీకరోతి ॥

కృష్ణా ! దగ్గరకు రావూ ? నిన్నుఁ బట్టుకొనకుండ వదలను సుమా !

చింతామణి :-అట్లైన నీరాత్రి నిద్రలేకుండ మందిరములో మీాయిష్టమువచ్చినవిధమున భజనము సల్పుదుము గాని ముందు మీారు కృష్ణలో నొడలిర క్త మంతయు బోవునట్లు స్నానముచేసి యీాపొడిబట్టలఁ గట్టు కొనుడు. ఆపదలఁ గోరుకొనకుండఁ గృష్ణుడు సమీా పగుఁడు కాఁడా ? తీరి కూర్చుండి నిర్నిమి త్తముగ నాపదలఁ దలపెట్టుట యశ్లీలముగదా! నాథా మీాకు మ్రొక్కెదను గాని విపత్ప్రసంగముచే నన్ను భయ పెట్టకుడు. నేను సహింపలేను, నా కీరాత్రి యనుభవ ములతోఁ జాలనీరసముగా నున్నది.

[కళానిధి కొంచెము పెడగా నుత్తరదిశకు వెళ్ళి స్నానము చేసి బట్టలు కట్టుకొని వచ్చును.]

కళానిధి :-కృష్ణానదిలో నేదిమో వడిగా నీదుచు మఱియొక జంతువుతోఁ బెనఁగలేక శ్రమపడుచున్నట్లు ధ్వని విన వచ్చుచున్నది. కొంచెము నిదానించి చూచుదము.

అదిగో ! మనిషియే ! తొందఱగా నీదుచు మనదిక్కు-
నకే వచ్చుచున్నాడు. అది వేదన్నభట్టుబావయీత
వలె నున్నది. అవును, నంతసూటిగా మఱియొక
రీదలేరు. అతఁ డిప్పు డిట్లీదుకొని వచ్చుట కేమి
కారణమో కదా !!!

[ప్రవేశం మెట్లు నెక్కుచు వేదన్నభట్టు]

కళానిధి :-బావా ! నదిలో నెవరితోడనో పెనఁగి శ్రమపడి
నట్లు తోఁచుచున్నది. ఆయాసపడితివా ? శ్రమము
తీర్చుకొనుము !

వేదండ :-(రోజుచు) ఈరాత్రి యకాలమృత్యువు సర్వత్ర
స్వేచ్ఛావిహారము చేయుచున్న ట్లున్నది. మొసలి
వాతఁ గొయ్యఁగొట్టి చావు తప్పించుకొని వచ్చితిని
నేను సౌలభ్యముకొఱకును, వేగముకొఱకును దెప్ప
కొయ్యపై నీదుచు వచ్చుచుండ నొకపెద్దమొసలి
నావెంటఁ బడి, నే నెన్నివిధములఁ దప్పించుకొనఁ
జూచినను, వదలక, నన్ను సమీపించినది. దానినిఁ
గడచి పోవుమార్గముఁ గానక, దగ్గరకు రానిచ్చి
నన్నుఁ బట్టుకొనుటకుఁ దెఱచియుంచిన నోటినిండఁ
దటాలునఁ దెప్పకొయ్యను దూర్చి బలముగా
నదిమితిని. ఆ జంతువున కేదైననోటఁ బడగనే దవ
డలు మూసికొని పండ్లొకదానిసందున నొకటి కఱచు

కొనిపోయి, మఱల నోరుఁదెఱచునప్పటికిఁ జాల కాలము పట్టును. నాదెబ్బతో నది చావకున్నను, మఱలనోటిని, దెఱచి చాలలోతుగాఁ దిగినకొయ్య నంతను వెలికిఁ గ్రక్కి మఱల నాకొఱ కీరాత్రికి రాలేదు. ఆపదపై నాపదవచ్చును గాని సుఖము రాదు గదా !

కళానిధి :-నీ విప్పు డెందుల కిట్లు వచ్చితివి ? నీకుఁ గలిఁగిన మొదటియాపద యెట్టిది ?

వేదండ :-మొదటియాపదయా ? నీసంబంధ మైనదే ?

చింతామణి :-ఏమిస్వామీ! ఏమియాపద ? మాయక్కగారు సుఖముగా నున్నారా ?

వేదండ :-ఆమె యెచ్చట నున్నను స్వస్థురాలే !

చింతామణి :-"ఎచ్చటనున్న" నేమి ఇప్పు డింట లేరా !

వేదండ :-లే... దు... గౌరీలోకమున... కేగిన... ది.

చింతామణి :-హా ! కృష్ణా! [అని అఱచి గుండెలు పట్టుకొని తూలిపోవును. కళానిధి యామెనుఁ బడకుండఁ బట్టు కొని మూర్ఛఁ జెందినయామెను గోడ కాన్చి, మెట్టుపై గూర్చుండఁ జేసి, కృష్ణాజలములు ముఖమున నద్దుట మొద లగుశైత్యోపచారములు జేయును].

వేదండ :- బావా ! ఎంతవిపత్తు సంభవించినది ?

కళానిధి :- శ్లో. సంసారే కిం సారం ? కంసారే శ్చరణ
కమలపరిభజనం
జ్యోతిః కి మంధకారే ? యదంధకారే
రనుస్మరణం ॥

తే. గీ. సార మున్న దె కాలుసంసారమందు ? వేరు
కంసారిభజనమ్మ దక్క-
నంధకారమ్ము బాప దీపమ్ము కలదె ? యంధకారాతి
సారెకుఁ జీరుకంటె ॥

[చింతామణి కన్నులు దెఱచును]

వేదండ :- బావా ! నీవు పైబట్ట పఱచుకొని యొంటరిగా మీాయింటిపై టివసారామీాదఁ బరుండి యుండగాఁ గామేశ్వరమ్మ నీతోఁ గొంతసేపు మాట్లాడి వెళ్ళి లోపల పడమటింట స్త్రీలందరితోపాటు పరుండినదఁట. రాత్రి రెండు జాములు దాటినతరువాత నామెకుఁ దగ్గరగాఁ బరుండియున్న సోమిదమ్మగారు కామేశ్వరమ్మ నెందులకో లేపుటకుఁ దాకగా నొడలు చలువ కాడమై కొయ్యబారినట్లు తోచినదట! ఎంత లేపినను లేవనందున నామె తక్కినవారినిఁ బిలచినదఁట ! అప్పటికే ప్రాణములు పోయినవఁట! వైద్యులు వచ్చి సర్పమరణ మని నిశ్చయించినారు. సర్పము నెవ్వరుఁ జూడ లేదు. ఎప్పుడు కఱచినదియు నెఱుగరు. నీ వెప్పుడు వెడలినదియు నెరికిఁ దెలియదు.

కళానిధి :-కామేశ్వరి నాతో ననినంతయుఁ జేసినది. నీవు చెప్పినచోట నేఁ బరుండి యుండగా నామె నావద్దకు వచ్చి పాదసేవఁ జేయుచు జింతామణింగూర్చియు నన్నుగూర్చియుఁ గుశలప్రశ్నము లడిగినది. మాకు వైరాగ్యమందు, ప్రీతిమెం డగుచున్నదనియుఁ గొలదిలో సంసారమునుఁ ద్యజింతు మనియు జెప్పితిని. దాని కామె మాకన్నముందే తాను గారినిఁ బ్రార్థించి మేము తనువులు చాలించి వచ్చువఱకుఁ దాను గారీసాన్నిధ్యమున నుండుదు నని ప్రత్యుత్తరము చెప్పినది.

చింతామణి :-[కెవ్వున కేకవేసి]

చం. అడుగడుగో త్రిలోకసరసంబులు భూషణ
భూషణంబులున్
గనఁగనఁ జల్వలం బరపునట్టివి, దివ్యవిలాసచంచలం
బులు; గతిలేనివారినిలయంబులు, నద్భుతదాయ
కంబు తా
పదముల నాడుచున్ సలయవేణువినోది విభుండు
వచ్చెడిన్ ॥

[అని పాడి, సమాధిస్థితిలోఁబడును]

కళానిధి :-[వేదండభట్టుతో] చింతామణికి మర్భరదుఃఖ సమయమునఁ గృష్ణసాక్షాత్కార మైనది. ఎంత మనోహరదృశ్యము! దానిని శ్లోకరూపముగా కూర్చెదను.

శ్లో. త్రిభువనసరసాభ్యాం దీప్తభూషాపదాభ్యాం
దృశిదృశి శిశిరాభ్యాం దివ్యలీలాకులాభ్యాం।
అశరణశరణాభ్యాం అద్భుతాభ్యాం పదాభ్యాం
అయ మయ మనుకూజద్వేణు రాయాతి దేవః ॥

ఇడుగో! నాకునుఁ గనుపించుచున్నాఁడు!

ఉ. చల్లదనంబు రెట్టిలుమనోరమభావము నూనుమోము జా
బిల్లి వెలుగంగ, వేణుసరణిన్ వెలివారుసుధాఝరంబున
న్జీవము వోయుచుం గనులకుంగలఁ దోఁచె మదీయ వాగ్విహా
రాస్పద మస్మదీయసుకృతస్మయసీమ! మురారి! బాపురే!

[శ్లో. మాధుర్యేణ ద్విగుణశిశిరం వక్త్రచంద్రం వహన్తీ
వంశీవీథీ విగళదమృతస్రోతసా సేచయన్తీ
మద్వాణీనాం విహరణపదం మత్తసాభాగ్యభాజాం
మత్పుణ్యానాం పరిణతి రహో! నేత్రయో స్సన్నిధత్తే ॥]

[అని పాడి కళానిధికూడ సమాధ్యవస్థం బొందును]

వేదండ :-(స్వగతము) వీ రిద్దఱునుఁ జైతన్యవిహీనులవలె నిశ్చేష్టు లైనారు. సమాధిస్థితి యన నిదియేకాఁబోలు? నా కీగొడవ యేమియుఁ దెలియదు. కృష్ణా! నీభక్తుల నీవే కాపాడుకొనుము.

[ప్రవేశము : వేదండభట్టునకు వెనుక సోమగిరి]

సోమగిరి :-(వేదండభట్టుపీఁపుఁ జఱచి) వేదన్నా! వీరి కేమియు భయము లేదు. నాబిడ్డలిద్దఱు నుత్తమస్థితికి వచ్చినారు. వీరికిఁ బైదారిఁ జూపుటకే వచ్చితిని.

[వేదండభట్టు వంపనములును, స్వామి నారాయణ స్మరణలును జేయుదురు]

కళానిధి :-(సమాధి విడి కనులు తెరువగనే)

చ॥ సుముఖుఁడు సుప్రసన్నుఁడు కృపాపరిపూర్ణుఁడు
రాజవక్త్రుఁడా
మురళిధరుండు కట్టెదుట డిగ్గి సుధామధురప్రణాదని
ర్గళిత సమాధిబంధపరమప్రమదోన్మిషితాఖిలాంగకూ
బూనరిచె నన్ను నిప్పు డిటు లెన్నడు క్రమ్మర నిష్ఠ
బాపునో!

[శ్లో॥ పునః ప్రసన్నేన ముఖేన్దుతేజసా,
పురోవతీర్ణస్య కృపామహాంబుధేః ।
తదేవ లీలాముకళీరవామృతం,
సమాధివిఘ్నాయ కదాను మే భవేత్ ?॥

(తరువాత సోమగిరినిఁ జూచి యాశ్చర్యవినయ సంభ్రమములతో లేచి]

శా॥ ఆత్మాభిన్నుఁడు సద్గురుం డెవఁడు నన్
సంసారనిర్ముక్తుగా
గారుణ్యాతిశయమ్మునన్ సలిపె
విశ్వాచార్యుఁ డతఁడ్వారుసో

త్తంసుం గొల్చెద నిచ్చలుం జరణపద్మాపాత
పూర్వంబుగన్
ధర్మాధర్మ విసర్జనై కశరణాభ్యాసంబు
సంధించుచున్.

[శ్లో॥ య స్యాత్మభూతస్య గురోః ప్రసాదాద్,
అహం విముక్తో స్మి శరీరబంధాత్,
సర్వోపదేష్టుః పురుషోత్తమస్య,
తస్యాంఘ్రిపద్మం ప్రణతో స్మి నిత్యం॥

[అని సోమగిరికి సాష్టాంగము పడును. గురువు నారాయణస్మరణములు చేయును. చింతామణికిఁ గూడ సమాధి విడి ఆమె సోమగిరికి వన్దనములు చేయును. ఆయన నారాయణస్మరణములు చేయును.]

సోమగిరి :-[కళానిధీచింతామణులకు మధ్యమున నిలచి వారి భుజములమీఁద చెరియొక చేయి వేసి దగ్గరకు తీసికొని] బిడ్డలారా! మీ కిప్పటికి జరిగినదంతయు నాకు దెలియును. మీ రెరుగని కొన్ని దేవరహస్యములఁ జెప్పెదను వినుడు. కళానిధి పూర్వజన్మమున జయదేవమహాకవి. కామేశ్వరీచింతామణు లిద్దరునుఁ గలపినమొత్తము పద్మావతీదేవి. పద్మావతి బ్రాహ్మణి యగుటవలనఁ జిన్నతనమున లాస్యగానాదికళల శాస్త్రీయముగ నేర్చినది కాదు. భర్తకోరికపై నాయనగురుత్వమున నృత్యగానాదికళల నోపిన

ట్లొనర్చుచుండెడిది. కాని, తనప్రావీణ్యమం దామెకే తృప్తి యుండెడిదికాదు. తనభర్తతన్మయానందముల మునుగునట్లు తా నాకళల నిర్వర్తింప లేకపోవుటకు వగచుచుండెడిది.

వేదండ :-వగచుటకు పాప మామెలోప మేమియున్నది ? బ్రాహ్మణగృహిణీధర్మములు నడపుట కాకళ లక్కఱ లేదు. కావున నామెను గన్నవా రావిద్యల తీర్పు చేయలేదు. వయస్సు ముదరినతరువాత నామె భర్త కాకళలతోఁ బనిపట్టినంతమాత్రానఁ జిరకాల సాధ్యము లైనవియు, లేతరికమున నారంభింప వలసి నవియు నగునావిద్య లాకస్మికముగా నామెకెట్లు అలవడును ?

సోమగిరి :-అట్టి యసంతృప్తి గలిగినప్పుడెల్ల గృష్ణప్రార్థనము జేయుటలోఁ దమకు ముందుజన్మ మున్నచోఁ దానా విద్యల నుత్తమకౌశలము కలిగి తనభర్త కలౌకికా నందము గూర్చునట్లు వర మడుగు చుండెడిది. ఆ దంపతుల కాజన్మమున సంచితకర్మము పూర్తిగాఁ దీరక మఱల నీజన్మ మెత్తవలసి వచ్చెను. అందు వలన బూర్వపుపద్మావతి యీదేశమున బ్రాహ్మణిగా బుట్టి యావిద్యలు నేర్చుటకు వీలు లేదు గానఁ గామేశ్వరిగాను, చింతామణిగాను రెండుశరీర

ములతోఁ బుట్టి, రెండుధర్మములను వేర్వేరుగా నుత్తమోత్తమముగా నెరవేర్చినది.

చింతామణి :-లోకవిశిష్టమైనమాయిద్దరి పరస్పరప్రేమము నకు సానుభూతికిని నాత్మానుబంధమునకునుఁ గారణ మది కావలయు !

సోమగిరి :-కావున, నేకాత్మలగువారిలో నొకరు ముందే భూమిని వీడిన రెండవవారికి దైహికవాంఛలు నశించును.

చింతామణి :-నా కిప్పుడు పూర్ణజీవము లున్నట్లుగాని శరీరవాంఛలు గాని తోఁచుట లేదు.

సోమగిరి :-మీ రిరువురు పూర్ణవైరాగ్యధికారులై నందున నిఁకఁ గామేశ్వరి కిక్కడఁ బని లేక యీభూమిని వీడి నది. ఆమెకొఱ కెవ్వరును శోకింపఁ బనిలేదు.

కళానిధి :-భగవంతుడా ! నా కిఁక నేమియాజ్ఞ ? నాకుఁ బైయాశ్రమము ననుగ్రహించుటకుఁ దమకన్నఁ దగినదాత లెవరు ?

సోమగిరి :-నీకు సక్రమసన్న్యాస మక్కఱ లేదు. నీవు యోగ నిష్ఠుఁడవై వైరాగ్యమున దేశసంచారముఁ జేయుచుఁ గృష్ణమహిమమును భక్తియోగమునుఁ బ్రజలకు నుపదేశించుచుఁ గాలక్షేపము జేయుము, నీకు

"లీలాశుకుఁ" డని యోగాశ్రమనామమును జే
యుంచుచున్నారము. నీ విదివఱకుఁ గూర్చుచున్న
గ్రంథమునకు **"శ్రీ కృష్ణకర్ణామృత"** మని పేరిడి
దాని కింకనుఁజేర్చుచు లోకమునఁ బ్రచురింపుము.
శ్రీకృష్ణభగవానుఁడు నిన్నుఁ గ్రీడాశుకమువలె బెంచీ
నీకు మాటలు నేర్పి, నీచేఁ బలికించి, యాపలుకుల
మాధుర్యమున కానందించుటచే నీ వాతని లీలాశుక
మవును, నీగ్రంథ మాతనికిఁ గర్ణామృతమును.

కళానిధి :-మహాప్రసాదము. ధన్యుడను.

చం॥ శివశివ ! బాల్తిగా జిఱుతపాయము,
ముద్దులుగుల్కు మోము బల్
నవనవలాడుగాయము నమాయికతం
దటితీపులూరుచూ
పులు వెలయంగఁ గెంబెదవిఁ
బిల్లనగ్రోవి నమర్చి విశ్వమో
హనముగ నూదుఁగృష్ణు పరమాధురిలో
లవలేశ మించుకే
నరపరమాణువంత సమకూరును గావుత
నాదు పల్కులన్॥

[పంచపాది]

[శ్లో॥ కమనీయకిశోరముగ్ధమూర్తేః,
కలవేణుక్వణితాదృతాననేన్దోః।
మమ వాచి విజృంభతాం మురారేః
మధురిమ్ణః కణికాపి కాపి కాపి॥]

చింతామణి :-మహాస్వామీ ! నా కేమిసెలవు ?

సోమగిరి :-నీవు స్త్రీ వగుటంబట్టి దేశాటనము పనికిరాదు. నీసంపద లింకేమైన మిగిలియున్న శీఘ్రముగా దానము చేసి యీభవనమును విడిచి, ఈలంకకుఁ బశ్చిమ తీరమునఁ జిన్నయాశ్రమ మేర్పరచుకొని, పర్ణశాలలో వసింపుము. యోగమునఁ గాలము గడుపుకొనుము. నాయానలు మీ కాయాసకరములుగా నుండునా ?

కళానిధి, చింతామణులు : స్వామీ ! మీయనుగ్రహము మా యదృష్టము. మీమాటలు మాకు ముక్తి మాటలు. మీయాదేశము లుత్తమోపదేశములు. మీయవ్యాజకరుణకు మేము ఋణస్థులము శాశ్వతానందదాత లగుమీకు మాసాష్టాంగనమస్సులు.

[అని మ్రొక్కుదురు.]

సోమగిరి :-శాశ్వతానందము నిచ్చు "భక్తిజ్ఞానవైరాగ్యములే" సంపూర్ణకళలు. వాటికిని సక్రమమైన చిరాభ్యాసము కలిగిననే కౌశల మేర్పడును. ఐహిక కళలకును, వాటికినిఁ బ్రయోగమున భేదమున్నది. విలాసకళలయానందము ప్రత్యక్షమును క్షణికమును. భక్త్యాదు లాధ్యాత్మికానందములు, వాటికిఁ బ్రకటనమును బహుజనాహ్లాదము నుండవు. మీరు క్రింది కళలఁ గుశలులై వాటిని సాధనములుగా జేసికొని

యాధ్యాత్మికకళల నభ్యసించితిరి. కావున మహదా నందము రుచితగిలిన మీా కైహికసుఖములను ద్యజించుట కష్టముగా నుండదు.

కళానిధి చింతామణులు : మే మిప్పుడానందము ననుభవించుచున్నారము, గాని యీలోకమునుఁ బరిత్యజించు చున్నార మని చింత యెంతమాత్రమును లేదు.

ACCNO

సోమగిరి :-బ్రహ్మానందము! కళానిధీ! నీవును వేదన్నయు శ్రీకాకుళము పోవుఁడు. అక్కడ జరుపవలసిన విధులు నెఱవేర్చి యనంతరము నీదారినిఁ బొమ్ము.

కళానిధి :-చిత్తము! [అని వందనములు చేయును, వేదన్నయు వందనములు చేయును.]

చింతామణి :-[కళానిధి వేదన్నల నుద్దేశించి] తమ రిద్దరాచిన్నిపడవను తెడ్లతో నడపుకొని దయచేయుడు. ఈజన్మమున కివే నాకడసారి నమస్సులు !

[అని యుభయులపాదములకు నమస్కరించుచుండగా]

894.8132
YEN

కళానిధి :-సచ్చిదానంద ప్రాప్తి రస్తు !!!

వేదంభట్టు :-తథాస్తు!

C4 40=00

[కళానిధి వేదండభట్టులు పడవలోఁ జేరియొక కొమ్మున గూర్చుండుదురు. వేదన్న తెడ్లు వేయు

చుండును. కళానిధి వెనుకకుఁ దిరిగి, సోపానముల మీఁద నిలచి పడమవంకకుఁ జూచుచున్నఁ జింతామణి సోమగిరుల నుద్దేశించుచుఁ బాడును.]

కళానిధి :-చింతామణి ర్జయతు సోమగిరి ర్గురు ర్మే
శిక్షాగురుశ్చ భగవాన్ శిఖిపింఛమౌళిః ।
యత్పాదకల్పతరుపల్లవశేఖరేషు
లీలాస్వయంవరరసం లభతే జయశ్రీః॥

[తెర పడుచుండును.]

జయ జయ జయ దేవదేవ దేవ !
త్రిభువనమంగళదివ్యనామధేయ !
జయ జయ జయ బాలకృష్ణదేవ !
శ్రవణమనో **నయనామృ** తావతార !!!

[తెర సాంతముగాఁ బడును]

"సచ్చిదానందయోగ" మను
షష్ఠాంకము సంపూర్ణము.

"నయనామృతము" సంపూర్ణము.

శ్రీకృష్ణార్పణమస్తు.

---